# చతుర

ఫిబ్రవరి 1983

సంపుటి : 6

సంచిక : 1




## ఈ నెల సమగ్ర నవల

అనుకోకుండా ఓ అందమైన అమ్మాయి ఫొటో పడిందతని చేతిలో. కుర్రతనం ఇంకా పూర్తిగా వదలని ఆ యువ సాహసి ఇంకెవరికో రాసిన ఆ అమ్మాయి ఉత్తరం మూలంగా ఓ ప్రముఖ రచయిత వేషం వేయటానికికూడా వెనుకాడలేదు. ఇంకెవరినో అభిమానిస్తున్న ఆవిడకు ఇతనే అభిమానిగా మారి ఆమెను తన

# అభిమాని...

గా మార్చుకోవాలని ప్రాణాలకు తెగించి ఆమె ఉండే "బాంబ్ నిలయం"లోకి ప్రవేశించాడు. ఏ క్షణాన్నయినా పేలిపోయే ఆటంబాంబులాంటి ఆమె తండ్రికి ఎదురయేందుకు కూడా సాహసించాడు....ఆ తర్వాత....?

## యర్రంశెట్టి శాయి

ఆద్యంతం నవ్విస్తూ హాస్యరసవాహినిగా తీర్చిదిద్దిన 'అభిమాని' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

ముఖచిత్రం : యస్. శివన్నారాయణ

రెండవ కవరు: }
మూడవ కవరు: } బ్రహ్మదేవ్

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60–70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర

*ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.*




## ఇది హఠాత్తుగా తయారైనదేం కాదు కాని, షేవింగ్ క్షేత్రంలో ప్రమాణాలను స్థాపిస్తూ వస్తున్న ఉత్కృష్ట నాణ్యత ఫలితమే ఇలాంటి రేజర్ బ్లేడ్ విల్ట్‌ఎడ్జ్.

విల్ట్ ఎడ్జ్,
విల్కిన్‌సన్ స్వోర్డ్ వారి ఉత్కృష్ట నాణ్యత ఫలితమే ఈ రేజర్ బ్లేడ్. ప్రపంచంలోని అత్యంత నిశితమైన బ్లేడ్‌ల వెనుక వున్న ఉత్కృష్ట నాణ్యత.

విల్ట్ ఎడ్జ్.
దిగుమతి చేయబడిన ఉక్కుతో తయారై, యాంత్రిక సానరాయి మరియు తోలుపట్టీ మీద. పదును పెట్టబడి 'గోథిక్ ఆర్చ్' ఆకారం పొందిన మొనతో కూడిన రేజర్ బ్లేడ్ — ఈ గోథిక్ ఆర్చ్ మొన ఎన్నో సంవత్సరాల తీవ్ర సంశోధన ద్వారా ఉత్కృష్టం చేయబడి మరియు పి.టి.ఎఫ్.ఇ. పూత కల్గినది. షేవింగ్ టెక్నాలజీలో సంభవించిన మహత్వపూర్ణమైన ఏకైక ప్రగతి.




మీకు మునుపెన్నడూ లభించని అతి నున్నని, సురక్షితమైన మరియు చక్కటి షేవ్‌ను అందించడానికి, ఆహా...షేవ్ తర్వాత షేవ్...ఎన్నో-మరెన్నో షేవ్‌లు.

నిజానికి ఎన్ని ఎక్కువ షేవ్‌లంటే దీని కోసం కాస్త ఎక్కువ పైకాన్ని ఖర్చు పెట్టడానికి మీరు ఏమాత్రం వెనుకాడరు.

విల్ట్ ఎడ్జ్.
ఇది మీపై చెరగని ముద్రను వేసి పోతుంది. దీని నాణ్యత అసమానం, దీనితో లభించే షేవ్‌లు అధికం.

**విల్ట్‌ఎడ్జ్: మరింత ఎక్కువ పొందాలని అభిలషించేవారి కోసం- ఎక్కువ షేవ్‌లు, ఎక్కువ సుఖం, ఎక్కువ సంతృప్తి.**



**Wiltech India Ltd.**

Rediffusion/WIL/1785h/TL

## బహూమతి

ఒక అందమైన సాయంత్రంవేళ ఆఫీసర్ గారు జవాన్ని కేకేసి అన్నారు–"అతి కష్టంమీద ఈరోజు టైపిస్ట్ ఓవర్ టైం చేయటానికి అంగీకరించింది. చాలావర్క్ పెండింగ్‌లో ఉంది. నేను ఇక్కడ లేకుంటే పనికాదు. అంచేత నువ్వు మా ఇంటికెళ్లి 'అయ్యగారు ఈరోజు రారు. ఆఫీసు...అర్జంట్ పని..'అని అమ్మగారితో చెప్పు" అంటూ ఆఫీసర్‌గారు ఆజ్ఞ జారీ చేశారు.

కొత్తగా ఉద్యోగంలో చేరిన యువ జవాన్ వినయంగా వంగి సలాంచేసి "జీ హుజూర్" అని ఆఫీసర్‌గారి ఇంటివేపు వెళ్లిపోయాడు.

రెండవరోజు ఉదయాన్నే ఆఫీసుకు వచ్చిచూస్తే ఆఫీసరుగారు, టైపిస్టుగారు ఇద్దరూ టేబుల్ మీద ఒకరి కౌగిటిలో



# కతలు



మరొకరు ఆదమరిచి నిద్రపోతున్నారు. 'వాళ్ళను త్వరగా లేపకుంటే ఇతర ఉద్యోగులు వచ్చేస్తారు' అనుకుని జవాన్ తలుపుతట్టి ఇద్దరికి మేల్కొలుపుపాడాడు.

ఆరోజు సాయంత్రం ఆఫీసరుగారు మళ్ళీ జవాన్ని పిలిచి "ఇవ్వాళకూడా టైపిస్టుచేత ఓవర్ టైం చేయించవలసి ఉంది. అంచేత అయ్యగారు రాత్రికిరారని అమ్మగారితో చెప్ప...పో...." అన్నారు.

జవాన్ మరికాస్త వంగి సలాంచేస్తూ "అయ్యగారూ! మీరేం కంగారుపడకండి. నిశ్చింతగా వుండండి. రాత్రి అమ్మగారికి నేను కబురుచెప్పగానే ఎగిరిగంతేసి ఐదు రూపాయలు ఇనాం ఇచ్చారు. రేపు రాత్రికికూడా రాకుండా ఉంటే బాగుండును అన్నారుకూడా" అంటూ ఆనందపడిపోయాడు. జవాన్ ఆ తర్వాత ఆఫీసరుగారి ఇంటివేపు పరుగుతీశాడు — మరో ఐదురూపాయలు అందుకోడానికి.

# ఎందుకంటే ఫారెక్స్ పాపాయిల సత్వరమైన మరియు సంపూర్ణమైన పెరుగుదల కోసం అధిక పుష్టికరమైన ఘన ఆహారం.

**మీ పాపాయి పెరుగుదల కోసం ప్రొటీన్‌తో సమృద్ధమైనది ఫారెక్స్**

ప్రొటీన్ కొరత నుండి పాపాయిని రక్షించడానికి బ్రాండ్ చేయబడిన ఘన ఆహారంలోని ప్రొటీన్ పరిమాణం మరియు ఘన ఆహారం తయారు చేసి ఇచ్చే తీరుకు సంబంధించిన కొన్ని ప్రమాణాలను విశ్వ ఆరోగ్య సంస్థ నిర్ధారించినది. నిర్దేశించిన రీతిలో ఫారెక్స్ ఘన ఆహారం తయారు చేసి ఇస్తే అది మీ పాపాయి పెరుగుదలకు అత్యావశ్యకమైన ప్రొటీన్‌ను సమృద్ధంగా కల్గి వుంటుంది.

**ఆరోగ్యవంతమైన రక్తం కోసం అదనంగా ఐరన్ కల్గి వున్నది ఫారెక్స్**

“తల్లి నుంచి పెద్ద ఐరన్ నిల్వతో సహా పుడతాడు పాపాయి. అయితే పుట్టిన తర్వాత ఈ నిల్వ క్రమేపీ తరిగి పోతుంది. పాలు మంచి ఆహారమే అయినప్పటికీ, ఐరన్ లేనందు వల్ల అది సంపూర్ణ ఆహారం కాదు. అందుకే పాపాయికి ఐరన్ గల ఆహారాలు కావాలి.”

—డా. సుభాష్ సి. ఆర్య.

పాపాయి రక్తానికి, రోగ-ప్రతి రోధక శక్తిని ఎక్కువ చేయడానికి, అతి సామాన్య ఆరోగ్యం మరియు పెరుగుదలకోసం అత్యంత ముఖ్యమైన ఐరన్ అదనంగా కల్గి వున్నది ఫారెక్స్.

**పాపాయి పళ్లు మరియు ఎముకలకు అతి ముఖ్యమైన కాల్షియం మరియు ఫాస్ఫరస్ సరియైన నిష్పత్తిలో కల్గి వున్నది ఫారెక్స్**

పళ్లు మరియు ఎముకలు చక్కగా ఏర్పడటానికి మీ పాపాయికి కావాలి కాల్షియం మరియు ఫాస్ఫరస్. కాని, 2:1 — ఈ నిష్పత్తిలో ఈ రెండూ కలిసి వుంటేనే పాపాయికి ఎక్కువ లాభం చేకూరుతుంది. ఈ అత్యావశ్యక తత్వములను ఆదర్శ ప్రాయమైన నిష్పత్తిలో కల్గి వున్నది ఫారెక్స్. అది మీ పాపాయి ఎక్కువ ఆరోగ్యవంతమైన ఎముకలు మరియు ఎక్కువ దృఢమైన పళ్లు నిశ్చయంగా పొందేలా చేస్తుంది.

**ఎంతో సులభంగా జీర్ణమవుతుంది ఫారెక్స్**

మీ పాపాయి సున్నితమైన జీర్ణ శక్తికి అనువుగా ప్రత్యేకంగా ముందుగానే పచనం చేయబడినది ఫారెక్స్.






డాక్టర్లు సిఫార్సు చేస్తారు

**ఫారెక్స్®**

గ్లాక్సో ఉత్పాదన

CASGLF-39-184 TEL

# క్వాలిటీ

సర్వకాల సర్వావస్థల్లోనూ కోతలు జెట్ స్పీడ్‌తో కోయటానికి తయారుగా ఉంటుంది శ్రీమతి తాయారు. బతికేది చాలీ చాలని మధ్యతరగతి బతుకు. నాలుక మీద మాత్రం సామ్రాజ్యాల పలుకులు!

ఒకరోజు తాయారు ఇంటికి దూర ప్రాంతం నుంచి బంధువులొచ్చారు. వాళ్లు రాకముందే తాయారు నౌకరుకు ఒక చిట్కా నేర్పి వుంచింది. ఇంటికి ఎప్పుడయినా బంధువులొస్తే తాయారు వాళ్ళ మధ్య కూర్చుని నౌకరుని కేకేసి అతిథుల కోసం టిఫిన్ పట్రామంటుంది. అప్పుడు నౌకరు వెంటనే "టిఫిన్ దేశీయమా...? విదేశీయమా దేశీయమైతే అందులో ఏ క్వాలిటీ...? విదేశీయమైతే అందులో మళ్ళీ ఏ క్వాలిటీ? ఫ్రిజ్‌లో పెట్టిందా? లేక - బయట ఉంచిందా?''ఇలా చాలా ఖరీదైన విషయాలు అడుగుతాడు. అప్పుడు నౌకరు మాటలు విని అతిథులు డంగైపోయి వీళ్ళ లెవల్‌కు మనం తూగేలా లేమనుకుని "అబ్బే వద్దండి.మేం ఇప్పుడే తినివచ్చాం" అనేస్తారు-అదీ తాయారు ఐడియా.

ఆ రోజు వచ్చిన బంధువుల్ని తాయారు అట్టహాసంగా లోనికి ఆహ్వానించి కూర్చోబెట్టి అందరిమధ్యలో తనూ కూర్చుని పిచ్చాపాటీ కోతలుకోసేస్తూ మధ్యలో నౌకర్ని కేకేసి "అతిథుల కోసం పళ్ళరసం పట్రా" అంది.

"ఏ రసం పట్రామంటారు? మామిడి రసమా? నిమ్మరసమా? జామరసమా..? కమలారసమా? బత్తాయిరసమా ...? నారింజరసమా...? ఇండియా పళ్ళా... ఇంగ్లండు పళ్లా... ఏవి...?" అంటూ అర్ధగంట సేపు లిస్టుచదివాడు. అతిథులు కంగారుపడిపోయి "ఇప్పుడే పీకలదాకా తినివచ్చాం.. ఏమీ వద్దండీ" అనేసి వెళ్ళిపోవటానికి లేచినిలబడుతూ - "పెద్దాయన దర్శనం కూడా లభిస్తే బావుండేది" అన్నారు.

శ్రీమతి తాయారు మళ్ళీ నౌకర్ని కేకేసి ''బాబీ నాన్నగారిని పిలువు....'' అంది.

"ఏ నాన్నగారిని? ఇండియా నాన్నగారినా? ఇంగ్లండు నాన్నగారినా? జపాను నాన్నగారినా? లోకల్ నాన్నగారినా?"



నౌకర్ లిస్టు చదవసాగాడు.

తయారు తల నేలకు వాలిపోయింది. అసలు బండారం తెలుసుకున్న అతిథులు 'ఆహా...ఏం క్వాలిటీ' అనుకుంటూ వెళ్ళిపోయారు.

— పథిక్

# ఫైటింగ్

వెంకట్రావ్ ఆ రోజు చాలా కోపంగా వున్నాడు. కనిపించినవాణ్ని కరిచేద్దామన్నంత తిక్కగా వున్నాడు. రోజు కంటే గంటన్నర ముందొచ్చి ఆఫీసులో కూర్చున్నాడు.మధ్యాహ్నందాకా చూసినా ఎదురు సీటు పేర్రాజుకున్నాడా అతని సంగతి బొత్తిగా బోధపడలేదు.వెంకట్రావ్ టైపింగులో రోజూవినిపించే లయతాళాలకి బదులు ఈ రోజు ప్రళయనాదం వినిపించింది పేర్రాజుకి. ఇదేదో కొంప ముంచే కేసే అనుకున్నాడు

లంచవర్లో మెల్లిగా విషయం కదిపాడు పేర్రాజు. ఖస్సుమన్నాడు వెంకట్రావ్.

"సరేగురూ! నీ సర్వీసంత వయసుంది మన స్నేహానికి. ఈనాటికి నేను కూడా నీకు కానివాణ్నయిపోయాను! ఓకే ఐడోంట్ మైండ్. కానీ ఫ్రండుగా నీకు నాదోసలహా! మనసు బాలేనపుడు అలా బార్ కెళ్ళి ఓ పురిషెడు విస్కీ పట్టావంటే.. ఓహ్! వేరే చెప్పాలా!! అయినా నీకు బార్ విజిట్లు కొత్తేమీ కాదుగదా! నీ మనసు తేలిక పడాలంటే మదిర తప్పదు గురూ! తర్వాత నీ ఇష్టం" అనేసి సీట్లోకి వెళ్ళిపోయాడు.

పేర్రాజు హితోపదేశం వెంకట్రావ్ మీద బానే పనిచేసింది ఆఫీసు వదలగానే తిన్నగా 'నిషా' బార్లో దూరాడు. వెళ్ళీవెళ్ళగానే వెయిటర్‌ని పిల్చి "ఊ... అర్జంటుగా ఓ పెగ్ విస్కీ పట్రా! పెద్ద ఫైటింగ్ జరగబోతోందిక్కడ" అన్నాడు.

వెయిటర్ తెచ్చిచ్చాడు. అది తాగేసి "కమాన్! ఇంకో పెగ్ పట్రా! ఫైటింగ్‌కి ఇంకెంతో సమయం లేదు" అన్నాడు.

ఈ వరస చూసి బార్ ప్రొప్రయిటర్ తిన్నగా వెంకట్రావ్ దగ్గరికొచ్చాడు. "వచ్చారా! వెరీగుడ్ ! ఇంకో రెండు పెగ్గులు తెప్పించు. ఫైటింగ్ స్టార్ట్ అవడానికి అట్టే టైం లేదు" అన్నాడు వెంకట్రావ్.

సినిమా షూటింగ్ ఏదో ఉంది కాబోలు అనుకుని జేబులోంచి దువ్వెన తీసి తల దువ్వుకుంటూ వెయిటర్‌ని త్వరగా తెమ్మని కోప్పడ్డాడు ప్రొప్రయిటర్.

వెంకట్రావ్ ఉన్నట్టుండి కాసేపు నిశ్శబ్దం అయిపోయాడు. ప్రొప్రయిటర్ సస్పెన్స్ భరించలేక "ఫైటింగ్ సీన్లో ఎవరెవరు పాల్గొంటారుసార్! మామూలు డిష్షుం డిష్షుం యేనా! లేక కరాటే మోడలా" అన్నాడు.

"ఆ...మామూలు డిష్షుంమ్మే. కరాటే నాకు రాదు" అన్నాడు వెంకట్రావ్.

"ఆ....మీరేనా చేసేది! ఇంతకీ మీరు డైరెక్టరా? స్టంటు మాష్టరా? హీరోయా? విలనా?"

"ఏదీ కాదు. టైపిస్టును నేను"

"అదేమిటి?"

"అదంతే! రడీయేనా?"

"నేనా?"

"ఊ!...నీ బిల్లు చెల్లించడానికి నా జేబులో పైసాలేదు. నీకూ, నాకూ డిష్షుం డిష్షుం కాక మరేమిటి?" అన్నాడు వెంకట్రావ్ చొక్కా చేతులు పైకి మడిచి రడీ అయిపోతూ.

— లక్ష్మి





చాలా విచారంగా హోటల్లోకొచ్చి కూర్చున్న సింహాద్రినిచూసి సర్వర్ రామనాధం ఆశ్చర్యపోయాడు. తను సింహాద్రికి సంవత్సరం నుండి భోజనం సర్వ్‌చేస్తున్నాడు.కానీ ఏరోజూ అతనింత దిగులుగా ఉండగా చూడలేదు. ఆఖరికి వర్షాకాలంలో వరసగా వారంరోజులపాటు రోజూ వంకాయ కూరే వండినా అతను చలించలేదు. చిరునవ్వుతో ఆ కూరను పక్కకు తోసేసి పచ్చడితోనే అన్నం తినేసేవాడు.

అలాంటి వ్యక్తి ఇప్పుడిలా విచారంగా ఉండడం అతనికి బాధకలిగించింది. బాధల్లో ఉన్న వ్యక్తికి ఎవరయినా కొంచెం రెండుమాటలు ధైర్యం చెప్తేచాలు-వాళ్ళు ఇట్టే ఆ విచారం నుంచి బయటపడి చిన్న పిల్లలా కేరింతాలు కొడుతూ వెళ్ళిపోతారని ఓ వారపత్రికలో ప్రశ్నలూ జవాబులూ శీర్షికలో చదివాడు తను.

అంచేత ఇప్పుడు అతనికి ధైర్యం చెప్పాలి. అతనూ ఆ బాధలన్నీ మర్చిపోయి-చిన్న పిల్లాడిలా కేరింతలుకొడుతూ ఇంటికెళ్ళాలి. బాధల్లో ఉన్న కస్టమర్‌కి ఆమాత్రం సహాయం చేయడం తన ధర్మం. అదీగాక అతను తనకు చాలా సార్లు 'టిప్' కూడా ఇచ్చాడు. ఓసారి మర్చిపోయి ఒకేరోజున రెండుసార్లు 'టిప్' ఇచ్చాడు కూడా.

"గురూగారూ !" పిల్చాడు రామనాధం.

"ఊఁ" అన్నాడు సింహాద్రి.

"మీరలా దిగులుపడడం బావుండలేదండీ! 'కష్టాలు కలకాలం కాపురముండవు' అని మా ఫ్రెండ్ అదే, శ్రీకృష్ణాకాఫీవిలాస్‌లో సీనియర్ సర్వర్ రామానుజం అంటూండేవాడు. అంచేత ధైర్యం తెచ్చుకోండిసార్! కావడి కొయ్యేనోయ్-కుండలు మన్నేనోయ్ అని పెద్దలన్నారు. అందులో ఎంతగొప్ప నిజం ఉంది...ఒక్కనిమిషం ఆలోచించండి! కావడి విరిచిచూస్తే అందులో నిజంగా కొయ్యే ఉంటుంది. అలాగే కుండలు పగలగొట్టిచూస్తే అందులో మట్టేగా ఉండేది. కాపోతే కాల్చినమట్టి లేదా బంకమట్టి - ఏదొకటి- మొత్తానికి అదిమట్టే.అంతెందుకు సార్! శ్రీనాధుడేమన్నాడు? రాసెడిది భాగవతమట రాయించెడివాడు రామచంద్రుడట - నేరాసిన...నేరాసిన...నేరాసిన ... ఏమిటో గుర్తులేదు అది అగునట! చూశారా ఎంత అద్భుతంగా చెప్పాడో? అంచేత మీరు..."

సింహాద్రి వాలకం గమనించిన రామనాధం తన స్పీచ్ తక్కున ఆపేశాడు- అతను తను చెప్పేమాటలు పిసరంత కూడా వినడంలేదని అనుమానం కలగడంతో.

అంచేత తను ప్రస్తుతం అతనిదృష్టిని అర్జంటుగా ఆకర్షించాలని నిర్ణయించుకున్నాడు.

"గురూగారూ!" వినయంగా పిలిచాడతనిని.

"ఊఁ!" అన్నాడు సింహాద్రి.

"నేను మీతో మాట్లాడుతున్నాను. వింటున్నారా?" అనుమానంగా అడిగాడు.

సింహాద్రి అయోమయంగా అతని వంక చూశాడు.

"ఏమిటన్నావు?"

"నేను చెప్తోంది వింటున్నారా?"

"నువ్వు చెపుతోందా?"

"అవునండీ!"

"ఏమిటి చెప్పటం?"

"అదేనండీ! ధైర్యం చెపుతున్నాను"

"ధైర్యమా?"

"అవునండీ! తమరికే!"

"ఎందుకు ధైర్యం చెప్పడం?"

"అదేనండీ... మీరు ఎంతో దిగులుగా ఉన్నారుకదా! అందుకని"

"దిగులా?"

"అవునండీ! అలా దిగులు పడకూడదండీ! కావడి కొయ్యేనోయ్ కుండలు మట్టేనోయ్ అని పెద్దలన్నారు చూడండి! అది గుర్తుంచుకోవాలన్న మాటండీ మనం. కష్టాలు కలకాలం కాపురం ఉండవు అని కూడా మా రామానుజం అంటాడండీ"

సింహాద్రికేమీ అర్థం కాలేదు.

"రామానుజమా?"

"అవునండీ!"

"ఎవరతను?"

"శ్రీకృష్ణా కాఫీవిలాస్‌లో సీనియర్ సర్వరండీ! నాకు మంచి ఫ్రెండ్"

"అతనేమన్నాడు"

"కావడి మట్టేనోయ్, కుండలు కొయ్యేనోయ్ అన్న మాట ఎప్పుడూ కోట్ చేస్తూంటాడండీ అతను. కష్టాలు కలకాలం కాపురం చేయవు అని కూడా అతనే అంటూంటాడండీ!"

"ఎందుకలా అనటం?"

రామనాథం ఉక్కిరిబిక్కిరయ్యాడు.

"ఎందుకంటే... అది... అలాఅనటం... మరి అతని మనసులోని విషయం అన్న మాటండీ అది! అదేకాదండి! ఇంకెన్నో అలాంటి మాటలు చెప్తాడండి! అది విన్నప్పుడు మనకి భలే ఓదార్పుగా వుంటుందన్న మాటండీ! మీకు తెలుసో తెలీదో ఎవరయినా సరే ఎలాంటి కష్టాల్లో ఇరుక్కున్నా సరే. అందులోనుంచి బయట పడడం చేతకానప్పుడు రామానుజం దగ్గర కెళ్తాడన్న మాటండీ"

"ఎందుకు?"

"అతను ఎవరి కష్టాలకు సరిపోయే గొప్ప కొటేషన్లు వాళ్ళకు చెప్పి ఓదారుస్తాడన్న మాటండీ!"

"ఎవరు ఓదారుస్తారు?"

"అదేనండీ! రామానుజం"

"రామానుజనా?"

"అవునండీ!"

"రామానుజం ఎవరు?"

రామానాథానికి అర్థమయిపోయింది. అతను తనుచెప్పింది వినకపోవడమే కాదు తనతో మాట్లాడుతున్నది కూడా మనసు కెక్కించుకోవడం లేదు. ఇప్పుడు మళ్ళీ రామానుజం హిస్టరీఅంతా అతనికి రిపీట్ చేసినా, ఆ శ్రమంతా వృథా అని తెలిసి పోతోంది.

సరిగ్గా అప్పుడే అతనిని రక్షించడాని కన్నట్లు హోటల్ మేనేజర్ వచ్చాడు అక్కడికి.

"ఏంసార్! రూమ్ మారారా?" అప్యాయంగా సింహాద్రిని పలుకరించాడతను. సింహాద్రి అతనివంక అయోమయంగా చూశాడు.

"రూమా?"

"అవునండీ!"

"ఏ రూము?"

"ఏరూమేమిటి? మీరు ఇప్పుడుంటున్న శివాజీనగర్ రూమ్‌నుంచి మలక్‌పేటలో రూమ్‌కి మారుతున్నానన్నారు కదా?"

"ఓ....అదా!" పూర్తిగా స్పృహలో కొచ్చేశాడు సింహాద్రి.

"అవును- మారేశాను...మారేశాను" అన్నాడు హడావుడిగా.

"ఇప్పుడున్న రూమెక్కడ?" అడిగాడు మేనేజరు.

"అదే - శవం బ్రదర్స్ బ్రాందీషాపు

# ప్రియ తోడుగా ఉంటే చాలు... మరింత సంతృప్తి!




బ్రేక్ ఫాస్ట్ తీసుకొనేవేళ పక్కన 'ప్రియ' ఉంటే ప్రతి ఉదయం రుచులమయం. అదే 'ప్రియ' ఆకర్షణలోని రహస్యం. నోరూరించే పలురకాల పచ్చళ్ల లో మీకు కావలసింది ఎన్నుకోండి.

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ 300, 650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.

* మామిడికాయ * నిమ్మకాయ * టొమాటో
* అల్లం * గోంగూర * ఉసిరికాయ * చింతకాయ
* పండు మిరపకాయ * వంకాయ
తీపిరకాలు : * మామిడికాయ * అల్లం

ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ

ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound
Hyderabad - 500 004

లేదూ? దానికెదురుగ్గా వందమీటర్లు వెళ్తే...."

"శవం(బదర్స్ కాదండీ! శివం(బదర్స్!"

"శివం (బదర్సా?"

"అవునండీ!"

"మరి శవం(బదర్స్ అని రాసి ఉందే మిటి బోర్డు?"

"'శివం' అనే రాశారుగానీ పెయింటర్ 'శి' కొంచెం చెడగొట్టాడటండీ!"

"ఎవరా పెయింటరు?"

"తంగవేలు అనీ కుచన్‌పచేరీలెండి"

"కుచన్ పచేరీయా?"

"అవునండీ!"

"అంటే?"

"అంటే-ఏమోనండీ! నాకూ సరిగ్గా తెలీదు. ఆ పేరుగలవాళ్ళు సికిం(దాబాద్‌లో ఉంటారండి. చాలా ఫేమస్. అతనికి తెలుగు రాదు కదండీ! అందుకని. ఇంతకూ రూమ్ ఎక్కడన్నారు?"

"శవం(బదర్స్ (బాందీషాపు కెదురుగ్గా సందులో వందమీటర్లు నడుస్తే ఆకుపచ్చ ఇల్లు వస్తుంది"

"ఆకుపచ్చ ఇల్లా?" ఆశ్చర్యంగా అడిగాడు మేనేజరు.

"అవును!"

"అందులోకేనా మారింది?"

"ఏం?అందులో ఏమయినా దెయ్యాలు గట్రా వున్నాయా?" అనుమానంగా అడిగాడు సింహా(ది.

"అబ్బెబ్బే అదేం కాదండీ! ఆ గదిలో ఇంతకు ముందు (ప ఖ్యా త రచయిత ధనుంజయగారుండేవారు"

"ధనుంజయా?"

"ఆ ఆయననేనండీ! థరూజెంటిల్మన్. ఓసారి మన హోటల్లో భోజనం చేసి భోజనం అద్భుతంగా వుందని రా(తి మూడింటివరకూ పొగుడుతూ ఇక్కడే కూర్చున్నాడు. వస్తానండి! పాపం మీ చేయి ఎండిపోయినట్లుంది. భో జ న ం కానీండి" అనేసి కాష్‌కౌంటర్ దగ్గరకెళ్ళి పోయాడతను. ఈలోగా రామనాధం మరోసారి అతనికి ధైర్యంచెప్దామని దగ్గర కొచ్చాడు.

"భోజనం చేయండిసార్! బాధపడకండి! కావడి కొయ్యేనోయ్ గుండెలు మన్నేనోయ్. అన్నట్లు మీరు రామానుజం ఎవరని అడిగారుకదూ? శ్రీకృష్ణా కాఫీ విలాస్‌లో సీనియర్ సర్వర్‌లెండి. బాల్డ్ హెడ్! ఈసారివెళ్తే కలుసుకోండి! ఎంత మంచాడంటే ఆరుసార్లు తడవకు ఇరవై ఆరురూపాయలచొప్పుననాకుఅప్పిచ్చాడు. మళ్ళీ నేనిచ్చేవరకూ అడగలేదండి! నేనూ ఇంకా ఇవ్వలేదనుకోండి! అంత గొప్ప మనిషి! అసలు అతనిఖర్మ అలా కాలింది గానీ వాళ్ళ వంశం ఏమిటనుకున్నారు? జమీందారుల ఫామిలీ! అరె! అలా వెళ్ళి పోతున్నారేమిటి? భోజనం పూర్తి కాలేదుగా"

"ఆ! భోజనమా?" అర్థంకానట్లు అడిగాడు సింహా(ది.

"అవునండీ!"

"నేను ఇంకా భోజనం చేయలేదా?"

"లేదండీ! చేద్దామనుకుంటున్నారు-ఇంతలో లేచి వెళ్ళిపోతున్నారు"

సింహా(ది వెనుక్కు వచ్చి మళ్ళీ కుర్చీలో కూర్చున్నాడు.

"తవరేదో చాలా చికాకులో ఉన్నట్లున్నారండీ!" జాలిగా అన్నాడు రామనాధం.

"అవునోయ్" ఒ ప్పు కు న్నా డు సింహా(ది.

ఆ సమయంలో రామనాధం కంటే ఆత్మీయులెవరూ లేరనిపించిందతనికి.

రామనాథం విస్తట్లో భోజనం వడ్డించాడు.

"చికాకులనేవి ఎప్పుడూ ఉంటాయండీ! 'కావడి కొయ్యేనోయ్ - కుండలు మన్నేనోయ్'అని ఊరికేఅన్లేదు.అయినా మనం పట్టించుకోకూడదు. నా సంగతే తీసుకోండి. నా ఇంటి చిరాకులేవో నాకున్నాయ్. అయినాగాని ఇక్కడికి భోజనానికొచ్చేవాళ్ళ చిరాకులు-హోటల్ ప్రొప్రయిటర్ చిరాకులు, ఇవన్నీ కూడా కలిసి పిచ్చెక్కిపోతుందొకోసారి.అయినా నేను ఆ చిరాకులన్నీ పట్టించుకోను. పక్కకు నెట్టేసి..."

"నాకు చికాకులేమీ మీద పడలేదోయ్!" అన్నాడు సింహాద్రి.

"అలాగాండీ!" మరోసారి దెబ్బ తిన్నందుకు అసంతృప్తి కలిగింది రామనాథానికి. సింహాద్రి పడుతున్న ఆవేదనను, తన గొప్ప అనుభవపూర్వకమయిన మాటలతో తొలగించాలనుకున్నా ఆ కోరిక నెరవేరడం లేదు.

"అయ్యో! అదేంటండీ. అన్నంలో మంచినీళ్ళు కలుపుతున్నారు?" సింహాద్రి చేస్తున్న పని చూసి ఖంగారుగా అడిగాడు రామనాథం.

సింహాద్రి ఉలిక్కిపడి తేరుకుని విస్తట్లోకి చూశాడు.

అవును. తాను అన్నంలో నీళ్లుపోసి కలుపుతున్నాడు.

"ఊహూ! లాభంలేదోయ్ - ఇవాళ భోజనం చేయలేను"

"ఎందుకనండీ? ఏం జరిగింది?" ఇంక లాభం లేదని డైరెక్టుగా అడిగేశాడు రామనాథం. సింహాద్రి చేయికడుక్కుని వచ్చాడు.

"ఇప్పుడు కాదోయ్ - మరోసారి చెప్తాను" అనేసి సీరియస్‌గా వెళ్ళిపోయాడతను. రామనాథానికి ఆశ్చర్యంతో పాటు జాలి కలిగింది. సింహాద్రిని అలా మార్చేసినది కష్టాలూ కాదు, చికాకులూ కాదు-మరేమయి ఉంటుంది? హఠాత్తుగా అతనికో ఆలోచన కరెంట్ లాగా బుర్రలో పాకింది.

'హా! అవును గురూగారు ప్రేమలో పడ్డారు' అనుకున్నాడు హుషారుగా.




సింహాద్రి స్టేట్‌బాంక్ దగ్గర బస్‌దిగి ఆబిడ్స్‌రోడ్ మీద నడవసాగాడు. రోడ్డంతా జనంతోనూ వాహనాలతోనూ క్రిక్కిరిసిపోయివుంది.

దూరంగా మైక్‌లో ఓ తెలుగు సినిమాలోని బూతుపాట అందంగా, వివరంగా వినబడుతోంది.

సింహాద్రి మనసు మాత్రం ఆ పాటనూ, జనాన్నీ పట్టించుకోవడం లేదు. ఎక్కడో, ఏవేవో ఆలోచనల్లో పూర్తిగా మునిగిపోయి ఉన్నాడు.

ఉండుండి శ్రీదేవి ఫొటో కళ్ళముందు కనబడి అతని పరిస్థితిని మరింత దిగజార్చేస్తోంది.

అంత అందమయిన అమ్మాయిలు నిజంగా ఉంటారా?

ఉండే ఉంటారు. లేకపోతే ఆ ఫొటో తనకెలా కనబడుతుంది? ఒరిజినల్ ఉంటేనేగదా-ఫొటో అంటూ వచ్చేది?




అవును! ఆ అమ్మాయి ఉంది. ఆ అమ్మాయికో ఇల్లు కూడా ఉంది. ఆ ఇంటి అడ్రసూ ఉంది. శ్రీదేవి, బాంబ్ నిలయం, రెడ్‌ఫీల్డ్, విశాఖపట్నం. అంతా బాగానే ఉందిగానీ 'బాంబ్‌నిలయం' అన్న పేరే తనకర్థం కావటంలేదు.

బాంబ్‌నిలయం అంటే బాంబులకు నిలయం అన్నమాట. అంటే ఇంట్లో బాంబ్‌లుంటాయా?

సింహాద్రికి ఆ మాట నచ్చలేదు. అంత అందమయిన అమ్మాయి నివసించే చోట బాంబులు కూడా నివసిస్తాయా?

నోనో-నెవర్!

ఆ అమ్మాయి ఉన్నచోట నెమళ్ళూ, పావురాళ్ళూ, కుందేళ్ళూ, లేళ్ళూ, జింకలూ- అలాంటి అందమయిన జంతువులూ, పక్షులూ తప్పితే బాంబులుండడానికి వీల్లేదు.

హఠాత్తుగా సింహాద్రి భుజం విరిగి పోయినట్లనిపించింది. సింహాద్రి తూలి పక్కకుపడబోయి ఆగాడు. మరుక్షణం అతని భుజాన్ని అతని నుంచీ వేరు చేయడానికి ప్రయత్నించిన పెద్ద మనిషి సైకిల్‌తోసహా అతనిని దూసుకెళ్ళి ముందు నడుస్తున్న మరో ఇద్దరిని కూడా పక్కకు తోశాక, ఆ తరువాత ఇంకా ముందు చేయి చేయి పట్టుకుని నడుస్తున్న మరో ఓ సర్దార్‌జీనీ, అతని భార్యనూ సైకిల్‌తో విడదీయబోయి కుదరక మధ్యలో దబ్బున పడిపోయాడు. అతని మీద సైకిల్ పడింది. సైకిల్ ఫ్రంట్ వీల్ మీద సర్దార్జీ, బాక్ వీల్ మీద అతని భార్యా కూలబడి పోయారు. మరుక్షణం ఆ సైకిల్ బాధితు లంతా చుట్టూ మూగిపోయారు. ముందు సర్దార్జీని లేపారెవరో. సర్దార్జీ లేచి తన భార్యను లేపాడు. ఆ తరువాత అయిదారు గురు కలిసి సైకిల్ పైకి తీశారు. అప్పుడు అడుగునున్న వ్యక్తి లేచి నిల బడ్డాడు.

సర్దార్జీ ఇంకేమాత్రం ఆలస్యం చేయ కుండా అతని చొక్కా పట్టుకున్నాడు. పట్టుకుని ఆ శాల్తీని గాలిలోకి లేపాడో సారి. అప్పుడు చూశాడు సింహాద్రి.

చూస్తూనే ఆనందంతో గావుకేక పెట్టాడు.

"ఒరే చిరంజీవీ!"

"గాలిలోకి తేలిన చిరంజీవి ఆశ్చ ర్యంగా చుట్టూ చూశాడు. అతనికళ్ళకు సింహాద్రి కనిపించేలోగానే సర్దార్జీ అతనిని కిందకు దింపేశాడు.

"ఆంఖ్ బంద్‌కరకే చలారియా సైకిల్?" కోపంగా చిరంజీవి చొక్కా కాలర్ పట్టుకుని ఊపుతూ అడిగాడు సర్దార్జీ.

"ప్లీజ్ లిఫ్ట్ మీ అప్ ఎగైన్" సర్దార్జీ నడిగాడు చిరంజీవి. మరోసారి గాలిలోకి లేస్తే తనను పిలిచినవారెవరో చూద్దామని అతని కోరిక! కానీ సర్దార్జీ అతని కోరిక తీర్చలేదు.

"పాగల్ హోగయేహో తుమ్‌నే?"

"అయ్ డోన్ట్‌నో హిందీ" అన్నాడు. చిరంజీవి-సర్దార్జీ చేతిలోంచి తన చొక్కా కాలరు విడిపించుకోడానికి ప్రయత్నిస్తూ.

"దెన్ అయ్ విల్ డీల్ ఇన్ ఇంగ్లీష్ ఓన్లీ" అంటూ భుజాలు కొట్టుకుపోయిన నలుగురు బాధితుల్లో ఒకడు ముందు కొచ్చి చిరంజీవి షర్టులో మరికొంతభాగం పట్టుకున్నాడు.

"బాగా ఉతకండి! అప్పుడుగాని కళ్ళు తెరచి సైకిల్ తొక్కడం నేర్చుకోడు" అన్నారు మరొకరు.

"అవును ఉతకాల్సిందే" అన్నాడు ఇంకోడు.

సరిగ్గా ఆ సమయంలో సింహాద్రి ఆ గుంపుని తోసుకుంటూ ముందుకెళ్ళాడు ఉత్సాహంగా.

మరోసారి ఇద్దరి గుప్పెళ్ళలో నలిగి పోతున్న చొక్కా ఓనర్‌ని పరీక్షగా చూశాడు. సందేహం లేదు. వాడు చిరంజీవే!

"ఒరే చిరంజీవీ" మరోసారి ఆప్యాయంగా పిలిచాడు మరో రెండడుగులు ముందుకేస్తూ.

చిరంజీవి సింహాద్రిని చూసి ఆశ్చర్యపోయాడు.

"నువ్వా?" అన్నాడు ఆనందంగా.

"అవును నేనే" అన్నాడు సింహాద్రి చిరునవ్వుతో.

"ఇందాక నేను గాలిలోకి లేచినపుడూ పిలిచింది నువ్వేనా?"

"అవును. అప్పుడే గదా నీ 'వ్యూ' బాగా కనిపించింది"



"నాకాపిలుపు వినిపించిందిగానీ నువ్వనుకోలేదు"

"అబ్బే-నేనే!"

"భలే తమాషాగా కలుసుకున్నాం కదూ?"

"అవును!"

"నిన్నిక్కడ కలుసుకుంటానని నేను ఎప్పుడూ అనుకోలేదు"

"నేనూ అంతే!"

"చాలా కాలమయిపోయింది మనం కలుసుకుని"

"అవును! నైన్‌టీన్ సెవెంటీఎయిట్ 'మే'లో ఆఖరిసారి కలుసుకున్నాం"

"ఎగ్జాక్ట్లీ"

ఇద్దరూ కరచాలనం చేసుకున్నారు.

"పద. ఆ హోటల్లోకూర్చుని మాట్లాడు కుందాం" అన్నాడు సింహాద్రి.

"అవును. చాలా విషయాలు మాట్లా డాలి. పద" అన్నాడు చిరంజీవి.

ఇద్దరూ అడుగులు వేయబోయారు గాని చిరంజీవి చొక్కా అప్పటికీ ఇద్దరి చేతిలో వుండడంవల్ల అతనికి నడవడం సాధ్యంకాలేదు.

"నా చొక్కా మీ చేతిలోవుంది. వద లండి" అన్నాడు చిరంజీవి సర్దార్‌జీతో వినయంగా.

"ఇదిగో ఈయన చేతిలో కూడా కొంచెంవుంది" అన్నాడు సింహాద్రి ఇంకో వ్యక్తిని చూసి.

"మీరు వదిలేయండి. ఫరవాలేదు. నేనింక మామూలుగా నిలబడగలను" అన్నాడు చిరంజీవి ఆ రెండోవ్యక్తితో.

"మొహం పగలగొడతాను రాస్కెల్. మమ్మల్నందరినీ కిందపడేసి తప్పించుకు పోదామనా?" అన్నాడు రెండోవ్యక్తి కోపంగా.

చిరంజీవి ఆశ్చర్యంగా సింహాద్రివేపు చూశాడు.

"ఎవరిగురించి అతను మాట్లాడు తోంది?"

సింహాద్రి పెదవి విరిచాడు "నాకూ అదే అర్థంకావటంలేదు. బహుశా సర్దార్జీ గురించేమో"

"సర్దార్‌జీ గురించి కాదు రా ఇడియట్ నీగురించే. నిన్నే అనేది" ఇంకా కోపంగా అన్నాడా వ్యక్తి.

సర్దార్జీ మరో చేతికున్న వాచీ చూసు కున్నాడు హడావుడిగా.

"సినిమాకి టైమయిపోతోంది" అంది అతని భార్య హిందీలో.

ఇలా కాలనిర్ణయం లేకుండా గంటల కొద్ది చిరంజీవి చొక్కా పట్టుకుని నిలబడడం సర్దార్జీకి నచ్చలేదు. చేయదల్చుకుం దేదో తక్షణం చేసేసి తనదారిన తాను వెళ్ళడం ఉత్తమంగా కనిపించిందతనికి.

వెంటనే పళ్ళుబిగించి, తన బలమంతా ఉపయోగించి రెండోచేత్తో చిరంజీవి నెత్తి మీద గట్టిగాకొట్టాడు.

కానీ చిరంజీవి ఆ పరిస్థితిని ముందే గ్రహించడంచేత టక్కున తల కిందకు వంచేశాడు. దాంతో ఆ బలమయిన సర్దార్జీ చేయి అదే స్పీడ్‌లోవెళ్ళి చిరంజీవిచొక్కా రెండోభాగాన్ని పట్టుకున్న మరో పెద్ద మనిషికి తగిలింది. ఆ పెద్దమనిషికి గూబ అదిరిపోయింది.

"అబ్బా"అంటూ చిరంజీవిని వదిలేసి రెండుచేతుల్తో తన తల పట్టుకున్నాడు. అదిచూసి సర్దార్జీ ఖంగారుపడ్డాడు.

కానీ అప్పటికేదెబ్బతిన్న వ్యక్తితాలూకు మరోవ్యక్తి భీకరంగా ఘర్జిస్తూ సర్దార్జీమీద కొచ్చాడు.

సర్దార్జీ భయం భయంగానే వెనక్కు




తగ్గుతూ పోరబాటెలాజరిగిందో వివరించ డానికి ప్రయత్నించసాగాడు.

అదే సమయమనుకుని చిరంజీవీ, సింహాద్రీ సైకిల్‌తోసహా గుంపుబయటకు జారుకున్నారు.

ఆ తరువాత చాలా సేపటివరకూ ఆ గుంపు అలానే ఉండడం, సర్దార్జీ తరఫు కొంతమందీ, దెబ్బతిన్న వ్యక్తితరఫుకొంత మందిగా విడిపోయి చొక్కాలు పట్టుకుని తోసుకోవడం అంతా ఎదురుగ్గానేహోటల్లో కూర్చున్న సింహాద్రికీ, చిరంజీవికీ కన బడుతూనే వుంది.

"నువ్విక్కడెలా ఉన్నావ్‌రా?" అడిగాడు సింహాద్రి 'టీ' తాగుతూ.

"ఉద్యోగం ఇక్కడేకదామరి! ఇంకెక్క డుంటాను?"

"ఉ ద్యో గ మా?" మరీ ఆశ్చ ర్య పోయాడు సింహాద్రి.

"అవును!"

"నీకు ఉద్యోగం ఎలా దొరికింది?"

"యాక్సిడెంటల్‌గా అయిపోయిందిలే!" చాలా తాపీగా చెప్పాడతను.

"అంటే?"

"అంటే ఏముందీ? ఇంటర్వ్యూలో నా సర్టిఫికెట్‌లన్నీ వివరంగా చూశారు వాళ్ళు"

"అసలు పరీక్ష ఎలా పాసయ్యావ్?"

"రైల్వేసర్వీస్ కమిషన్‌కదా! పెద్దకష్ట మేముంటుంది? పరీక్ష పేపర్ ఎలాగూ రెండురోజులముందు మార్కెట్లో దొరుకు తుందిగా!"

"ఏడ్చావ్‌లే. మిగతా పేపర్లుమాత్రం దొరకవేంటి? అంతెందుకూ? టెన్తుక్లాస్‌వీ, ఇంటర్‌వీ మాత్రం మార్కెట్లో దొరక లేదూ? నాలుగురోజులముందే దొరికాయ్! అయినా నువ్వు ఫెయిలవ్వలేదూ?"

"అఫ్‌కోర్స్ అది నిజమేననుకో! కానీ అప్పుడు ఫెయిలవటానికి కారణం ఉంది"

"ఏమిటది?"

"ఇవేమీ అవసరం లేకుండానే బి.ఎ. పాస్ సర్టిఫికెట్లు ఒకచోట అమ్ముతున్నా రని తెలిసి అక్కడికెళ్ళాను. మన ఆంధ్ర ప్రదేశ్‌లో ఆ సౌకర్యాలు చాలా ఏర్పాటు చేశారుగా! మార్కులు కొనుక్కోవడం, దొంగ బస్‌పాస్‌లు కొనుక్కోవడం, డిగ్రీ సర్టిఫికెట్లు కొనుక్కోవడం..."

"అయితే మరా బి. ఎ. సర్టిఫికెట్ కొన్నావా?"

"కొంచెంలో మిస్సయింది!"

"ఎలా?"

"పాపం. ఆ సర్టిఫికెట్లమ్మేవాడికి హఠాత్తుగాఏదోజబ్బువచ్చిందట.అందుకని అమెరికా వెళ్ళిపోయాడు. దాంతో ట్రబు లయిపోయింది. ఇలా లాభంలేదని ఇంటర్ పరీక్ష పేపర్లే కొని ఆ తరువాత సంవ త్సరం పాసయ్యాను."

"ఇంతకూ నువ్ చేసే ఉద్యోగం ఏమిటి?"

"అసిస్టెంట్ స్టేషన్ మాస్టర్"

సింహాద్రి ఉలిక్కిపడ్డాడు.

"ఆ ఉద్యోగం ఇచ్చారా నీకు?"

"బతిమాలి ఇచ్చారు!"

"ఎందుకు?"

"సాధారణంగా అందరూ ఆ ఉద్యోగం అంటే పారిపోతూంటారు. అందుకని మనలాంటి వాళ్ళకు ఛాన్స్ ఇస్తారన్నమాట!"

"అంటే అది రైళ్ళు నడపడంతో సంబంధం ఉన్న ఉద్యోగం కదూ?"

"అవును"

"అయితే మొన్న ఇక్కడికి దగ్గర్లో జరిగిన రైలు యాక్సిడెంట్ నీ పనేనా?"

అనుమానంగా అడిగాడు సింహాద్రి.

"ఛః కాదు!"

"ఒట్టు అను!"

"ఒట్టు"

'అయితే మరెవరు చేశారు?"

"అదింకా తెలీదు. ఇంజనీరింగ్‌వాళ్ళు సాల్టు అని కారేజ్ వాగన్ డిపార్ట్‌మెంట్ వాళ్ళు-కాదు కారేజ్ వాగన్‌వాళ్ళదే అని ఇంజనీరింగువాళ్లు వాదించుకుంటున్నారు. అది తేలాలంటే ఇంకో ఆర్నెల్లు పడుతుందిలే!"

"ఓహో" అసంతృప్తిగానే అన్నాడు సింహాద్రి. "అయితే ఓ పనిచెయ్! మన సీనియర్ రత్నారావ్‌గాడు ఇక్కడే ఉన్నాడు. వాడెప్పుడయినాకనబడితే నువ్వు చేస్తున్న ఉద్యోగం సంగతి వాడికి ఛస్తే చెప్పకు!"

"ఎందుకని?"

"మొన్న జరిగిన రైలు ప్రమాదంలో వాడి ప్రియురాలి అందమయిన మొఖం



కాస్తా పద్దెనిమిది గాయాలతో అందవికారంగా తయారయిందట. అప్పటినుంచీ కనబడ్డ అసిస్టెంట్ స్టేషన్‌మాస్టర్‌నల్లా పొడుస్తానని కత్తి తీసుకు తిరుగుతున్నాడు".

"కానీ దానికి బాధ్యత 'ఎఎస్సెమ్'ది కాదుగదా!"

"వాడదేమీ వినిపించుకోవటంలేదు. వాడికెవడో చెప్పాడట-ఈ రైల్వుప్రమాదాలకు ముఖ్యకారణం అసిస్టెంట్ స్టేషన్ మాస్టర్లని!"

"చెప్పినవాడెవడో పెద్ద ఇడియట్ అంటాను"

"కానీ రత్నారావ్‌గాడు మాత్రంఅలా అనుకోవటంలేదు"

"పూర్ ఫెలో!"

"ఏదేమయినా నువ్వుమాత్రం వాడు కనబడితే నువ్‌చేసే ఉద్యోగం గురించి చెప్పకు"

"ఛస్తే చెప్పను!"

"మరేమని చెప్తావ్?

"ఆర్టీసీలో డ్రయివర్‌నని చెప్తాను"

"వద్దు! అదికూడా వాడికిష్టం లేదు"

"ఎందుకు?"

"వాడు ఎంతో ప్రేమగా పెంచుకుంటున్న కుక్క ఓసారో రోడ్డుమీదకెడితే ఆర్టీసీ బస్సొకటి దానిమీదనుంచి వెళ్లిపోయిందట!"

"వెరీ బాడ్"

"అవును. పాపం అప్పటినుంచీ వాడు ఆర్టీసీ డ్రయివర్లమీద కూడా కోపంగా ఉన్నాడు!"

"అయితే ఇంకేం చెప్పను?"

"ఏదోవోటి చెప్పు - ఆ రెండూ తప్పించి"

"ఓకే! ఏదో డిస్పెన్సరీలో కాంపౌండర్‌నని చెప్తాను."

"నన్నడిగితే అదీ మంచిది కాదు"

"అయితే మరేం చెప్పమంటావ్?"

"ఏదో కంపెనీకి సేల్స్ రిప్రజెంటేటివ్ అను"

"ఓకే! ఎగ్రీడ్"

ఇద్దరూ 'టీ' తాగేశారు.

"ఇంతకూ నువ్వేంచేస్తున్నావిక్కడ?" అడిగాడు చిరంజీవి.

"ఉద్యోగం"

"పాపం-నువ్ చేసేది ప్రైవేట్ కంపెనీయా, గవర్నమెంటా?" జాలిగా అడిగాడు చిరంజీవి.

"ప్రైవేట్ కంపెనీయే"

"గవర్నమెంట్ అయితే మనం ఇంత జాలిపడాల్సిన పరిస్థితి ఉండేది కాదు"

"అవును!"

"వాళ్ళనంత బలవంతం చేసిన రికమండేషన్ ఎవరిది?"

"మా మామయ్య వాళ్ళ ఫ్రెండ్‌ది"

"ఏమిటంత ప్రేమ మీ మామయ్యకు"

"ప్రేమా కాదు....గుడ్డూ కాదు"

"మరి?"

"అదొక పెద్ద కథ! తరువాత చెప్తాలేగానీ - ఇంతకూ నీ మకాం ఎక్కడ?" అడిగాడు సింహాద్రి.

"కేరాఫ్ రైల్వే ప్లాట్‌ఫారం!"

"అదేమిటి?"

"క్వార్టర్స్ దొరకలేదురా మరి! ఇంకేం చేస్తాను?"

"ఆల్‌రైట్. అయితే ఓ పనిచెయ్"

"ఏమిటో చెప్పు?"

"రేపే నా రూమ్‌కొచ్చేసెయ్"

చిరంజీవి ఆనందంతో పొంగిపోయాడు.

"అయితే మళ్ళీ పాతరోజులు తిరిగి




వచ్చేశాయన్నమాట"
"నిస్సందేహంగా"
"కాలేజీ హాస్టల్లోలాగా గడపొచ్చు"
"దాని బాబులాగా!"
"నిజంగా అవి గోల్డెన్ డేస్‌రా!"
"ప్లాటినమ్"
"మనల్ని హాస్టల్‌నుంచి ప్రిన్స్‌పాల్ గెంటేయక పోయినట్లయితే ఇంకా చాలా ఎంజాయ్ చేసేవాళ్ళం"
"అయినా మనం రూమ్‌లో కుక్కల్ని పెంచుతే ఆ వార్డెన్‌కెందుకు మంట?"
"అదే నాకు తల్చుకున్నప్పుడల్లా వళ్ళు మండేది! కుక్కలన్నాక ఇరవై నాలుగ్గంటలూ రూమ్‌లో ఉండమంటే ఉంటాయా? షైరుకెళ్ళవూ?"
"ఆ నల్లకుక్కయినా వార్డెన్‌ని కరి చేది కాదు. వాడు దానిని చూసి భయపడి పరుగెత్తుతే దానికి అనుమానం వచ్చి- 'సంథింగ్ రాంగ్ విత్ దిస్ ఫెలో' అనుకుని కాలుపట్టుకుంది. ఆమాత్రానికే నానా రాద్ధాంతం చేసేశాడు"
"అక్కడికీ మనమే, మన ఖర్చుతో బొడ్డు చుట్టూ ఇంజక్షన్లు చేయిస్తామని ప్రామిస్ చేశాం కదా! అయినా వినిపించు కోకుండా ప్రిన్సిపాల్‌కి చెప్పాడు"
"అసలు అది పిచ్చికుక్కని వాడి అనుమానం"
"ఛ పాపం. అప్పటికసలు పిచ్చిలేదు దానికి! ఆ తరువాతయినా మననెందుకు కరవబోయిందంటే వాడిని కరవడం మూలాన వాడి పిచ్చే దీనికి ఎక్కి ఉంటుంది. వాడు మొదటినుంచీ క్రాకే కదా!"
"అవునవును"
"కానీ రూమ్ ఖాళీ చేసే రోజు మాత్రం అది మరీ కోపంగా ఉండి మన వెనకపడింది చూడు. నిజంగా మనం భలే లక్కీగా తప్పించుకున్నాం. లేకపోతే ఇద్దరినీ కరిచేది"
"అదిప్పుడెక్కడుందో?"
"నేను ఆమధ్య వెళ్ళినప్పుడు చూశాను. దుర్గామహల్ దగ్గర తిరుగు తోంది. నన్ను చూసి గుర్తుపట్టింది గానీ నేను తెలిసినట్లు సైకిల్ స్పీడుగా తొక్కి తప్పించుకున్నాను"
"పూర్ డాగ్! మంచి ఫీట్స్ చేసేది!"
"ఒండర్‌ఫుల్ ఫీట్స్! ముఖ్యంగా ఎగ్జామినేషన్‌రూమ్‌కిటికీలోనుంచిమనిద్దరికీ కాపీలు అందించేది. గుర్తుందా? సూపర్బ్ ఫీట్! ఓసారి ఆ సీన్ చూసి మన వాచర్లే తప్పట్లుకొట్టారు! కదూ?"
"అవునవును!"
''కాపోతే దానిక్కొంచెం కోపం ఎక్కువ''
''అవును! ఆ కోపం చూసి పిచ్చి అనుకునేవాళ్ళు పిచ్చి వెధవలు!''
''రియల్లీ మాడ్ ఫెలోస్!''
''ఆఖరి పరీక్షనాడు పాపం అది ఎంతో కష్టపడి అందిస్తోన్న ఆఖరి కాపీ కాగితం ఆ వాచర్‌గాడు లాక్కోబోయి నప్పుడే కదా ఒళ్ళుమండి వాడిచేయి పట్టు కుంది.''
''అవును! వాచర్ ఎంత తన్నుకున్నా వదిలిందికాదు. నాకు అదే తల్చుకుంటే ఆశ్చర్యంగా ఉంటుంది. వాచర్ చేయి వదిలేయమని మనం చెప్పినా విన్లేదు''
''ఒకోసారి అంతే అది! మనం చెప్ప గానే వాచర్ చేయి వదిలేస్తే మనం అప్పుడే ఇంటర్ పాసయిపోయే వాళ్ళం''
''దాని మూలాన ఒక సంవత్సరం నష్టపోయాం''
''వాటెవర్ ఇట్ మేబి... స్టిల్



అలాంటి కుక్క, అయ్‌మీన్ అలాంటి ఇంటెలిజెంట్ డాగ్ మనకి దొరకడం చాలా కష్టం''

''కష్టమే అనుకో! బట్ స్టిల్ వుయ్ కెన్ ట్రై!'

''అంటే మళ్ళీ కుక్కని పెంచుదామంటావా?''

''డెఫినెట్‌లీ! ఎలాగూ ఇద్దరం కలిసి ఉండబోతున్నాం కదా! చాలా సరదాగా ఉంటుంది. దానికి అన్నీ నేర్పడం. దాన్తోనే బోలెడు పనులు కూడా చేయించుకోవచ్చు. పాన్‌దుకాన్‌నుంచి సిగరెట్లు, కిళ్ళీలు తెప్పించుకోవడం, పుస్తకాలు సర్దించడం''

''ఓకే. అయితే వెతుకుదాం. మాంచి బ్రీడ్‌కోసం''

''అక్కే! వెతకక్కర్లేదు. నా దృష్టిలో ఒక కుక్క ఉంది''

''ఎక్కడది?'' ఆశ్చర్యంతో అడిగాడు చిరంజీవి.

"నా రూమ్ కెదురుగ్గా ఉన్న ఎలక్ట్రిక్‌పోల్ పక్కనే కూర్చుని ఉంటుంది. వైట్ బాడీ. బ్లాక్ ఫేస్"

"ఐసీ."

"వెరీగుడ్ డాగ్. రూమ్‌లో దిగిన రోజే కనిపెట్టాను. నేను చూస్తూండగానే ఎవరో సైకిల్‌కి సంచీ తగిలించుకుని నడిచి వెళ్తోంటే ఒక్క ఎగురెగిరి సంచీలో పైకి క న బ డు తు న్న రొట్టె ఎత్తుకుపోయింది"

"వెరీ డేరింగ్ కదూ?"

"మనం కొంచెం ట్రైనింగ్ ఇస్తేచాలు! పర్‌ఫెక్ట్‌గా తయారవుతుంది. ఎందుకయినా మంచిదని దానికి నేను నిన్నే బిస్కెట్లు కొనిపెట్టాను. అప్పటినుంచి గది చుట్టూ తిరుగుతోంది"

"వెరీగుడ్" సంతృప్తిగా అన్నాడు చిరంజీవి.

"ఇంక నేను వెళ్ళనామరి? ఇప్పటికే అరగంట ఆలస్యం అయిపోయింది ఆఫీస్‌కి!" అన్నాడు సింహాద్రి టైమ్ చూసుకుంటూ.

"ఓకే! అన్నట్లు నీ రూమ్ అడ్రసేమిటి?"

"అడ్రసేముందిరా! కనుక్కోవడం చాలా తేలిక! మలక్‌పేటకు వచ్చేసెయ్. అక్కడ శవం్బ్రదర్స్ బ్రాందీషాప్ కెదురుగ్గా..."

"శవం బ్రదర్సా?"

"ఓసారీ! శవం్బ్రదర్స్ కాదు. శివం బ్రదర్స్"

"మరి శవం బ్రదర్స్ అంటావేమిటి?"

"అది పెయింటర్ తప్పని హోటల్ మేనేజర్ చెప్పాడులే! పెయింటర్ పేరు తంగవేలు అనీ చకున్‌చికేరి జాతి!"

"చకున్ చికేరీయా?"

"యస్! చకున్‌చికేరీయో, లేక కచిన్ పరాచీయో, పచిన్ కరాచీయో ఏదోసరిగ్గా గుర్తులేదు. అతనికి తెలుగు రాదుకదా! వాళ్లు సికింద్రాబాద్‌లో వెరీఫేమస్. కనుక నువ్వెప్పుడయినా బ్రాందీషాపు పెడితే సికింద్రాబాద్‌ని గుర్తుంచుకుని బోర్డు రాయించేటప్పుడు ఎవైడ్‌చేసెయ్"

"డెఫినెట్‌లీ! ఇంతకూ ఆ శవం్బ్రదర్స్ బ్రాందీషాపు కెంతదూరంలో ఉంటుంది రూమ్?"

"శవంకాదు! శివం్బ్రదర్స్ అనాలి! ఆ బ్రాందీషాపు కెదురుగ్గా సందులో వంద మీటర్లు కొలచినడు! అంతే ఎదురుగ్గా ఆకుపచ్చ బిల్డింగ్! రోడ్‌మీదకే రూమ్. ఎదురుగ్గా ఎలక్ట్రిక్‌పోల్. దానికింద కుక్క—వైట్‌బాడీ, బ్లాక్‌కలర్ మొఖం"

"ఇంటినంబరు?"

"ఇంటి నంబరా! 6-6-3-2-8-1-3-1-628/369-A-S-K-N-C-B-29-బార్..."

చిరంజీవి ఖంగారుపడ్డాడు.

"అది ఇంటినంబరా?"

"ఇంకా రెండుఅంకెలు చెప్తే పూర్తి అవుతుంది!"

"అదేదో కోడ్‌నంబరులాగుందేమిటి? ఇంటినెంబర్లా లేదు!"

"కాదు! ఇంటినెంబరేనని చాలామంది చెప్పారు"

"ఎవరు వాళ్లు?"

"చుట్టుపక్కవాళ్లు. అదీగాక అదంతా ఇంటి గోడమీద కూడ రాసిఉంది!"

"సాధారణంగా బాంకుల్లో స్ట్రాంగ్ రూమ్‌ల తాళంచేతుల కాంబినేషన్ నెంబర్లు ఇలావుంటాయని ఎక్కడో చదివాను"

"అదే హైద్రాబాద్ కార్పొరేషన్‌వాళ్లు కాపీకొట్టారేమో"

 

"సరే. అదంతా ఇదుగో ఈ పుస్త కంలో రాసివ్వు. గుర్తుపెట్టుకోవడం నావల్ల కాదు.

"పూర్ రిమెంబరెన్స్ పవర్" అతని మీద జాలిపడ్డాడు సింహాద్రి.

చిరంజీవి చేతిలోని పుస్తకం తీసుకుని నెంబర్ అంతా రాసిచ్చాడు.

''ఆఖరి రెండునంబర్లూ కొంచెం డౌటుగా వుంది. అయినా ఫరవాలేదులే! ఆ వీధిలోనే ఉన్నాయి. ఆ రెండునెంబర్లు కూడా. కనుక పెద్ద ప్రాబ్లెమ్ ఏమీ వుండదు"

"ఓకే. సాయంత్రం అయిదున్నర కల్లా వచ్చేస్తాను" అన్నాడు చిరంజీవి.

"సరే" ఇద్దరూ బయటకు నడిచారు.

చిరంజీవి సైకిల్ ఎక్కేశాడు.




సింహాద్రి మళ్ళీ రోడ్డుమీద నడవ సాగాడు. హఠాత్తుగా అతనిని దిగులు అవహించింది మళ్ళీ. ఆ దుఃఖంనుంచి ఎలా బయటపడాలో తెలీటంలేదు. శ్రీదేవి-శ్రీదేవి-శ్రీదేవి.

ఆ అమ్మాయి ఫోటో - ఆ అమ్మాయి పేరు. అంతే! ఈ రెండే గత రోజున్నర నుంచీ తనను చిత్రహింసలు పెట్టే స్తున్నాయ్.

అలా ఎందుకు తను కృంగిపోతున్నాడో తనకే అర్థం కావటంలేదు.

రెండు రోజుల క్రితం అసలు ఆ అమ్మాయి ఎవరో, ఆమె పేరేమిటో తనకు తెలీదు. అసలు అలాంటిఅమ్మాయి బాంబే నిలయం, రెడ్ ఫీల్డ్, విశాఖపట్నంలో నివసిస్తోందనీ తెలీదు.

కాని ఈరోజు ఆ పిల్లలేనిదే తన జీవితమే లేదు అనుకునే స్థితికొచ్చేశాడు.

ఎంత తమాషాగా ఉంది?

ఆహా..విధి ఎంతలబీయమైనది-ఊహ! లభీయమైనది కాదు. గభీయమైనది అని ఉండాలి. ఊహూ. అదికూడా కాదు. ఇంకేదో వుండాలి. టెన్త్ క్లాస్‌లో చదివాడు తను. ఊహు టెన్త్‌క్లాస్‌లో కాదు. నైన్త్-నో-ఎయిత్. యస్. ఎయిత్ క్లాస్‌లో. ఏ సబ్జెక్ట్‌లో? ఇంగ్లీష్‌లోనో, తెలుగులోనో? హార్నీ ఇంగ్లీష్‌లో అందెందుకుంటుంది? తెలుగులోనే. అవును. ఆరో పాఠంలోనో ఎనిమిదో పాఠంలోనో ఉండాలి ఆ వాక్యం. విధి ఎంత భగీయమైనది. అవును గుర్తుకొచ్చేసింది. విధి ఎంత భగీయమైనది. కరెక్ట్. తనకుతెలుసు. తనేదీ అంతఈజీగా మర్చిపోడు!

రెండ్రోజులక్రితం ఆఉత్తరంరాకుండా ఉంటే ఇవాళ తనకీ దిగులు, బాధ, నిరుత్సాహం-ఇవేమీ ఉండేవికాదు గదా!

పోనీ కవరు చింపేముందయినా తను దానిమీద అడ్రసు తనదో కాదో ఒక్కసారి చూసి ఉంటే-ఆ కవరు చింపేవాడే కాదుగదా!

పోనీ చింపెనుబో....చింపినవాడు ఆ ఉత్తరంలోనుంచి కిందపడిన ఫొటోచూసి, తనకు సంబంధించినదికాదని తెలుసుకుని మళ్ళీ కవర్లో ఉంచి మళ్ళీ పోస్ట్‌లో పడేస్తే దాన్దారిన అది పోయేదికదా!

అదీ చేయలేదు తను.

ఉత్తరం మొదట్లో శ్రీ ధనుంజయ్‌గారికి

అన్న సంబోధన చూసినప్పుడయినా తను చదవడం ఆపి-ఆ ఉత్తరం అంతకుముందు వరకూ ఆ రూమ్‌లో అద్దెకుఉండి మరో ఇంటికి మారిపోయిన ప్రఖ్యాత రచయిత ధనుంజయ్‌కి ఎవరో రాసిన ఉత్తరం అని తెలుసుకుని రీడైరెక్ట్ చేస్తే ఎంత బాగుం డేది!

అదీ చేయలేదు తను.

ఆ ఫొటో పట్టుకుని రెండుగంటలు అలా చూస్తూ నిలబడిపోయాడు. ఆ తరువాత ఉత్తరం చదివాడు.

'శ్రీ ధనుంజయ్ గారికి!

నమస్తే. ఎవరా అనుకుంటున్నారు కదూ? నేనేనండీ! మీ అభిమాన పాఠకు రాలు శ్రీదేవిని! ఏమిటీ! కోపం వచ్చిందా ఫొటో పంపలేదని! సారీ – ఈమధ్య పరీక్షలుండడం వల్ల మీకు ఉత్తరం రాయ లేకపోయాను. ఈమధ్యే మీరు రాసిన 'గతి తప్పిన మతి' నవల చదివాను. ఇటీజ్ రియల్లీసూపర్బ్! అందులో హీరో విలన్‌ని హిప్నటైజ్ చేయడం-తద్వారా అతను చేసిన కిరాతకాలన్నీ తెలుసుకోవడం- నిజంగా అద్భుతంగా ఉంది.ఈ నవల చదివాక ఎలాగయినాసరే మిమ్మల్నోసారి కలుసుకుని పర్సనల్‌గా అభినందించాలని నిశ్చయించుకున్నాను. నేనూ, మా డాడీ వచ్చే శుక్రవారం పనిమీద హైదరాబాద్ వస్తున్నాము. అక్కడ ఆ ఒక్కరోజే ఉంటాము. కనుక ఆ రోజు సాయంత్రం వీలుచూసుకుని మీ ఇంటికి వస్తున్నాను. దయచేసి నా కోసం ఎదురు చూస్తుంటారని ఆశిస్తాను. మీరు లేకపోతే చాలా డిజపాయింట్ అవ్వాల్సివస్తుంది. ఉంటారుకదూ! శ్రీదేవి'

ఆ క్షణంలో తనకు ఆ రచయిత గాడి మీద ఎక్కడలేని ఈర్ష్యాకలిగింది. అంత అందమయిన అమ్మాయి అభిమానం సంపాదించుకోవడం ఎంత అదృష్టం! ఇంత కాలం స్పోర్ట్స్‌మెన్‌కి, సినిమా స్టార్స్‌కి మాత్రమే గ్లామర్ ఉందనుకుంటూ వచ్చాడు తను. రచయితలకు కూడా గ్లామర్ ఉంటుందని తెలుస్తే తనూ కాలేజ్ డేస్‌లోనే రచయిత అయిపోయేవాడు. ఇప్పుడుమాత్రం మించిపోయిందేముందీ! తర్వాత్వరగా అయిదారు నవలలు రాసేయ వచ్చు! కానీ అర్జెంటుగా శ్రీదేవి అభిమానం సంపాదించటం కష్టం కదా!

తనకు శ్రీదేవి కావాలి ఎలా?

ఆమె వచ్చే శుక్రవారం తన రూమ్ కొస్తుంది.

"నమస్తే" అంటుంది.

తనూ 'నమస్తే' అంటాడు.

"మీరేనాధనుంజయ్‌గారు?" అంటుంది.

"కాదు" అంటాడు తను.

"మరి మీరెవరు?" అంటుంది.

"నేనీ రూమ్‌లో కొత్తగా అద్దెకు వచ్చాను. నాపేరు సింహాద్రి. బిజిలీ అండ్...బజిలీ కంపెనీలో....కంపెనీలో క్లర్క్‌ని. అహహ–మేనేజర్‌ని!"

"ఓ...అయామ్ సారీ! ఇప్పుడు రచయిత ధనుంజయ్‌గారు ఎక్కడుంటు న్నారో మీకు తెలుసా?" అనడుగుతుంది.

"సారీ! తెలీదు" అంటాడు తను.

"థాంక్స్"అనేసి ఆమె వెళ్ళిపోతుంది.

ఆ దుఃఖం భరించలేక తను మూర్ఛ పోతాడు. అంతే! ఇంక ఆమె కనిపించదు. ఆ సీన్ తల్చుకోడానికే దారుణంగా ఉంది.

ఆఫీస్‌కి చేరుకున్నాడు సింహాద్రి.

* * *

సాయంత్రం అయిదున్నరకల్లా ఓ చేతిసంచీ తీసుకుని రూమ్‌కొచ్చేశాడు చిరంజీవి.



"మిగతా సామానేది?" ఆశ్చర్యంగా అడిగాడు సింహాద్రి.

"మిగతా సామానేమిటి?" ఇంకా ఆశ్చర్యంగా అడిగాడు చిరంజీవి.

"అదే-నీ మిగతా సామాను!"

"నా మిగతాసామానేముంది?"

"అదేమిటి? ఇంకేం సామానులేమా?"

"ఇదిగో-సామానంతా ఈ సంచీలోనే ఉంది"

"మరి పక్కబట్టలూ వగయిరా"

"పక్కబట్టలా?" పగలబడి నవ్వాడు చిరంజీవి. "మాకు పక్కబట్టలెందుకు?"

"అంటే?"

"ఎప్పుడూ నైట్ డ్యూటీలు చేసే వాళ్ళకు పక్కబట్టలెందుకురా!"

"మరి రెస్ట్ రోజున ఏం చేస్తావ్?"

"రెస్ట్ రోజున ఫస్ట్‌షోకీ, సెకండ్‌షోకీ వెళ్తాంకదా! ఆ తరువాత చార్‌మినార్ దగ్గరున్న రెడ్‌రోజ్ ఇరానీ హోటల్‌కెళ్ళి 'టీ' తాగిరావాలికదా! అప్పటికి తెల్లారి పోతుంది. అదిసరేగానీ ఇల్లు చాలా బావుందిరా. ఎంతకొన్నావ్?"

"పిచ్చివాగుడు వాగకు. ఈమధ్యే అద్దెకు దిగాను. కొన్నావ్, గిన్నావ్ అంటే ఇంటి ఓనరు ఇద్దరినీ బయటకు గెంటుతాడు"

"ఓకే! ఆ టాపిక్ మానేసి ఎడ్జస్టయి పోదాం!" సంచీ ఓ పక్కనపెట్టి కుర్చీలో కూలబడ్డాడతను.

"ఆహా! ఎంత కాలమయిందిరా పడక్కుర్చీలో కూచ్చుని! అది సరేగాని మన భోజనం మాటేమిటి? మన భోజన వసతి గృహం ఏది?"

"దగ్గరేలే!"

"రుచికరంగా ఉంటుందా, లేక మా రైల్వే కాంటీన్‌లో భోజనం లాగుంటుందా?"

"అంతగొప్పగా ఉండదుగానీ, మరీ రైల్వే కాంటీన్‌లోలా మాత్రం ఉండదు"

"అయితే ఫరవాలేదు. రోజూ భోజనం చేయవచ్చు" ఆనందంగా అన్నాడు చిరంజీవి.

రామనాథం సింహాద్రితోపాటు వచ్చిన చిరంజీవిని చూసి ముచ్చటపడ్డాడు.

మన "ఫ్రెండాండీ?" అనడిగాడు వినయంగా.

"అవును" అన్నాడు సింహాద్రి.

"అంటే-ఇదివరకు వచ్చిన రాధాకృష్ణ గారి లాగానాండీ!"

"అవును"

"అంటే వీరుకూడా టేబుల్ మీద కత్తి గుచ్చి బాంక్ పరీక్షలురాసి బాంక్ ఆఫీసరుగా సెలక్టయారాండీ?"

చిరంజీవి తక్కున అదుపడిపోయాడు.

"నోనో నాటేటాల్! నీ పేరేమిటోయ్?"

"రామనాథం అండీ!"

"చూడు రామనాథం! టేబుల్ మీద కత్తిగుచ్చటం మన పాలసీకాదోయ్! అది మా బాచ్‌మేట్ రాధాగాడి పాలసీ. దానికి మేమేమ్మాత్రం బాధ్యులంకాదు. నాది అంతా శాంతియుతమయిన పాలసీ! లివ్ అండ్ లెట్ లివ్-అంటే బతుకు-బతకనీ పాలసీ అన్నమాట! కత్తులతో సర్వీస్‌కమిషన్ పరీక్షలు రాయడం మన పాలసీకి విరుద్ధం! నేనెప్పుడూ పరీక్ష తాలూకు ప్రశ్నా పత్రాలు కొని రాస్తాను. రెండ్రోజులు ముందే కొంటానన్నమాట. అంతేగాని కత్తులూ కటార్లూ ఛఛ! అవుట్ డేటెడ్! ట్రైబల్ కల్చర్ అది. వాళ్లుకూడా కత్తులు వాడటంలేదిప్పుడు"

రామనాథం ఆనందించాడు.

"మా బాగా చెప్పారుసార్! నిజమే!

కత్తులేమిటండీ నాకర్థంకాదు. అలాంటి వెధవపన్లు బొత్తిగా నచ్చదండీ నాకు. మా తమ్ముడు కూడా రాధాకృష్ణగారి లాగానే కత్తి తీసుకుని పరీక్షకెళ్తూంటే నేను కత్తి లాగేసుకున్నానండీ! అందుకే ఆడు వాచర్ని మెడపిసికి చంపినా కోర్టులో కేసు నిలవలేదండీ! మా నాడు నిర్దోషి అని వదిలేసి పరీక్ష పాస్ చేయించేశారు. అదే నేను గనుక కత్తి లాక్కోపోయినట్లయితే మరి రుజువులు దొరికిపోయి మావాడిని జైల్లో వేసేవారేకదండీ!"

"అవునవును" ఒప్పుకున్నాడు చిరంజీవి.

"నువ్ చాలా ఇంటెలిజెంట్ పనిచేశావ్! అందుకే మనమెప్పుడూ కత్తుల జోలికి పోగూడదోయ్! ఆంధ్రప్రదేశ్ లాంటి అద్భుతమైన రాష్ట్రంలో ఉండి మనకా ఖర్మెందుకు చెప్పు! ఏ పరీక్ష రాయాలన్నా వారం రోజులు ముందే ఆ పరీక్ష క్వొశ్చన్ పేపర్లు ఓపెన్ మార్కెట్లో దొరుకుతుంటే కత్తులేమిటోయ్? మీ తమ్ముడు చాలా అనవసరమయిన అభిప్రాయాల్తో నిండి పోయినట్లున్నాడు. నన్నడిగితే వాచర్ని మెడ పిసకడం కూడా అనవసరం అంటాను. వాళ్ళుమాత్రమేం చేయగలరు? పూర్ ఫెలోస్! కావాలంటే డొక్కలో రెండు పిడిగుద్దులు వేస్తేచాలు. కిక్కురుమనకుండాపడి ఉంటారు. నన్నడిగితే అది కూడా అనవసరం అంటాను. క్వొశ్చన్ పేపర్లు ఈవెనింగ్ మార్కెట్లో ఫుట్ పాత్ల మీద గుట్టలు గుట్టలుగా అమ్ముతుంటే..."

రామనాథానికి విసుగుపుట్టుకొచ్చింది.

"ఇప్పుడే భోజనం వడ్డిస్తాను" అనేసి లోపలకు పరుగెత్తాడు.

* * *

"అవునా! నాకు తెలీకడుగుతాను-నీకీదిక్కుమాలిన బతుకెందుకసలు? డిజిగ్నేషన్ లేని ఉద్యోగం, ఈ గదిలో ఈసురోమంటూ ఉండడం, ఆ హోటల్లో రామనాథంగాడు భోజనం అన్న పేరుతో వడ్డించే చెత్తంతా తినడం- ఎందుకొచ్చిన చావు" గదిలో కొచ్చాక నిద్రావస్థలోకి జారిపోతూ అడిగాడు చిరంజీవి.

"హా..." అని ఆవలించి ఆవలింతలోనే మాట్లాడాడు సింహాద్రి.

"ఇంకేంజేయమన్టావురా"

"నీ తాతెవరో నీపేరు మీద కొంచెం ఆస్తి వదిలివెళ్లాడు కదా! అది తింటూ ఎ.సి. రూమ్లో జీవితం గడపక ఎందుకొచ్చిన తిప్పలు ఇవి"

"అదో పెద్ద కథరా!"

"సీరియల్ నవలంత కథా?"

"అంతకంటే కొంచెం చిన్నది"

"అయితే చెప్పు"

"ఆ ఆస్తికి మావయ్యను ట్రస్టీగా పెట్టాడు తాతయ్య. నాకు పాతికేళ్ళొచ్చే వరకూ ఆ ఆస్తిలో ఒక్క పైస కూడా రాదు"

"వెరీబాడ్" జాలిపడ్డాడు చిరంజీవి.

"చాలా బాడ్" ఒప్పుకున్నాడు సింహాద్రి.

"ఇప్పుడు నీ ఏజ్ ఎంత?"

"ఇరవైనాలుగు"

"అడెడెడెడెడె...నువ్వు ఇంకొక్క సంవత్సరం ముందు పుట్టి వుంటే ఈపాటికి నీ చేతికొచ్చేసేది"

"అవును. కానీ అలా కుదర్లేదుకదా"

కొద్దిసేపు ఆలోచనలోపడ్డాడు చిరంజీవి. తను ఏదోఒక ఉపాయం ఆలోచించి సింహాద్రిని ఆ ట్రస్టీ కోరల నుంచి

రక్షించాలనిపించిందతనికి.

"ఆ! బ్రహ్మాండమయిన అయిడియా దొరికింది" గట్టిగా అరచి లేచి కూర్చున్నాడతను.

"ఏమిటది?" తనూ లేచికూర్చుంటూ అడిగాడు సింహాద్రి.

"నీ యస్సెల్సీ రిజిష్టరులో డేటాఫ్ బర్త్ సంవత్సరం మార్చెయ్"

"అది మావయ్య ఇనప్పెట్టెలో ఉంది"

"ఓహో! అక్కడ దెబ్బతిన్నామన్న మాట! పోనీ ఈ ఒక్క సంవత్సరం ఖర్చులకుగాను ఓ లక్ష అప్పుగా ఇమ్మనకపోయావా?"

"అడిగాన్రా నా బాబూ! లక్షకాదు గదా ఒక్క పైస కూడా ఇవ్వనన్నాడు"



"వట్టి క్రాక్‌లాగ ఉన్నాడు"
"పరమ క్రాక్"
"ఆ రోజు కాలేజీ హాస్టల్ నుంచి ప్రిన్సిపాల్ మనను బయటకు గెంటిన ప్పుడు కూడా మనిద్దరి మీదా చాలా అస

హ్యాంగా అరచి గొడవచేశాడు"

"మనంకాబట్టి ఊరుకున్నాంగానీ అదే ఇంకెవరయినా అయితే 'గెట్ లాస్ట్' అనే వాళ్లు"

"అనేవాళ్ళేంటి చేయించేవాళ్లు"

"ఫైనలియర్లో ఉండగా మనం సెకండ్‌షో సినిమాకెళ్తే హాల్లో ఆటమధ్య మనని సిగరెట్ తాగుతూండగా పట్టుకుని పోలీసులకప్పజెప్పాడు గుర్తుందా?"

"హారిబుల్ నైట్ అది. ఎలా మర్చిపోతాం? పోలీస్‌స్టేషన్లో ఆ నల్లులు, లాకప్‌లో ఉన్న వాళ్ళ కేకలు, ఏడుపులతో పిచ్చెక్కిపోయింది. అవునూ కేవలం సినిమా హాల్లో సిగరెట్ తాగినంత మాత్రాన మనల్ని అలా రాత్రంతా లాకప్‌లో ఎందుకు పడేశారా అనేది నాకింతవరకూ అర్థం కాలేదు"

"ఎందుకేమిట్రా...అలా చేయమన్జెప్పి మావయ్య ఆ పోలీసులకు బోలెడు డబ్బిచ్చాడట"

"కర్కోటకుడు"

"మహా కర్కోటకుడు"

"గుడ్ నైట్. నిద్రొచ్చేసింది" అనేసి గురక మొదలెట్టి నిద్రలోకి జారిపోయాడు చిరంజీవి.




హఠాత్తుగా తమ పక్కనే ఏదో పెద్ద పేలుడు సంభవించిన శబ్దమయేసరికి ఇద్దరకూ ఛటుక్కున మెలకువ వచ్చింది.

"ఏదో పెద్ద శబ్దం అయినట్లుంది కదూ?" కళ్ళు నులుముకుంటూ అన్నాడు సింహాద్రి.

చిరంజీవి ఒప్పుకున్నాడు.

"రెండు రైళ్లు హెడాన్ కొలిజన్ అయినట్లు నాకు కల వచ్చింది. సరిగ్గా అదే సమయానికి ఈ శబ్దం వినిపించేసరికి నిజంగా యాక్సిడెంట్ అయిందేమో అని భయం వేసింది"

"ఇంతకూ ఆ శబ్దం ఏమిటంటావ్?"

"ఏమో అదే అర్థం కావటంలేదు"

ఇద్దరూ మళ్ళా పడుకోబోతూండగా మరోసారి తలుపుమీద పేలుడుపదార్థం విసిరినట్టు తలుపుకొట్టారెవరో!

"అది మన తలుపుకొడుతున్న శబ్దం లాగుంది" అన్నాడు సింహాద్రి లేవకుండానే.

"అవును ఏంచేద్దామంటావ్?"

"తలుపు తీసి చూడు"

"ఇంత అర్ధరాత్రివేళ ఎవరయి ఉంటారంటావ్?"

"ఏమో! ఇంటిఓనరుకి మొన్నే అద్దె కట్టేశాను కదా – ఇంకెవరబ్బా..."

ఇద్దరూ ఆలోచనలో ఉండగానే తలుపులు ఊడిపడేట్లు బాదారెవరో. ఈసారి ఆ శబ్దంతోపాటు "ఒరే సింహాద్రీ" అన్న బండగొంతుకొకటి కూడా కలిసి వినిపించింది.

చిరంజీవి లేచి వెళ్ళి తలుపు కొద్దిగా తెరచి చూశాడు.

మరుక్షణం ఆ సందులోనుంచి లోపలకు దూసుకొచ్చాడు విశ్వనాథం.

అతన్ని చూడగానే సింహాద్రి ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు.

"నువ్వా మావయ్యా!" అన్నాడు

గాబరాగా.

"నీకేమైనా బుద్ధుందా?" అన్నాడు విశ్వనాథం ఉగ్రరూపం దాల్చి.

సింహాద్రికేమీ అర్థంకావటం లేదు. అసలు ఇంతరాత్రివేళ మావయ్య తన రూముకి రావడమే అయోమయంగా ఉంటే, రాగానే 'నీకు బుద్ధుందా' అని అడగడం ఇంకా అయోమయంగా ఉంది.

"బుద్ధా?" అడిగాడతను ఆశ్చర్యంగా.

"అవును"

"ఏం బుద్ధి?"

"ఇంకేం బుద్ధి-అదే- బుద్ధంటే కూడా తెలీని చవటా!"

సింహాద్రి పరిస్థితి ఇట్టే గ్రహించాడు. తాను అలా బుద్ధి గురించి అడిగినకొద్దీ ఆయన రెచ్చిపోతాడు. అదివరకూ ఓసారి ఇలాగే తను అడిగిన ప్రతి విషయానికీ రెచ్చిపోయి నూటపధ్నాలుగు తిట్లు తిట్టాడు తనను. అంచేత ఇప్పుడు వెంటనే టాపిక్ మార్చేయాలని నిర్ణయించుకుని "ఇంత అర్ధరాత్రి వచ్చావేమిటి మామయ్యా" అన్నాడు అమాయకంగా!

విశ్వనాథం కోపంతో ఎగిరి దూకినంత పనిచేశాడు.

"ఏమిట్రా కూశావ్? ఇంత అర్ధరాత్రి ఎందుకొచ్చాననా? ఇంత అర్ధరాత్రి ఎందుకొచ్చాననా?"

సింహాద్రికి చిరాకేసుకొచ్చింది.

ఏమిటలా తనడిగే ప్రతీదీ పదిసార్లు రెట్టిస్తాడు? చిరంజీవి వేపు చూశాడతను.

చిరంజీవి తనకూ ఆ పెద్దమనిషి ధోరణి ఆశ్చర్యంగానే ఉందన్నట్లు భుజా లెగరవేశాడు.

"అవును మామయ్యా! అర్ధరాత్రి వచ్చేవేమిటి మావయ్యా అనడిగేను.ఏమిటి తప్పందులో?" అడిగాడు సింహాద్రి కూడ దీసుకుని.

"ఒరేయ్ ఉష్ట్రపక్షీ! ఇది అర్ధరాత్రి కాదురా... పగలు పట్టపగలు! తెల్సిందా? మంద్రగబ్బ మొఖం నువ్వూనూ! లేచి ఓసారి బయటికొచ్చి చూడు. ఉదయం పవయిందిరా!"

సింహాద్రి ఆశ్చర్యపోయాడు.

ఉదయం పవయిందా?

నమ్మకంచాలక కిటికీ తెరచి చూశాడు. చుట్టూ జనం. తన గది చుట్టూ ఓ పాతిక మంది నిలబడి విచిత్రంగా తన వంక చూస్తూ కనిపించారు.

"వీళ్ళందరూ ఎవరూ?" చిరంజీవి వేపు చూసి ఆశ్చర్యంగా అడిగాడతను.

"ఎవరేమిట్రా? 'జూ' చూడ్డాని కొచ్చినవాళ్ళు. తలుపులు రెండు గంటల నించీ కొడుతున్నా నిద్రలేవని జంతువు లెలా ఉంటాయోనని చూడ్డానికొచ్చారు"

సింహాద్రికేమాత్రం అర్థం కావటం లేదాయన మాటలు. అసలు ఒకదాని కొకటి సంబంధంలేకుండా ఉంటున్నాయ్.

ఇలా మాట్లాడుతుంటే ఎవరికి మాత్రం ఏమి అర్థమవుతుంది?

"నీకేమయినా అర్థమయినయా?" చిరంజీవి నడిగాడతను.

చిరంజీవి అడ్డంగా తలూపాడు.

"నేనూ ఫస్ట్ టైమ్ వింటున్నాను. ఇలా ఇంతసేపు అర్థం లేకుండా మాట్లాడడం చాలా గొప్ప సంగతే!" అన్నాడు నెమ్మదిగా.

"నోర్మూసుకోండి..." మళ్ళీ చెవులు పగిలేట్లు అరిచాడు విశ్వనాథం.

ఇద్దరూ సైలెంటయిపోయారు.

"అంటే రోజూ పన్నెండింటి వరకూ నిద్రపోతూ ఆఫీసెగ్గొడుతున్నావన్న మాట! అంతేనా?" అడిగాడతను.

"ఛఛ అదేం లేదు మావయ్యా! సాధారణంగా రోజూ తెల్లారుజామున ఏడున్నరకే లేస్తాను. కావాలంటే వాడినడుగు"

"అవునండీ! పాపం వాడు ఏడున్నరకే లేచేసి-లేచేసి...అంతేనండీ! లేచేస్తాడు"

విశ్వనాథానికి చిరంజీవి మీద వళ్ళు మండిపోయింది.

"నీ బోడి సాక్ష్యం ఎవ్వడూ అడగలేదిక్కడ" అన్నాడు విరుచుకుపడుతూ.

"అడగలేదాండీ?"

"లేదు"

"సింహాద్రి అడిగాడు కదండీ"

"వాడికి బుద్ధిలేదు కనుక అడిగాడు"

"అయితే సరేనండీ"

"ఏమిటిసరే?" మరింత రెచ్చిపోతూ అడిగాడు విశ్వనాథం.

"అంటే అదేనండీ ఓ...కే..."

"ఎందుకు ఓ...కే"

"చిరంజీవికివిసుగుపుట్టుకొచ్చిందిగానీ ఏం మాట్లాడితే మళ్ళీ ఇంకేంగొడవవుతుందో అని సైలెన్సయిపోయాడు.

విశ్వనాథం కొంచెం శాంతించాడు.

''ఊ!'' అన్నాడు తను చెప్పదల్చుకుంది ఏమిటా అని ఆలోచిస్తూ. అదేమిటో ఎంత ఆలోచించినా గుర్తురావటం లేదు. రాగానే అయితే ఠపీమని గుర్తుకొచ్చేసేది. కానీ వీళ్లిద్దరూ కలిసే వెధవ్వాగుడు వాగి తనమైండ్ డైవర్ట్ చేసేశారు. అవునూ అసలు వీళ్లిద్దరూ ఎలా కలసి ఉన్నారిక్కడ?

ఛటుక్కున చిరంజీవివేపు చూశాడతను.

''ఇంతకూ నువ్వెలా ఉన్నావీ రూమ్‌లో?" సడెన్‌గా పోలీస్ స్టేషనులోనే దొంగను పట్టుకున్న కానిస్టేబుల్లా అడిగాడు.

చిరంజీవి కొంచెం ఖంగారుపడ్డాడు.

''నేనా?...నేనూ...నేను... మామూలుగానే ఉన్నానండీ''

''నేనడిగేది అసలీరూమ్‌కెలా వచ్చావని!''

''అదా?..అది భలే అనెక్స్‌పెక్టెడ్‌గా జరిగిపోయిందిలెండి!"

సింహాద్రి ఠక్కున అందుకున్నాడు-

''అవును మావయ్యా! చాలా తమాషాగా జరిగింది"

"ఏమిటా తమాషా?"

''నాకు సడెన్‌గా ఆబిడ్స్‌రోడ్‌మీద కనిపించాడు. అదీ సర్దార్జీగాలిలోకి లేపబట్టి క్లియర్‌గా కనిపించాడు గానీ లేపోతే కలుసుకునేవాళ్ళం కాదు"

''అవునవును! సర్దార్జీ తన కాలేజ్ డేస్‌లో మాంచి స్పోర్ట్స్‌మన్ అయి ఉంటాలి'' ఒప్పుకున్నాడు చిరంజీవి.

''లేదా వెయిట్ లిఫ్టింగయినా ప్రాక్టీస్ చేసి ఉంటాలి. సో-తనూ ఇక్కడే వర్క్ చేస్తున్నానని చెప్పాడు మామయ్యా! పాపం రైల్వేవాళ్లు క్వార్టర్స్ ఇవ్వలేదట! అందుకని ప్లాట్‌ఫారంమీదే ఉంటున్నాడట. అలా ఎప్పుడూ ప్లాట్‌ఫారంమీద ఉంటే పాపం పాసింజెర్స్‌కి కష్టంకదా! అందుకని నా రూంకి వచ్చేయమన్నాను''

విశ్వనాథానికి మళ్ళీ కోపం ముంచుకు వచ్చింది.

వాళ్ళిద్దరూ కాలేజీలో చదివేరోజుల్లోనే ఇద్దరినీ ఒకేరూమ్‌లో ఉండకుండా వేరువేరుగా ఉంచేలా ఎన్నో ప్రయత్నాలు చేశాడు తను. కానీ కుదరలేదు. ఒకే క్లాసులో ఉండకుండా చేయమని ప్రిన్సిపాల్‌కికూడా ఉత్తరాలు రాశాడు. అయినా ఫలించలేదు. చివరకు ఈ ఉద్యోగం





పుణ్యమా అని సింహాద్రి హైదరాబాద్‌లో చిరంజీవికి దూరంగా ఉంటాడని ఆశ పడ్డాడు. కానీ ఏమయింది? ఆ చిరంజీవి వెధవకూడా ఇక్కడే ఉద్యోగం చేస్తూ తయారు.

"అయితే నీకు పాపం క్వార్టర్స్ ఇవ్వ లేదన్న మాట!" అడిగాడు విశ్వనాథం ఆలోచిస్తూ. ఎలాగోలా వాళ్ళిద్దరినీ వేరు చేయకపోతే మళ్ళీ ఇద్దరూకలిసి నానా రభసా చేస్తారు. అంతేకాదు. వాడిమాటలు వింటే సింహాద్రిగాడు పట్టిజులాయి వెధవ అనాల్సిందే.

"ఇవ్వలేదండీ!" చెప్పాడు చిరంజీవి.

"ఎందుకని?"

"దానికి చాలా పెద్దరికమండేషన్ కావాలండీ! రైల్వే మినిష్టరుదో లేక మా జనరల్ మేనేజరుగారి ఫ్యూన్‌దో రికమం డేషనుంటేగానీ ఇవ్వరు"

"ఓహో" తల పంకించాడతను.

"అయితే ఓ పనిచేద్దాం! నేనే నీకు వేరే ఇంకో మాంచి రూమ్ వెతికిపెడతాను"

చిరంజీవికి పరిస్థితి అర్థమయి పోయింది. కానీ అర్థంకానట్లు మొఖం పెట్టాడు.

"అబ్బే ఎందుకండీ మీకు శ్రమ! ఎలాగోలా ఈ రూమ్‌లోనే ఎడ్జస్టయి పోతాం! కదురా?" సింహాద్రినడిగా డతను.

"అవును మావయ్యా. ఏం పరవా లేదు. వుయ్ కెన్ మానేజ్"

"అదీగాక నాకెప్పుడూ నైట్ డ్యూటీలు గనుక రాత్రుళ్ళు నేనింట్లో ఉండను. సింహాద్రికి పగలు ఆఫీసు గనుక వాడు పగలు ఇంట్లో ఉండడు"

విశ్వనాథం ఇంకేమీ మాట్లాడలేక పోయాడు. కానీ లోపల మాత్రం అశాంతి పేరుకుపోతున్నది.

"ఇద్దరికీ ఇప్పుడే వార్నింగిస్తున్నాను గుర్తుంచుకోండి! మళ్ళీ అడ్డమయిన కుక్కల్నీ తెచ్చి రూమ్‌లో పెట్టి పెంచా రంటే మాత్రం మర్యాదగా ఉండదు" అన్నాడు కోపం అణచుకుంటూ.

"కుక్కల్నా? ఎందుకు వాటిని పెంచడం? నోనోనో...అలాంటి హాబీ లన్నీ ఎప్పుడో మానేశాం మావయ్యా!"

"అవునండీ! కాలేజ్ డేస్‌లోనే మానేశాం! అదంతా పిచ్చిపని"

"అలా అని నన్ను నమ్మమంటారు?" అడిగాడు" విశ్వనాథం.

"సెంట్‌పర్సెంట్ నమ్మాలండీ! మేము ఒకటి రెండు వెధవపనులు చేస్తే చేసి ఉండవచ్చు కానీ అబద్ధాలు మాత్రం ఎప్పుడూ చెప్పలేదు"

"నెవర్ నెవర్.."అన్నాడు సింహాద్రి.

"ఒకవేళ ఎప్పుడయినా ఏదయినా అబద్ధం చెప్పినా అదంతా కేవలం అనుకో కుండా అకస్మాత్తుగా జరిగిన పనేగాని ఇన్‌టెన్షనల్ కాదు"

"సెంట్ పర్సెంట్ కరెక్ట్!"

"అసలు ఇద్దరం అబద్ధాలంటే ఎంతో అసహ్యించుకుంటామండీ! మొన్నో రోజు మా ఫ్రెండొకడు ఇలాగే అబద్ధం చెప్తే వాడిని ఇంకోసారి మా కంటికి కనబడ వద్దని వార్నింగిచ్చాం! అసలు మీతో మాత్రం ఒక్కసారయినా అబద్ధం చెప్పామా?"

విశ్వనాథానికి వళ్ళుమండిపోతోంది.

"లక్షసార్లు చెప్పారు" అన్నాడు కసిగా.

"ఎప్పుడు?"

"ఎప్పుడూ చెప్పేది అబద్ధాలే అయితే ఇంక గుర్తెలా ఉంటుంది?"

"నోనో! యూ ఆర్ మిస్టేకెన్ సర్! అబద్ధాలు చెప్పడం ఎప్పుడూ జరగలేదు. కేవలం మీరు మమ్మల్ని అపార్థం చేసుకున్నారు. అంతే" సింహాద్రిని బ్రహ్మాండంగా సపోర్ట్ చేయాలని నిశ్చయించుకుని అన్నాడు చిరంజీవి.

సరిగ్గా అప్పుడే అంతకుముందు రోజు సింహాద్రి ఆరు బిస్కెట్లుపెట్టిన కుక్క మళ్ళీ ఆ రోజు కోటా కోసం గదిలోకొచ్చేసింది వేగంగా. వచ్చి అక్కడున్న ముగ్గురినీ చూసి, ఎందుకయినా మంచిదని పలుకరింపుగా నవ్వి, అప్పుడు సింహాద్రి భుజాలమీద రెండు కాళ్లూ వేసి ఆప్యాయంగా మొఖమంతా నాకబోయింది.

సింహాద్రి మొఖం పాలిపోయింది.

"ఛీఛో" అన్నాడు ఖంగారుగా.

ఆ కుక్క అతని మాటలు పట్టించుకోలేదు. ఎందుకంటే కొంతకాలం అది ఓ మంత్రిగారింట్లో ఉంది. అంచేత సిగ్గూ, శరం అంటే ఏమిటో బొత్తిగా మర్చిపోయింది.

మొఖం నాకే కార్యక్రమం ప్రస్తుతానికి వాయిదా వేసి బిస్కెట్ల కోసం అతని చుట్టూ తిరిగి వెతకసాగిందది.

విశ్వనాథం మళ్ళీ అగ్గి అయిపోయాడు.

"ఏమిటిది?" అన్నాడు ఛాన్స్ దొరికిందిగదాని.

"కుక్క" అన్నాడు చిరంజీవి.

"వీధి కుక్క" అన్నాడు సింహాద్రి ఎలాంటి అనుమానాలకూ తావు లేకుండా!

"వీధి కుక్కని తెలుసులేవోయ్. ఆ విషయం దాని మొఖం చూస్తేనే తెలుస్తోంది. అదిప్పుడు ఈ గదిలోకెందుకొచ్చిందని అడుగుతున్నాను"

సింహాద్రి కేంచెప్పాలో తెలీలేదు. సహాయం కోసం చిరంజీవివేపు చూశాడు. చిరంజీవి గొంతు సవరించుకున్నాడు.

"అదే మేమూ చూస్తున్నాం. ఇంత ధైర్యంగా లోపలికెలా వచ్చిందా అని. ఛీఛో" అంటూ దానిని బయటికి తరమబోయాడు.

అది పరిస్థితి గ్రహించి సింహాద్రిని వదలి చిరంజీవి దగ్గరకొచ్చి అతనిమొఖం నాకడానికి ప్రయత్నం చేయసాగింది. అతనిని కూడా మంచి చేసుకుంటేగాని తనకు రిలీజ్ చేయాల్సిన బిస్కెట్లకోటా తనకుగిట్టదని అనుమానంకలిగింది దానికి.

"ఇలాంటి దగుల్బాజీ అబద్ధాలు చెప్పడానికి సిగ్గుండాలి" అన్నాడు విశ్వనాథం.

"నిజంగా మావయ్యా! ఇది మాది కాదు" అన్నాడు సింహాద్రి.

"మీది కాకపోతే పొమ్మనగానే బయటకు పోదేం?"

"అదే మాకూ అర్థం కావటంలేదు" అంటూ చిరంజీవి లేచి దానిని కాలితో తన్నబోయాడు. ఆ కుక్కదగ్గర ఓగుణం వుంది. అదేమిటంటే తనన్నెన్ని తిట్టినా సహిస్తుంది. ఎంత అవమానాల పాల్జేసినా ఒప్పుకుంటుంది. తిండి పెట్టకపోయినా కాళ్ళదగ్గరే పడివుంటుంది. కానీ తిండి పెట్టకపోగా, తన్నబోతేమాత్రం ఎక్కడలేని తిక్క పుట్టుకొస్తుంది. తిక్క పుట్టుకొచ్చినపుడు మాత్రం ఏంచేస్తుందో దానికే తెలీదు. ఎలక్షన్‌లో ఓడిపోయిన మినిష్టరు గారు ఆ కోపంలో దానిని తన్నబోయినప్పుడు ఇలాగే తిక్కరేగి అందినచోటల్లా కరచి ఆ ఇల్లువదలి రోడ్డునపడింది. మళ్ళీ ఆ ఇంటి మొఖం చూడలేదు. ఇప్పుడు చిరంజీవి చేయబోయిన విన్యాసం కూడా దానికి నచ్చలేదు. అంచేత పళ్లు బయట పెట్టి గుర్రుమంది. దాంతో ఆటోమేటిగ్గా

 

చిరంజీవి ఎగిరి సింహాద్రి మంచంమీద నిలబడ్డాడు. అతనుఎగరడంవల్ల అల్మారా మీదున్న పుస్తకం చేతికితగిలి శరవేగంతో ఎగిరి విశ్వనాథం భుజంమీద తాకటం, విశ్వనాథం ఉలిక్కిపడి ఎగిరి గెంతడం, అతనలా ఎగరడం కేవలం తనమీద దండ యాత్రకే అని ఆ కుక్క మనస్ఫూర్తిగా నమ్మి అతని కాలిని కసిగా కొరికి పారి పోవడం అంతా చాలా త్వరగా సిస్టమేటిక్‌గా జరిగిపోయింది.

రెండు నిమిషాలవరకూ రూమ్ నిశ్శబ్దంగా వుండిపోయింది. అప్పటికి గాని విశ్వనాథం షాక్‌నుంచి తేరుకోలేదు. తేరుకుంటూనే అంతాగుర్తుకొచ్చి తన కాలివంక చూసుకుని కెవ్వుమని అరచాడు.

"అబ్బా...అబ్బా! కరచింది! వెధవ కుక్క! దొంగరాస్కెల్స్...వెధవల్లారా! అందుకే కుక్కల్ని పెంచొద్దురా అంటే వినరు"

"అబ్బే - అది మా కుక్కకాదు మావయ్యా! ఇంకా పెంచుకోవటం లేదు దాన్ని" ప్రొటెస్ట్‌చేయబోయాడు సింహాద్రి.

"నోర్మూసుకోరా పక్షీ! అది మీదే-మీదే-మీదే! మీదవబట్టే నన్ను కరిచింది! లేకపోతే నన్నే ఎందుక్కరుస్తుందీ అంట? మీ ఇద్దరినీ ఎందుక్కరవలేదూ అంట! అమ్మో!అమ్మో! నేనిప్పుడు బొడ్డుచుట్టూ పధ్నాలుగు ఇంజక్షన్లు చేయించుకోవాలి"

చిరంజీవికి అతనినిచూస్తే జాలివేసింది.

"పధ్నాలుగు అక్కర్లేదండీ! ఎనిమిది చాలు!"

"ఎనిమిదేమిట్రా నీ బొండ! పధ్నాలుగూ చేయించుకోవలసిందే!"

"అక్కరలేదండీ! ఎనిమిదిసరిపోతాయ్"

"నువ్వు నన్ను చంపాలనే ఎనిమిదంటున్నావ్. ఛస్తే నీమాట వినను"

"మీరు చెప్పేది పిచ్చికుక్క సంగతి! మంచికుక్కకి ఎనిమిది చాలండీ!"

విశ్వనాథం అనుమానంగా అతనివేపు చూశాడు.

"మంచికుక్కకి ఎనిమిది చాలా?"

"అసలేమీ అక్కర్లేదుగానీ ఎందుకయినామంచిదని ఎనిమిది తీసుకుంటారు"

"ఎవరు?"

"అందరూ!"

"ఇంతకూ అసలది మంచిదోకాదో నీకెలా తెలుసు?"

"తెలుసండీ! అది మంచిదే"

"అదే నీకెలా తెలుసూ అనడుగుతున్నాను"

"దాని వాలకంచూస్తే తెలీటంలేదూ! అది మనవంక చూసేప్పుడు సూటిగా మన కళ్ళల్లోకి చూస్తే మంచికుక్క అన్న మాటండీ! అలా కాకుండా విలన్‌లాగా సైడ్‌కిగానీ, వంకరగాగానీ చూస్తే పిచ్చికుక్కన్న మాటండీ!"

"ఇప్పుడది ఎలా చూసిందో గమనించలేదుగామరి?"

"నేను చూశానుగదండీ! సూటిగా మీ కళ్ళల్లోకే చూసింది కరిచేముందు!"

"ఇంతకూ అలా చూపులను బట్టి కుక్కను జడ్జ్ చేసే టెక్నిక్ నీకెవరు నేర్పారు?"

"చదివి తెలుసుకున్నానండీ!"

"ఏం చదివావ్?"

"కుక్కలూ - వాటిచూపులూ అన్న పుస్తకం!"

"ఎందుకు చదవాల్సి వచ్చింది ఆ పుస్తకం?"

"కాలేజ్ హాస్టల్లో ఉండేప్పుడు ఇలాగే చాలామంది మా జాకీ కరచిందని

పధ్నాలుగు ఇంజెక్షన్లు తీసుకోవడం మొదలు పెట్టారండీ! పధ్నాలుగు అవసరంలేదు, ఎనిమిది చాలని మేమెంత చెప్పినా వినిపించుకోకపోయేసరికి చివరకు ఆ పుస్తకం కొని తీసుకొచ్చి అందరికీ చదివి వినిపించామండీ!''

"ఇప్పుడుందా ఆ పుస్తకం?''

"లేదండీ!''

"ఏమయింది?''

" ఆ పుస్తకాన్ని నమ్మి ఎనిమిదే ఇంజెక్షన్లు చేయించుకున్న వాడొకడు చివరకు పిచ్చెక్కి, కుక్కలాగా ఆ పుస్తకం మీదపడి తినేశాడు. కానీ అందుకు కారణం వేరే ఉందిలెండి! మా కుక్క కరిచాక వాడిని మళ్ళీ ఓ పిచ్చి గుర్రం కరచిందట!''

విశ్వనాథానికి వణుకుపుట్టుకొచ్చింది.. "గు ... గు ... గుర్రం" అన్నాడు భయంగా. ఆ తర్వాత కొద్ది క్షణాల వరకూ మాటరాలేదు. అసలు తనా గదికి



ఎందుకొచ్చాడూ అన్న విషయం కూడా మర్చిపోయాడు. ఎంత ఆలోచించినా లాభం లేకపోతోంది. ముందా విషయం చెప్పి పధ్నాలుగు ఇంజెక్షన్లలో మొదటిది తీసుకోడానికి డాక్టర్ దగ్గరకెళ్ళాలనుంది.

"అసలు నేను నీ గదికెందుకొచ్చానంటే..ఎందుకొచ్చానంటే.." అని రెండు సార్లని మళ్ళా ఆలోచనలో పడ్డాడు.

"ఒకవేళ నాకు పాతికేళ్లునిండాయనీ, ఆస్తి నాచేతికిచ్చేస్తున్నాననీ చెప్పడాని కొచ్చావేమో మావయ్యా" గుర్తుచేస్తూ అన్నాడు సింహాద్రి.

"పిచ్చివాగుడు వాగకు! ఆ విషయం నేను చాలా జాగ్రత్తగా గుర్తు పెట్టుకుంటాను. ఇంకా సంవత్సరం పైముంది దానికి. అసలు నేనొచ్చిన కారణం ఏమిటంటే-ఆ....గుర్తుకొచ్చింది" అంటూ లేచి నిలబడి జేబులోనుంచి ఓ కవరు తీసి కవర్లోంచి ఓ ఫొటో బయటకులాగి-వెంటనే దానిని సింహాద్రి మీదకు విసిరేశాడు.

"అందులో పిల్లన్నాడు! ఆ పిల్లతో నీ పెళ్లి ఫిక్సయింది. ఆగస్ట్ ఇరవై ఆరున పెళ్లి! తెల్సిందా?"

సింహాద్రి ఫొటో కేసి చూశాడు. చూసి కెవ్వన కేకవేశాడు.

"అదేమిటి మావయ్యా! ఇది మగ పిల్లాడి ఫొటో"

"నోర్మూసుకో-మగపిల్లదేమిటి? అది ఆడపిల్లే!"

"కాదు మావయ్యా! ఫొటో తప్పుగా ఇచ్చినట్లున్నారు. ఇది మగాడే! స్పష్టంగా కనిపించటంలేదూ?"

"పిచ్చివాగుడు వాగద్దన్నానా! నేను చెప్తున్నాను. అది ఆడపిల్లే! తెల్సిందా?"

"కాదు మావయ్యా! ఇదిగో-నువ్వే చూడు"

విశ్వనాథం ఫొటో అందుకుని మళ్ళీ చూశాడు. అతని కోపం ఇంకా ఎక్కువయిపోయింది.

"నీకేం బుద్ధుందా లేదా? అమ్మాయి బొమ్మ లక్షణంగా కనబడుతోంటే-కాదు మగాడి ఫొటో అంటావా? ఏమోయ్ చిరంజీవీ!"

"ఏమిటండీ?"

"నువ్వు చూడీఫొటో! ఇది ఆడపిల్లే కదూ!"

చిరంజీవి ఆ ఫొటో అందుకుని అయిదు నిమిషాలు పరీక్షగా చూశాడు. ఆ తరువాత అల్మారాలోనుంచి తనకళ్ళజోడు తెచ్చుకుని మరో రెండు నిమిషాలు చూశాడు.

"ఆడపిల్లే అ యి ం టా డ ం డీ!" అన్నాడు బెరుగ్గా.

సింహాద్రి ఆశ్చర్యపోయాడు.

"ఆడపిల్ల ఎలా అవుతాడ్రా"

"ఒరే సింహాద్రీ! వెధవ్వాగుడు వాగకు! ఈ పిల్లతో ఆగస్ట్ ఇరవై ఆరున నీ పెళ్లి ఎరేంజ్ చేశాను తెల్సిందా?" అన్నాడు విశ్వనాథం కోపంగా.

"కానీ ఇది మగ పిల్లాడు కదు మావయ్యా?"

"నోర్మూసుకోమని ఓసారి చెప్పాను"

సింహాద్రి నోరు మూసేసుకున్నాడు.

"ఇవాళ సాయింత్రం ఈ పిల్ల తండ్రి భావయ్యగారు నిన్ను చూడ్డాని కొస్తున్నారు. ఆయనొచ్చినప్పుడు వెధ వ్వాగుడేయకుండా నోర్మూసుకుని అడిగిన ప్రశ్నలకు సమాధానాలు చెప్పు. తెల్సిందా?"

"తెలిసింది" నీరసంగా అన్నాడు సింహాద్రి.

"ఒకవేళ ఏమయినా పిచ్చివాగుడు

 

వాగినట్లు తెలిసిందో బుర్ర రామకీర్తన పాడిస్తాను. అర్థమయిందా?"

"అయింది!"

"నీకు్కడా వార్నింగిస్తున్నాను చిరం జీవీ! పిచ్చి వేషాలేయకండి!"

"అబ్బే నేనెందుకేస్తానండీ! నాకేం సంబంధం?"

"అతి వినయం ప్రదర్శిస్తున్నావ్ నువ్వు. అందుకే అనుమానంగా ఉంది"

"అబ్బే–ఒరిజినల్ గా ఇంతేనండి నేను. ఎప్పుడూ వినయంగానే ఉంటాను"

విశ్వనాథం వెళ్ళిపోయాడు.




"దిసీజ్ టూమచ్" అన్నాడు సింహాద్రి ఇంగ్లీషులో.

చిరంజీవి నిజమేనని ఒప్పుకున్నాడు

"ఆ మాటకొస్తే టూ మచ్ కంటే కూడా కొంచెం ఎక్కువే" అన్నాడు జాలిగా.

సింహాద్రి మళ్ళీ ఆ ఫొటో తనచేతుల్లోకి తీసుకున్నాడు.

"ఇది నిజంగా ఆడపిల్లేనంటావా?"

"ఓ యస్. అనుమానం అక్కర్లేదు" అన్నాడు చిరంజీవి.

"నీకెలాతెలుసు అంత నమ్మకంగా?"

"ఆమధ్య మా ఫ్రెండొకడితో అడవికి షికారుకెళ్ళాం! అక్కడ చిరతపులిని చూశాం! ఆ చిరతపులి – అచ్చం ఇదుగో ఈ అమ్మాయిలానే ఉంది"

"అయితే?"

"అయితే ఏముంది! ఆ చిరతపులి ఆడ చిరతపులేనని మా ఫ్రెండ్ చెప్పాడు కదా! అయినా మెడలో నెక్లెస్ కనిపించటం లేదూ?"

"అంటే మెడలో నెక్లెసున్నవాళ్ళంతా ఆడవాళ్ళేనా?"

"ఈ ఫొటో చూడక ముందు అభిప్రాయం అలా ఉండేది"

"మరి ఇప్పుడు?"

"ఇప్పుడు ఆ అభిప్రాయం పూర్తిగా మార్చుకున్నాను. అంతేకాదు! ఇంకా కొన్ని అభిప్రాయాలు కూడా మారిపోయాయ్!"

"ఏమిటవి?"

"చీరలు కట్టేవారంతా స్త్రీలు కాదనీ, లోలాకులు పెట్టుకునేవారంతాకూడా స్త్రీలు కాదనీ, స్త్రీలను కేవలం లేళ్ళతోనూ, చిలకలతోనే కాక చిరుతపులులతో, పెద్దపులులతో కూడా పోల్చవచ్చనీ – ఇలా చాలా చాలా...."

సింహాద్రికి ఏడుపొచ్చింది.

"ఇప్పుడు బలవంతంగా వాడిని ... అదే ఆ చిరతపులిని నాకిచ్చి పెళ్ళి చేస్తారా ఏమిటి ఖర్మ?"

"పరిస్థితిని సమీక్షిస్తే అలాగే కనబడుతోంది" జాలిగా అన్నాడు చిరంజీవి.

సింహాద్రి దిగాలుపడిపోయాడు.

"ఎలారా ఈ వెధవ సంబంధం తప్పించుకోవడం?"

"మీ మామయ్య దగ్గరకెళ్ళి – ఈ సంబంధం విషయం ఇంకోసారి నాదగ్గర ఎత్తావంటే మొఖం చట్నీ చేస్తానని వార్నింగివ్వు! తప్పిపోతుంది"

ఆ సీన్ ఓసారి ఊహించి చూసుకున్నాడు సింహాద్రి. కానీ అదేమంత ఆకర్షణీయంగా కనిపించలేదు.

"ఇంకో పద్ధతేమీ లేదుట్రా?" ఆశగా అడిగాడు.

"ఉంది"

"ఏమిటది?"

"ఆ చిరుతపులినే పెళ్ళి చేసుకోవడం"

"ఇది అన్యాయంరా! ఓపక్క నా హృదయం ఇంకో అమ్మాయికిచ్చేశానే?"

"ఇంకో పక్క ఆ చిరుతపులిని ఉండనీ"

"వద్దురా! అసలా చిరుతపులి పక్కన నిలబడే సీన్ తల్చుకుంటేనే భయంగా ఉంది. ఇంక పెళ్ళి చేసుకుని ఆ మగరాయుడితో సంసారంచేయడం మాటలా"

"అలాంటి మగరాయుడితో సంసారం చేసేందుకు కూడా ఓ పద్ధతుందిరా! భయపడకు"

"ఏమిటా పద్ధతి?"

"దాన్ని టూరింగ్ లైఫ్ పద్ధతి అంటారు"

"అంటే ఏం చేస్తారు?"

"ఆ మగాడిలాంటి అమ్మాయిని చేసుకున్నవాడు పెళ్ళి అయిన మర్నాటి నుంచి టూర్లు తిరుగుతాడన్న మాట! అంటే - భార్యతో అనుకునేవ్; కాదు. ఒక్కడే! అలా తిరిగి తిరిగి, తిరిగి తిరిగి చివరకు రిటైరయాక అప్పుడు ఇల్లు చేరుకుంటాడు"

"టూర్లేమిట్రా? నాకేం అర్థం కావడం లేదు" చిరాగ్గా అడిగాడు సింహాద్రి.

"ఇంకా అర్థం కాలేదా?" ఆశ్చర్యంగా అడిగాడు చిరంజీవి.

"లేదు"

"వెరీబాడ్! బైదిబై-ఇటీవలి కాలంలో నీ మెదడుకేమయినా దెబ్బ తగలడం గానీ, లేక మరోటి గానీ ఏదయినా జరిగిందా?"

"లేదు. ఎందుకు?"

"జస్ట్ డౌట్. అంతే! ఓకే! అర్థం కాలేదన్నావ్ కదూ! అయ్‌విల్ ఎక్స్‌ప్లెయిన్! టూరింగ్ లైఫ్ మెథడ్ అంటే భార్య మగాడిలాగా గానీ లేక చిరుతపులిలాగా గానీ లేక ఈ రెండూ కలిసినట్లున్నా గానీ, లేక ఇంకే క్రూర జంతువు పోలికలున్నా గానీ-సాధారణంగా ఈ టూరింగ్ లైఫ్ మెథడ్ వాడతాడన్న మాట భర్త. అంటే పెళ్ళయిన మర్నాడు అతను టూర్‌కి బయల్దేరతాడు. ఆ టూర్ ఇలా ఉంటుంది. జనవరినుంచి మార్చి వరకూ కలకత్తాలో కాన్ఫరెన్స్, మార్చి నుంచి జూన్‌వరకూ మద్రాసులో బ్రాంచ్ ఇన్‌స్పెక్షన్, జూన్‌నుంచి సెప్టెంబరు వరకూ బాంబేలో బోర్డ్ మీటింగు, సెప్టెంబరు నుంచి జనవరి వరకూ వైజాగ్‌లో సర్వే లేదా డార్జిలింగ్‌లో ఇన్‌వెస్టిగేషన్! ఇలా మూడు వందల అరవై అయిదు రోజులూ టూర్లోనే గడిపేస్తారన్న మాట! ఇంటికి రావటం అంటూ ఉండదు. ఈ రకంగా హాయిగా భార్యకు దూరంగా ఆమెను చూడకుండా, తను ఆమె కంటపడకుండా జీవితం ఆనందకరంగా గడపవచ్చన్న మాట. ఏటొచ్చీ లీప్ ఇయర్లో మాత్రం ఓ రోజు ఇబ్బంది ఎదుర్కోవాల్సి వస్తుంది. ఎందుకంటే లీప్ సంవత్సరానికి మూడువందల అరవైఆరురోజులుకదా! ఆ ఒక్కరోజూ- భార్య తెలివిగలదయితే ఇంటిదగ్గర గడపమని ఆజ్ఞాపించవచ్చు"

సింహాద్రికాపద్ధతి ఏమంత నచ్చలేదు.

"నాకేం నచ్చలేదురా" అన్నాడు మళ్ళీ

 

దిగులుపడి.

"నీ మొఖం! నీకు తెలీదు! క. యస్. యన్. రాజుగాడు ఇలాగే నచ్చలేదు, నచ్చలేదని ఇప్పుడు అదే బ్రహ్మాండమయిన పద్ధతని తెగమెచ్చు కుంటున్నాడు"

"రాజెవరు?"

"మా కొలీగ్?"

"అంటే అతని భార్య కూడా..."

"యస్! అనుమానం ఎందుకు? భీకర మయిన ఆకారం. అంతే. టూరింగ్ లైఫ్ మెథడ్‌లోకి దిగాడు. ఇప్పటికి ఇంటి మొఖం చూసి ఎనిమిదేళ్ళయింది. చాలా స్ట్రిక్ట్‌గా షెడ్యూల్డ్ టూర్ అమలు చేస్తున్నాడు"

"ఐసీ" అన్నాడు సింహాద్రి.

"ఓ యస్! బ్యూటిఫుల్ మెథడ్ అది! నీకు ఒకవేళ ఇది నచ్చకపోతే రెండో పద్ధతుంది!"

సింహాద్రి ఉత్సాహంగా చూశాడు.

"అదేమిటి?"

"దాన్ని శాటిలైట్ మెథడ్ అంటారు. అంటే రేసులూ, క్లబ్బులూ, పేకాటలూ ఇలా వీటిచుట్టూ ఇంటికి రాకుండా తిరుగుతూ జీవితం గడిపేయడం అన్న మాట! చివరకు బాగా ఏజ్ ఎక్కువయి- అంటే కళ్ళు పూర్తిగా కనిపించని స్థితిలో ఇవన్నీ మానేసి ఇంటి దగ్గర ప్రశాం తంగా జీవితం గడుపుతాడు. ఈ రెండూ కాక మూడో మెథడ్ ఒకటుందికానీ అది అంత మంచిదికాదని నా పర్సనల్ అభి ప్రాయం"

"ప్రస్తుతానికివి చాల్లే" అన్నాడు సింహాద్రి.

అతనికిప్పుడు ఎన్నో కొత్త కొత్త విష యాలు తెలుసుకున్నట్లు అనిపించింది. ఇంతకుముందు తను కొంతమంది 'సంవ త్సరమంతా' టూర్లుచేసే వాళ్ళను చూశాడు గానీ, వాళ్ళంతా ఇలా ఈ టూరింగ్‌లైఫ్ పద్ధతి ప్రాక్టీస్ చేస్తున్నారని తనకప్పుడు తెలీలేదు.

"అంటే పైరెండు పద్ధతుల్లో నీకేది నచ్చినట్టు?" అడిగాడు చిరంజీవి.

"ఏదీలేదు"

చిరంజీవి ఆశ్చర్యపోయాడు. "మరి?"

"మరేంలేదు. ముందు నేనీపెళ్ళి తప్పించుకోవాలి! ఎలాగో చెప్పు?"

చిరంజీవికి చిరాకుపుట్టుకొచ్చింది.

"ఇందాక చెప్పానుకదా!"

"ఏమిటది?"

"మీ మావయ్య మొఖం చట్నీ చేసెయ్యమని"

"ఊహూ, అది కుదరదురా!"

"ఎందుకని?"

"అలా చేస్తే మామయ్యకోపం వస్తుందేమో!"

"వస్తేరానీ!"

"వాట్?"

"అవునోయ్! వస్తేరానీ - భయ మేమిటి?"

"పిచ్చివాడా! నేనెలాంటి తలతిక్క పనిచేసినా నా ఆస్తి నాకు అప్పజెప్పడం జరగనిపని అని గతరెండేళ్లుగా వార్నింగు లిస్తున్నాడు"

"ఏడ్చాడు"

"వాట్...ఏమిటన్నావ్?"

"ఏడ్చాడన్నాను"

"ఎందుకు?"

"లేపోతే ఏమిట్రా? ఆస్తి అప్పజెప్పక పోవడం మీ మామ మావ వల్ల కూడా కాదు. ట్రస్టీ అంటే గడువుతీరగానే నీ ఆస్తి నీకప్పగించి తీరాల్సిందే! ఇది

రూలు! ఇవ్వనంటే మరుక్షణం జైల్లో ఉంటాడు. నేను కొన్నాళ్ళ లాయరు ఇంటి పక్కనున్నానుగా! అందుకని 'లా' అంతా మనకి కొట్టినపిండే!''

''నిజంగానా?'' ఆశ్చర్యంగా అడిగాడు సింహాద్రి.

''నగ్నసత్యం''

''ఎంత ఘోరం జరిగిపోయింది? ఈ విషయం తెలీక నేను మావయ్య ఆడించినట్లల్లా ఆడుతున్నాను''

''అయితే ఇకనుంచీ ఆ ఉచిత నాట్య ప్రదర్శనలు ఆపేసేయ్''

''ఓకే! ఎగ్రీడ్''

''అసలు మీ మావయ్యకు ఆ పిల్లనే నీకిచ్చి చేయాలని ఏమిటంత అనురాగం?''

''అదో పెద్దకథ అని ఆరోజు నీతో అన్నాను గుర్తులేదూ?''

''ఏమిటాకథ?''

''మావయ్య ఫ్రెండ్ భావయ్య దగ్గర చచ్చేంతడబ్బు ఉంది. మామయ్యకు అలా బోలెడు డబ్బు ఒకేచోట పోగడిపోవడం నచ్చలేదు. అంచేత అతనిని యాభయి వేలరూపాయలయినా, పధ్నాలుగు లక్షల రూపాయలయినా అప్పు ఇమ్మన్నాడు. ఛాయిస్ ఆ రెండింటిమధ్యే ఉండడంవల్ల భావయ్య యాభయ్‌వేలు ఇవ్వడానికి ఒప్పుకున్నాడు. అయితే ఓ కండిషన్ పెట్టాడు''

''ఏమిటది?''

''భావయ్య కూతురికి నన్నిచ్చి పెళ్ళి చేయడానికి మామయ్య ఒప్పుకోవాలి. అలాచేస్తే ఆ యాభయివేలూ ఫ్రీగా తీసుకోవచ్చు. తిరిగి ఇవ్వనక్కరలేదు.''

''న్యాయంగా చూస్తే నీ విలువ పాతిక రూపాయలకంటే ఎక్కువ వుండదుకదా! మరలా ఎందుకు కండిషన్ పెట్టినట్లు?''

''నా విలువ యాభయివేలుండని మాట నిజమేగానీ ఆ పిల్లను పెళ్ళిచేసుకోవడానికి ఒప్పుకున్నవాడెవడికయినా సరే లక్షరూపాయలవరకూ ఖర్చుచేయడానికి సిద్ధపడ్డాడు భావయ్య. అయినాగాని ఎవ్వడూ ముందుకి రాలేదు''

''ఎందుకని?''

''ఈ ఫొటోచూస్తే అర్థం కాలేదూ. అఫ్‌కోర్స్ అదింకా ఆడపిల్లే అని వాదించేటట్లయితే''

''ఓకే – ఓకే–నెక్స్ట్?''

''అసలు ఇదంతాకాక ఒరిజినల్ వ్యవహారం ఒకటుంది!''

''ఏమిటది?''

''నేను కొన్నియుగాలుగా శ్రీదేవిఅనే దేవతని ఆరాధిస్తున్నాను''

''కొన్ని యుగాలుగానా?''

''అంటే నిజంగా కాదనుకో చాలాకాలం నుంచీ! అంటే మరీఎక్కువ కాదు–రెండు రోజుల్నుంచి అన్నమాట!''

''ఎవరా శ్రీదేవి?''

''తెలీదు''

''ఎంతకాలంనుంచీ స్నేహం?''

''అస్సలింతవరకూ ఆ అమ్మాయిని చూళ్ళేదు''

''ఆ అమ్మాయి నిన్ను చూసిందా?''

''అసలు నాలాంటి హాండ్‌సమ్ ఫెలో ఒకడున్నాడనే ఆ పిల్లకు తెలీదు''

చిరంజీవికి చిరాకుపుట్టుకొచ్చింది.

''ఇలా ఊరూ పేరూ అడ్రసూలేని ఆడపిల్లలను ప్రేమించడం కొత్త హాబీయా?''

''ఆ అమ్మాయికి అడ్రసుంది''

''ఏమిటది?''

''బాంబ్ నిలయం–విశాఖపట్నం''

''బాంబ్‌నిలయమా?''

''అవును''

''అంటే బాంబ్‌లూ గ్రటాతో నిండి వుండే ప్రదేశమా?''

''అదింకా తెలీదురా! కనీసం ఓ బాంబయినా ఉండి ఉంటుందని అనుమానం''

''మరలాంటి బాంబులమధ్య జీవితం గడిపేపిల్లను ప్రేమిస్తే ప్రమాదంకదా!''

''అదే కొంచెం ఇదిగా ఉందిరా!''

''ఇంతకూ ఆ పిల్లను నువ్వెక్కడ చూశావ్?''

''అదో పెద్ద కథరా!''

''ఇందాక చిన్నకథన్నావ్?''

"అది ఒరిజినల్ కథ! కానీ అందులో ఉపకథ మాత్రం చాలా పెద్దది. మొద లెట్టనా?"

"సరే-రెండువేల పదాలు దాటకుండా చెప్పు!"

"ఇంతకు ముందు ఈ రూమ్‌లో ప్రఖ్యాత రచయిత ధనుంజయ్ ఉండే వాడని నీకు చెప్పాను కదా!"

"రచయితా?"

"అవును"

"ఏమి రాస్తాడతను?"

"నాకూ తెలీదు. కానీ మన హోటల్ సర్వర్ రామనాథం ఇన్‌ఫర్‌మేషన్ ప్రకారం అతను హిప్నాటిజం, టెలీపతి, అలోపతి, విలోపతి, సైకోపతి ఇలాచాలా పతుల గురించి రాస్తాట్ట"

"అంటే వాటిగురించి వ్యాసాలా?"

"కాదు నవలలు. ఒక ధనవంతుడి కొడుకు హఠాత్తుగా కొన్నికోట్ల ఆస్తికి వారసుడవుతాడు. ఆ ఆస్తి లాక్కోడానికి అతని బాబాయ్ అతనిని చంపడానికి పెద్దఎత్తున ప్రయత్నాలు చేస్తా డన్నమాట. కానీ అతని ప్రియురాలు ఈ విషయం టెలీపతిద్వారా తెలుసుకుని, సైకోపతి ప్రయోగిస్తుంది. ఆ తరువాత ఆమె హిప్నాటిజం నేర్చుకుని అతని బాబాయ్‌ని హిప్నటైజ్ చేసి ముప్పయ్ తిప్పలు పెట్టి– ఒకటో రెండో చెరువుల నీళ్లు తాగిస్తుందట. ఇలా ఉంటాయంట అతని నవలలు. చదివితీరాల్సిందేగానీ ఇలా వింటే అంత అద్భుతంగా ఉండవని రామ నాథం అన్నాడు"

"సరే. అది ప్రఖ్యాత ధనుంజయ్ రూమ్. అయితే ఏమిటి?"

"శ్రీదేవి అనే అమ్మాయ్ ఆ రచయిత ధనుంజయ్‌కి ఫాన్. అంటే మనఇళ్ళలో తిరిగే ఫాన్‌కాదు. అభిమాని అంటామే– అదన్నమాట! ఆమె ధనుంజయ్‌కి ఉత్తరం రాసింది. అతను రూమ్ మారినట్లు ఆమెకు తెలీదు. అంతేకాదు. ఈ రూమ్‌లో ప్రస్తుతం హాండ్‌సమ్‌ఫెలో ఒకడు దిగినట్లుకూడా తెలీదు. తెలుస్తే నాకే రాసేది. నో డౌట్ ఎబౌట్ ఇట్!"

"హరికథవద్దు! అసలుకథ చెప్పు" చిరాగ్గా అన్నాడు చిరంజీవి.

"ఓకే-కమింగ్‌టు ఒరిజినల్‌స్టోరీ. ఆ ఉత్తరం నేను అందుకున్నాను. కవర్లో శ్రీదేవి ఫొటో చూశాను. అంతే! అయామ్ లాస్ట్! ఒరేయ్... పెళ్ళిఅంటూ చేసుకుంటే ఆ పిల్లనే చేసుకుంటాన్రా! లేపోతే ఈ జన్మ కాన్సిల్ చేసేసుకుంటాను. అంతేగాని చిరతపులినీ, పెద్దపులినీ చేసుకోపడం నావల్ల కాదు."

"ఇలా ఊరూ, పేరూ, అడ్రసూలేని పిల్లను ఫొటోలోచూసి ప్రేమిస్తే కె.యస్. కనకారావ్ గతిపడుతుంది నీక్కూడా"

"కె.యస్. కనకారావా?"

"అవును"

"ఎవరతను?"


"జి.యస్. శంకర్రావ్ కజిన్ బ్రదర్"
"జి.యస్. శంకర్రావ్ ఎవరు?"
"సి.కె. రత్నారావు ఫ్రెండ్!"
"సి.కె. రత్నారావు....వద్దులే అత
నెవరో మనకెందుగానీ ఇంతకూ కె.యస్.

శునకారావ్‌కి ఏగతి పట్టింది?"

"వాడూ ఇలాగే ఓ అమ్మాయి ఫొటో చూసి ప్రేమించాడు"

"అంటే వాడూ రచయిత ఉండే రూమ్‌లోకి మారాడా?"

"కాదు. ఇది ఇంకోరకం కేసు. వాడికి పత్రికలు చదవడం అలవాటు. ఓసారి ఓ పత్రికలో వాడికిష్టమయిన సీరియల్ రచయిత్రి ఫొటోచూసి ప్రేమించాడు. నీలాగానే పెళ్ళంటూ చేసుకుంటే ఆ రచయిత్రినే చేసుకోవాలని ప్రతిజ్ఞ చేసుకున్నాడు. వెంటనే ఆమెతో కరెస్పాండెన్స్ కోర్స్ ప్రారంభించాడు: తనకున్న అర్హతలూ, తన ఆస్తి వివరాలూ, తన కొచ్చే జీతం, ఉద్యోగం, తనరంగూ,

రుచీ అన్నీ రాశాడు. దానికో ప్రేమలేఖ జతపరిచాడు. ఆమెను ప్రతిక్షణం చూస్తూ ఆమె సరసనే జీవితం గడిపే అవకాశం తనకివ్వకపోతే తను ఇన్‌స్టాల్‌మెంట్స్ పద్ధతిలో వందేళ్ళు లోపుగానే తనువు చాలిస్తానని ఫుట్‌నోట్ పెట్టాడు"

"మరా రచయిత్రి వప్పుకుందా?"

"అలాంటి ఫుట్‌నోట్ చూస్తే ఎవరు వప్పుకోకుండా ఉంటారు?"

"అవును! ఎవరూ ఉండలేరు"

"కనుక ఆ అమ్మాయి కూడా ఉండలేకపోయింది"

''అంటే-పెళ్ళికి వప్పుకుందన్నమాట"

"ఊహు! లేదు"

"అదేమిటి? ఎందుకని వప్పుకోలేదు?"

"వప్పుకునేదేగాని-ఆమె భర్తా,పిల్లలూ అల్లుళ్ళూ, కోడళ్లూ వప్పుకోలేదు"

సింహాద్రి ఉలిక్కిపడ్డాడు.

''భర్తా, పిల్లలూ, అల్లుళ్లూ, కోడళ్లూనా?"

"అవును!''

''అంటే వాళ్ళంతా ఎవరు? అయ్ మీన్ ఆ అమ్మాయికి భర్తేమిటి?"

"వెరీపూర్ అండర్‌స్టాండింగ్'' అన్నాడు చిరంజీవి జాలిగా. ''భర్తలేకపోతే పిల్లలూ గట్రా ఎలా ఉంటారు?''

"అదికాదు నేననేది! అసలు ఆ అమ్మాయి అమ్మాయి కాదా? అహహ... నా ఉద్దేశం ఆ అమ్మాయికి పెళ్ళయిపోయిందా?''

"అయ్ పిటీ యూ! ఇంకా అర్థంకాలేదన్నమాట! పెళ్ళవకపోతే పిల్లలు ఎలా ఉంటార్రా?"

సింహాద్రికి అంతా అయోమయంగా ఉంది.

"పిల్లలుఉన్నారు. సరే వప్పుకుంటాం. మరి అల్లుళ్లూ, కోడళ్లూ ఏమిటి?"

"నీకు నిజంగా మెదడు విషయంలో చాలా అన్యాయం చేశాడ్రా దేవుడు" మళ్ళీ జాలిపడ్డాడు చిరంజీవి "పిల్లలన్నాక కూతుళ్ళూ, కొడుకులూ ఉంటారా, ఉండరా?''

"ఉంటారు''

"కూతుళ్లూ, కొడుకులూ అన్నాక మరి వాళ్ళక్కూడా పెళ్ళిళ్ళూ, పేరంటాలూ అవుతాయా, అవ్వవా?"

''అవుతాయ్...అవుతాయ్"

''మరింకా నీకు అర్థం కాపోవడం ఏమిటి?"

"అంటే...ఆమెకు అంత పెద్దపిల్లలు కూడా ఉన్నారన్నమాట''

"అంతేకాదు. ఆ పిల్లలకు కూడా పిల్లలున్నారు"

"మెగాడ్''

''ఎవరి గాడ్ అయినా సరే! ఫాక్ట్స్ అవి''

"మహారచయిత్రి ఏం చేసింది. ఇంకో సారలాంటి ఉత్తరాలు రాయొద్దని రాసిందా?''

"ఊహూ! చూస్తూ చూస్తూ అంత మంచి ఉద్యోగం ఉన్న వరుడిని వదులుకోవడం ఇష్టం లేక తన మనవరాలికే ఇచ్చి వివాహం జరిపించింది''

"మనవరాలికా?'' తృప్తిపడుతూ అడిగాడు సింహాద్రి.

"అవును''

"అంటే మనవరాలు కూడా పెళ్ళీడుకొచ్చిన పిల్లేనా?''

"పెళ్ళీడు పిల్లేమిటి! అప్పటికే యమ్.ఏ. అయిపోయి లెక్చరర్‌గా చేస్తోందటఅయిదేళ్ళనుంచీ!అంటేకె.యస్. కనకారావ్‌కంటె అయిదారేళ్ళ పెద్దది"

 

"మరి కె.యస్. కనకారావ్ ఎలా ఒప్పుకున్నాడు?"

"ఒప్పుకోకేంచేస్తాడు? ఫుట్ నోట్‌లో ముందే కమిట్ అయిపోయాడుగా? అదీ రాతపూర్వకంగా కమిట్ అయాడయ్యే - ఆమె కళ్ళల్లోకి చూస్తూ, ఆమె సరసనే జీవితం గడిపే అవకాశం ఇవ్వకపోతే స్లోగా ఛస్తానని"

"అయినా అంత ముసలిదాన్ని ఎలా ప్రేమించాడా కె. యల్. కనకారావ్?"

"కె.యల్. కనకారావ్‌కాదు: కె.యస్. కనకారావ్"

"అదే కె.యస్. కనకారావ్"

"అందులో పెద్ద ఆశ్చర్యం ఏముంది? ఆమె తన పదహారవఏట దిగిన ఫొటో పబ్లిష్ చేయించిందాపత్రికలో"

సింహాద్రి నీళ్ళుకారిపోయాడు.

"వెరీబాడ్" అన్నాడు దిగులుగా.

"అవును: పాపం. కె. యస్. కనకారావ్‌కూడా అదే అనుకుంటాడు-ఆ ఇన్సిడెంట్ తల్చుకున్నప్పుడల్లా"

"ఇప్పుడేం చేస్తున్నాడతను?"

"ఆ రచయిత్రికి కళ్ళుకూడా సరిగ్గా కనిపించవుకదా! అందుకని ఆమె బెడ్ పక్కనే కూర్చుని ఆమె డిక్టేట్‌చేసే నవలలు, కథలు రాసిపెడుతూంటాడు"

"హారిబుల్"

"చాలా హారిబుల్"

"అంటే-ఇప్పుడు శ్రీదేవి కేసుకూడా ఆ బాపతేనంటావ్?"

"అవకాశాలు చాలా ఉన్నాయ్:"

"కానీ ఆమె ఆ రచయిత్రిలా చిన్నప్పటి ఫొటో ఎందుకు పంపుతుంది? తనను గుర్తించడానికేగా ఆ ఫొటో పంపింది?"

చిరంజీవి ఓ క్షణం ఆలోచించాడు.

"గుర్తించడం ఏమిటి? ఎవరు గుర్తించాలి? ఎలా, ఎక్కడ గుర్తించాలి?"

"ఆమెనే రచయిత ధనుంజయ్ గుర్తించాలని ఆమె అభిప్రాయం. ఎందుకంటే ఆమె రేపు శుక్రవారం ఇక్కడికొస్తోంది"

"ఇక్కడికా?"

"అవును"

"ఎందుకు?"

"తన అభిమాన రచయిత ధనుంజయ్‌ని కలుసుకోవడానికి:"

"ఓహో"

"కనుక ఆమె రూపం ఫొటోలో లాగానే ఉంటుందని తేలిగ్గా చెప్పేయవచ్చు"

"ఆ పాయింట్ నిజమేగానీ ఇంకో పాయింట్ ఉంది"

"ఏమిటది?"

"ఆమెక్కూడా భర్తా, పిల్లలూ లేరని నమ్మకం ఏమిటి?"

"అలా మాట్లాడకురా! నేనిప్పుడే చచ్చి ఊరుకుంటాను. అయినా ఆమెకు పెళ్ళి కాలేదురా: నాకు తెలుసు"

"ఎలా తెలుసు?"

"తను వాళ్ళ డాడీతో ఈ ఊరు కొస్తున్నాననీ, అప్పుడు ఈ ఇంటి కొస్తాననీ రాసింది. పెళ్ళయితే మరి మాఆయన్తో వస్తున్నానని రాసేదికదా"

"అయితే ఫిఫ్టీ ఫిఫ్టీ ఛాన్సులున్నాయన్న మాట:"

"ఒరేయ్: ముందు నేను ఈ మావయ్య ఫ్రెండ్ భావయ్య తాలూకు మగ కూతురి బారినుండి తప్పించుకోవాలి. ఆ తరువాత శ్రీదేవిని పెళ్ళి చేసుకోవాలి. ఎలా? ఎలా? ఎలా?ఎలా?..."

."ష్" అరచాడు ' చిరంజీవి

"ఏమిటా కాకిగోల?"

"రీ సౌండింగ్ ఎఫెక్ట్! మన సినిమాల్లో వాడతారుగదా-చాలా బరువైన సన్నివేశాల్లో. హీరోయిన్ భర్తని డాక్టర్లు ఆపరేషన్ చేయాలనుకుంటారు. లక్ష రూపాయలలో, ముప్ఫయ్ఆరువేలో ఎంతో కావాలంటారు. అప్పుడు హీరోయిన్ ఇలా అనుకుంటుందన్నమాట! లక్షో, ముప్ఫయ్ఆరువేలో కావాలి - కావాలి - కావాలి-కావాలి - కావాలి..."

"ష్షష్" మళ్ళీ అరచాడు చిరంజీవి. సింహాద్రి 'ష్' అయిపోయాడు.

చిరంజీవి ఓ క్షణం ఆలోచించాడు.

"ఊహు కుదరదురా! ఆ పిల్ల ఇలా హఠాత్తుగా ముక్కు మొఖం తెలీని నిన్ను ప్రేమించడం ఇంపాజిబుల్"

"అలా ప్రేమించిన కేసులు లేవంటావా?"

"పాపం - ఎక్కడో ఒకటి ఉంటే ఉండవచ్చు"

"రేపు శుక్రవారం శ్రీదేవి వచ్చినప్పుడు నా ప్రేమను తెలియజేస్తే ఒప్పుకోదంటావా?"

"పోలీస్ కంప్లెయింట్ ఇస్తుంది"

"అదేమిట్రా-మధ్యలో వాళ్లకెందుకు చెప్పటం?" ఖంగారుగా అడిగాడు సింహాద్రి.

"అవునుమరి! నీలాంటి ట్రాఫిక్ని త్వరగా క్లియర్ చేయాలంటే అదొక్కటే ఛాయిస్"

"ఒరేయ్ చిరంజీవీ! ఆపదలోఉన్న స్నేహితుడిని ఆదుకోవటం ఇదేన్రా?"

"నన్నేం చేయమంటావ్‌రా?"

"ఏదోక ఉపాయం చెప్పు! ఆరోజు మనిద్దరం కాలేజ్ ఎలక్షన్స్ గొడవల్లో ఇరుక్కున్నప్పుడు పోలీసులు అరెస్ట్ చేయడానికొస్తే అద్భుతమయిన ఉపాయం ఆలోచించావ్ నువు! గుర్తులేదూ? ఆ ఉపాయం వల్లనేగా మనంతట మనమే వెళ్ళి వాళ్ళకు దొరికిపోయాం"

"అవుననుకో-అయితే ఓ పనిచెయ్"

"ఏమిటది?" ఉత్సాహంగా అడిగాడు సింహాద్రి.

"ఇంత విషం రడీగా ఉంచుకో! రేపు ఆమె గదికిరాగానే 'మీరు నన్ను ప్రేమిస్తారా? లేపోతే ఈ విషం మింగమంటారా' అని అడుగు. దాంతో దెబ్బకి ఒప్పుకుంటుంది"

"ఒకవేళ విషమే మింగమంటే?"

"మింగేసెయ్. ఎలాగూ ఈ బర్త్ కాన్సిల్ చేసుకుంటానన్నావుగా ఆమె ఒప్పుకోకపోతే"

"ఇంతకంటే మంచి ఉపాయం ఏమీ లేదా?"

"ఎందుకు? దీనికేమయింది?"

"అంత బావుండలేదురా!"

"మంచి ఉపాయాలు ఎవడికీ నచ్చవ్. అది మామూలే"

"బాబ్బాబు ఇంకోటేదయినా చెప్పరా"

చిరంజీవికి సింహాద్రిని చూస్తే జాలి వేసింది. ఫొటోలు చూసి ప్రేమించే అమాయకపు వెధవాయిలకు ఆమాత్రం సహాయం చేయడం తన ధర్మం అనిపించింది.

"సరే అయితే ఓ పనిచెయ్! నీకు ధైర్యం ఉందా?"

"కేవలం శ్రీదేవి కోసం అయితే బోలెడుంది"

"నీకు స్టేజిఫియర్ లేదుగా?"

"కాలేజీలో 'సెకండ్ బెస్ట్ యాక్టర్' కొంచెంలోనేగా మిస్సయిందీ? ఇంతకూ నన్నేం చేయమంటావో చెప్పరా?"





''మరేంలేదు. రేపు శ్రీదేవి మన రూమ్ కొస్తుంది. అంతేనా?''

''అవును''

''వచ్చి ధనుంజయ్‌గారు మీరేనా అనడుగుతుంది. అవునా?''

''అవును''

''అప్పుడు నువ్వేమంటావ్?''

''నేనుకాదండీ...నా పేరు సింహాద్రి. ధనుంజయ్‌గారు వేరే యింటికి మారి పోయారు· మీరు ఇలాకూర్చోండి. కూల్ డ్రింక్ తాగుతారా, కాఫీ తాగుతారా అంటాను''

''అక్కడే దెబ్బతిన్నావ్ నువ్వు''

''ఏం? ఎందుకని?''

''నేనే ధనుంజయ్‌ని అనాలి నువ్వు''

''నేనా?''

''అవును''

''నిజంగా నేను కాదుగదా?''

''కాదు''

''మరి ఇంకెలా అంటాను?''

"నీ నోటితో"

"సరే అంటాననుకో"

"అంటే ఇంకేముంది? ఆమె నీతో ప్రవాహంలాగా మాట్లాడడం మెదలు పెడుతుంది. ఇద్దరూ బీచికెళ్తారు"

"బీచ్‌కా?"

"అవును"

"హైద్రాబాద్‌లో బీచ్ లేదుగా?"

"లేపోయినా సరే- వెళ్తారు. అక్కడ ఆ సముద్రపు కెరటాల వంక చూస్తూ చీకటిపడేవరకూ మాట్లాడుకుంటారు· ఆమెకు నువ్వు కొత్తగా రాయబోతున్న నవల గురించి చెప్తావ్. ఆమె ఉప్పొంగి పోతుంది. ఆ ఆనందంలో ఉండగా డిన్నర్‌కెళ్దామని అడుగుతావ్. ఓకే అంటుంది. ఇద్దరూ గ్రీన్‌మూన్‌లో డిన్నర్‌కెళ్తారు''

"గ్రీన్‌మూన్ ఎక్కడుంది?"

"నాకూ తెలీదులే. మధ్యలో అడ్డు రాకు. అక్కడ నువ్వు అయిదు వందలో, వెయ్యి రూపాయలో పెట్టి డిన్నర్ ఆర్డర్ చేస్తావ్. ఆ భోజనం చేస్తూండగా ఆచల్లని వాతావరణంలో, ఆ మసక చీకటిలో-నీ గుండె ఆమెకిచ్చేస్తావ్- అంతే- ఆతర్వాత డ్రీమ్‌సాంగ్స్- డ్యూయెట్లు"

సింహాద్రి అనుమానంగా చూశాడు.

"అయిడియా బాగానే ఉందిరా! కానీ నేను రచయిత ధనుంజయ్‌నంటే ఆమె నమ్ముతుందంటావా?"

"వాళ్ళ గ్రాండ్ మదర్ నమ్ముతుంది''

"అంతేనంటావ్"

"ఖచ్చితంగా"

"కానీ తరువాత ఎప్పటికయినా నిజం తెలుస్తుంది కదా?"

"అప్పటికే ఆమె నీ సొంతం అయి పోతుందికదురా?''

''ప్రస్తుతానికి బాగానే ఉంది మరి"

"ఎగ్జిక్యూషన్‌లో ఇంకా బ్రహ్మాండంగా ఉంటుంది''

సింహాద్రి సంతృప్తిపడ్డాడు.




సాయంత్రం ఏడవుతుండగా గది బయట కారు హారన్ మోగింది. దాని వెనుకే కారు డోర్ గట్టిగా వేసిన

చప్పుడు, మళ్ళీ దాని వెనుకే 'కుయ్యో' మని ఏడుస్తున్నట్లు శబ్దంచేసుకుంటూ లోపలికొస్తున్న బూట్లూ చూసి సింహాద్రి ఉలిక్కిపడ్డాడు.

"ఇదేనా సింహాద్రి రూము?" అంటూ లావుపాటి ఆకారం గడపలో నిలబడి అరచింది - తెలుగుని తమిళంలాగా మాట్లాడుతూ.

"అవునండీ! ఇదే" అన్నాడు సింహాద్రి.

ఆ ఆకారం లోపలికొచ్చింది ఫుల్ సూటులో!

"నేనుదా మీ మామయ్య ఫ్రెండ్ భావయ్యను"

సింహాద్రికి సన్నగావణుకు ప్రారంభ మయింది.

"రండి సార్! కూర్చోండి" అన్నాడు చిరంజీవి.

భావయ్య వచ్చి కుర్చీలో కూర్చు న్నాడు.

"మీ రెండిట్లో సింహాద్రి ఏది?" అడిగాడతను చిరునవ్వుతో.

"ఇదిగో- ఇదేనండీ సింహాద్రి" సింహాద్రిని చూపుతూ జవాబిచ్చాడు చిరంజీవి.

"ఓహో- సింహాద్రి ఇదా?"

"అవునండీ!" అన్నాడు సింహాద్రి.

"మా అమ్మాయి ఫోటో సూస్తివా?"

"సూస్తినండీ!"

"ఎట్లా వుండాది? రొంబ బాగుండాదా?"

"రొంప బాగుందా అంటారా?" అయోమయంగా అడిగాడు సింహాద్రి.

"రొంపకాదు. రొంబ-రొంబ అంటే తెలుంగులో ఏమి సెప్తారు! ఆ! బాంగా- బాంగా"

"ఎక్స్‌క్యూజ్ మీ" అన్నాడు చిరంజీవి కల్పించుకుంటూ.

"యస్" ప్రశ్నార్థకంగా అతని వంక చూశాడు భావయ్య.

"మీ అమ్మాయి ఫోటో - మీ అమ్మాయిది కాదని - అంటే మీ అమ్మాయిదే కాని అబ్బాయిలా ఉందని- అంటే...అదే అని మా సింహాద్రి అభిప్రాయం సార్"

"వ్వాట్!"

చిరంజీవి మళ్ళీ అంతా రిపీట్ చేశాడు.

"వ్వాట్?" అన్నాడు మళ్ళీ భావయ్య.

"మీ అమ్మాయి - అబ్బాయిలాగుం దని..సారీ అబ్బాయిలాగున్నాడని ..అంటే మగ పోలికలు - అంటే అసలు ఒరిజినల్‌గా పొరపాటున అబ్బాయి ఫోటో ఇచ్చారేమోనని"

"ఏమయ్యా- నీకేమయినా మెదడు ఉండాదా?" కోపంగా అడిగాడు భావయ్య.

"ఉండాదండీ"

"ఉంటే అట్ల మాట్లాడతావేమీ?"

"అది నా అభిప్రాయం కాదండీ"

"మరెవరిది?"

"సింహాద్రిదండీ!"

"ఏవయ్యా సింహాద్రీ! గమ్మున ఉంటావేమీ? నీ మనసులో ఏమి ఉండాదో! మాట్లాడు"

సింహాద్రి మాట్లాడేశాడు.

"సంగతేమిటంటేనండీ! చిరంజీవి చెప్పింది నిజమేనండీ"

"చిరంజీవా? చిరంజీవి ఎవరు?"

"నేనేనండీ!" అన్నాడు చిరంజీవి చిరునవ్వుతో.

"నువ్వు చిరంజీవివా?"

"అవునండీ!"





"సువ్వు సిమ్మాద్రి వాడికేమి అవుతావు?"

"ఫ్రెండ్ అవుతానండీ!"

"ఎప్పుడినుంచీ అవుతావు?"

"కాలేజ్ నుంచీ అవుతాను"

"అదియా విశేషం"

"అవున్సార్! అదిదా విశేషం"

"అయితే ఇప్పుడేమిసెప్తావు?"

"నేనేమీ సెప్పనండీ! సిమ్మాద్రే సెప్తున్నాడు"

సింహాద్రి ఛటుక్కున అందుకున్నాడు—

"అవునండీ! సంగతేమిటంటేనండీ— మీ అమ్మాయి ఫొటోలో ఉన్నది నిజానికి మీ అమ్మాయి కాదేమోనండీ! మగాడిలా— అయ్‌మీన్ ఫొటోల మార్పిడి వగైరాలు.."

భావయ్యకు కోపం ముంచుకొచ్చింది.

"ఏమయ్యా! నీకేమయినా బుద్ధి ఉండాదా?"

"ఎందుకండీ!"

"మా అమ్మాయిని అమ్మాయి కాదని సెప్తావేమి? అదిదా స్పోర్ట్‌గాళ్! ఎన్నో స్పోర్ట్స్ సేస్తది. గేమ్స్ సేస్తది. పాంటూ షర్టూవేస్తది. జుట్టు కత్తిరిస్తది-ఈమాత్రానికేమి మగపిల్లాడని సెప్తావు?"

"అదికాదండీ.."ఏదో చెప్పబోయాడు సింహాద్రి. కాని భావయ్య వినిపించుకోలేదు.

"ఏదికాదయ్యా! నువ్వు సెప్పేదేమీ సరిలేదు. నీకు సూపు సర్‌లేదా ఏమి? ఈ ఫొటోలోది-నాకూతురు కాదంటావే? ఇది నిండా లక్ష్మీదేవిలాగుండాదని అందరూ సెప్తారు. ఏమయ్యా సిరంజీవీ...నువ్వు మాట్టాడవేమి?"

"లక్ష్మీదేవిలాగా ఉన్నమాట నిజవే కానండీ, కొంచెం ఏదో - అంటే మరీ అంత ఎక్కువకాదనుకోండి...కొంచెం అదేదోగా ఉన్నట్లుందండీ"

"అదేదోగా అంటే ఏమి?"

"అంటే....అంటే మొఖంలో ఏదో క్రూరత్వం"

"ఆ! గుర్తుకొచ్చింది" అరచాడు సింహాద్రి.

భావయ్య ఉలిక్కిపడి సర్దుకున్నాడు.

"ఏమిటి గుర్తుకొస్తాది?"

"పెద్దపులి...నోనోనో అయామ్‌సారీ చిరతపులి"

భావయ్యకు సింహాద్రి మాటలు ఏమాత్రం అర్థంకాలేదు.

"ఏమయ్యా! నువ్వేమి సెప్తావు? అమ్మాయి సంగతి మాట్టాడమంటే చిరత పులి, పెద్దపులి సంగతి సెప్తావేమి?"

"నేను మీ అమ్మాయి - అయ్‌మీన్ అబ్బాయి పోలికగురించి చెప్తున్నానండీ"

"అమ్మాయి పోలికెవరిదని అడుగుతుండావా? అట్ట సెప్పరాదూ మళ్ళా. అమ్మాయి అచ్చం మా ఆవిడ పోలికదా తీసుకుంది!"

"హా..." ఆనందంగా అరచాడు సింహాద్రి.

"అంటే మీ మిసెస్‌కూడా పెద్దపులి లేక చిరతపులి లేక మరేదయినా క్రూర మృగం-అలా ఉంటుందన్నమాట! వెరీ బాడ్! అయితే పాపం మరి మీరేపద్ధతి అవలంబిస్తూంటారు?"

"వ్వాట్? పద్ధతా? పద్ధతేమి?"

"అదేసార్! అలాంటి భార్యలున్న వాళ్లు రెండు రకాల పద్ధతులు ఫాలో అవుతారని చిరంజీవి చెప్పాడు. మొదటిదేమో టూరింగ్‌లైఫ్ పద్ధతి. రెండోది.. రెండోది...రెండోదేమిట్రా?" చిరంజీవి నడిగాడతను.

"శాటిలైట్ మెథడ్" గుర్తుచేశాడు

చిరంజీవి.

"అవునవును. కరెక్ట్! శాటిలైట్ మెథడ్! ఈ రెండిట్లో మీరే పద్ధతి ఫాలో అవుతారు?''



"ఏమయ్యా ఏమిటి సెప్తావు? నీ మెదడు ఎట్టా ఉండాది?"

"మెదడా? దానిసంగతి ఎందుకిప్పుడు?"

"మరి నిండా అర్థం లేని మాటల్లు మాట్లాడతావేమి? టూరింగ్‌లైఫ్ పద్ధతి, శాటిలైట్ మెథడ్–ఏమిదంతా?" భావయ్య అయోమయంగా చిరంజీవి వేపు చూశాడు.

"అతనేమి అట్టా మాట్లాడతాడు?"

చిరంజీవి ఆయనకుదగ్గరగా జరిగాడు.

"మీకు ఫాక్ట్స్ అండ్ ఫిగర్స్ చెప్పమంటారా?"

"అంటే?"

"అంటే అదేసార్! నిజం చెప్పేయమంటారా?"

"అంటే?"

"పాపం మావాడికి అంటే–మా

సింహాద్రికి కొంచెం నట్స్ లూజ్ లెండి! అంటే మీకు తెలుసుకదా! అదన్న మాట సంగతి! అయితే పరిస్థితి చేయిదాటలేదని గారంటీగా చెప్పగలను. అమావాస్యకూ, పౌర్ణమికీ మాత్రం కొంచెం ట్రబులిస్తాడు. అంతే! పెద్ద అల్లరేమీచేయడు. కొంచెం ఎక్కువదా మాట్లాడతాడు! రోజుకి ఇరవై ఆరుగంటలు! అంతే. ఆకొద్దిసేపూమాత్రం మనం వాడు చెప్పినట్లల్లా విని తలూపాలి! అవునని వప్పుకోవాలి అంతే! అలా చేస్తే ఏ ట్రబులూ ఉండదు" వివరంగా చెప్పాడు చిరంజీవి.

భావయ్య మొఖం పాలిపోయింది.

''ఆఁ...! గుర్తుకొచ్చింది" కెవ్వున అరచి లేచి నిలబడ్డాడు సింహాద్రి.

"వ్వాట్?" అదిరిపడ్డాడు భావయ్య.

"లీప్ సంవత్సరం ఆరేళ్ళకోసారి వస్తుంది!" ఆనందంగా చెప్పాడు సింహాద్రి.

"ఆరేళ్ళకోసారా?"

"అవును"

"కాదు" అన్నాడు భావయ్య.

"మరి?"

"అయిదేళ్ళకుదా ఒకసారి వస్తుంది"

"కాదు ఆరేళ్లు" అరిచాడు సింహాద్రి.

"వప్పుకోండి సార్! లేకపోతే చాలా గొడవయిపోతుంది" రహస్యంగా చెప్పాడు చిరంజీవి.

"ఏమిగొడవ సేస్తాడు?" అనుమానంగా అడిగాడు భావయ్య.

"మీదపడి జుట్టుపీకేస్తాడు"

"నాకు జుట్టులేదు కదా?"

"లేపోతే గిల్లుతాడ్సార్! ఊరికే మాత్రం వదలడు"

"సరి సరి'' అన్నాడు భావయ్య భయపడుతూ.

"ఇంతకూ మీరేపద్దతి ఫాలో అవుతారండీ? టూరింగ్ లైఫ్ పద్ధతా, శాటిలైట్ పద్ధతా?''

"నాన్సెన్స్'' అన్నాడు భావయ్య చిరాకుగా.

"అలా కోప్పడకండిసార్! చెప్పాను గదా! పౌర్ణమీ, అమావాస్యకే కొంచెం ట్రబుల్ అంతే! మిగతా అన్ని రోజులూ హి విల్ బి ఫర్ ఫెక్ట్లీ ఆల్ రైట్!''

''ఇలాంటి మాడ్ ఫెలోని నా కూతురికి అంటగట్టాలనిదా ఆ విశ్వనాథం వాడు ప్రయత్నిస్తాడు. వాడి ముక్కు పగల కొట్టుతాను'' కోపంగాఅన్నాడు భావయ్య.

"అబ్బే! మీరు చిన్న విషయం పెద్దది చేస్తున్నారుసార్! వీడు మాడ్ ఫెలోకాదు! జస్ట్ బిగినర్! చాలా లేతపిచ్చి! మీరు దీనికంత ప్రాముఖ్యత ఇవ్వనవసరంలేదు.. అసలు ప్రతిమనిషికీ ఎంతోకంతపిచ్చి ఉంటుందని సైకాలజిస్టులు అంటూంటారు. మీరు 'మాన్ అండ్ మాడ్‌నెస్' అనే బుక్కు చదివారా?''

''ఎందుకు చదవటం?''

"జస్ట్ నాలెడ్జ్‌కోసం. పిచ్చిగురించి తెలుసుకోడానికి"

భావయ్య మళ్ళీ తన ధోరణిలో పడిపోయాడు.

"విశ్వనాథం వాడు నన్ను నిండా అన్యాయం సేస్తాడే! మా అమ్మాయికి పిచ్చివాడినితెచ్చి కళ్యాణం సేస్తానంటాడే''

"మీరన్న మాట కూడా కొంతవరకూ నిజమేసార్ ! ఇలాంటి విషయాల్లో అబద్ధాలు చెప్పడం తప్పు!"

"తప్పా? ఇది తప్పుకాదు. నిండా క్రిమినల్ కేసు"

"క్రిమినలా?" ఆశ్చర్యంగా అన్నాడు చిరంజీవి.





"యస్. దిసీజ్ క్రిమినల్"

"నోసార్! దిసీజ్ సివిల్!నాట్ క్రిమినల్"

భావయ్యకు వళ్లు మండిపోయింట. "నీకు 'లా' ఏమి తెలుసని మాట్లాడతావు?" కోపంగా అన్నాడతను.

"నేను లాయరు ఇంటిపక్కన కొన్నినాళ్ళున్నాను."

"పోడా - మడ్ హెడ్"

"నా మాటవిని మీరు తొందరపడకండి సార్! సింహాద్రి పర్ ఫెక్ట్ బాయ్. ఆ ఒక్కలోపం తప్పిస్తే ఏ లోపమూ లేదు. మీ అమ్మాయికి ఈడూజోడూ చక్కగా సరిపోతుంది. పౌర్ణమికీ, అమావాస్యకీ మీ అందరికీ ఒకరోజు ట్రబులుంటుంది. అదికూడా పెద్ద ట్రబుల్ కాదు. వాడు చెప్పినవన్నీ వింటేచాలు! అంతా ఓకే. మీకు రామోల్ కర్ సవానీ తెలుసా? వెరీ గుడ్‌బాయ్! మా రైల్వేలోనే డ్రైవర్. వాడు అన్నివిధాలానార్మల్ గానేఉంటాడు. ఎటొచ్చీ అమావాస్యకీ, పౌర్ణమికీ మాత్రం కొంచెం చిరాగ్గా ఉంటాడు. ఆ రెండు రోజులూ డ్యూటీలో ఉండేమాత్రం నానా హడావుడీ చేస్తాడు. సిగ్నల్ ఇవ్వక పోయినా సరే రైలాపడు. ఆపితే ఇంక మళ్ళీ స్టార్ట్‌చేయడు. లేదా ఒక్కోసారి రాత్రిళ్లు రెండు స్టేషన్లమధ్య మాంఛి అడవిలో రైలాపి ఇంజన్‌పక్కనే పక్కేసుకుని నిద్రపోతాడు. పొద్దున్నే లేచాడంటే మళ్ళీ మామూలు మనిషయిపోతాడు" అంతవరకూ చెప్పి ఏదో అనుమానం వచ్చి పక్కకు తిరిగిచూశాడు చిరంజీవి. అప్పటికే భావయ్య మాయమయిపోయాడు.

"మీ వుడ్‌బి ఫాదరిన్లా ఏడీ?" సింహాద్రి నడిగాడితను.

"అదే నాకూ తెలీటంలేదు. బయట కారు స్టార్టవుతూంటే చూశాను. తీరాచూస్తే డ్రైవ్‌చేస్తోంది భావయ్య! అంత క్విక్‌గా మనకు తెలీకుండా గదిలోంచి బయటికెలా వెళ్ళిపోయాడో తెలీదు"

"చాలా ఫాస్ట్‌గా చేశాడాపని" నవ్వుకున్నాడు చిరంజీవి.

"ఇంతకూ అతని కూతురితో పెళ్ళిబాధ తప్పిపోయినట్లేనా?" అనుమానంగా అడిగాడు సింహాద్రి.

"సెంట్ పర్సెంట్!"

సింహాద్రి తేలికగా గాలి పీల్చుకున్నాడు.

"ఇప్పుడు తిన్నగా మావయ్య దగ్గర కెళ్లి నానామాటలూ అంటాడేమో!"

"అవకాశాలు ఎక్కువగా ఉన్నాయ్"

"మరప్పుడు సంగతంతా మావయ్యకు తెలుస్తుందికదా?"

"తప్పకుండా తెలుస్తుంది"

"తెలీగానే మరి మాంఛి కొరడా ఒకటి తీసుకుని మనకోసం రాడంటావా?"

"వస్తేరానీ! మనం అలాంటి సంభాషణే జరగలేదని పూర్తిగా వాదిస్తాంకదా?"

"ఐసీ"

"ఎలావుంది మన ప్లాన్?" అడిగాడు చిరంజీవి.

"సింప్లీ సూపర్బ్! చాలా థాంక్స్‌రా"

"దట్సాల్‌రైట్. ఎ ఫ్రెండ్ ఇన్ నీడ్ ఈజ్ ఎ ఫ్రెండ్ ఇండీడ్" చిరునవ్వుతో అన్నాడతను.

* * *

మర్నాడు తెల్లారుజామున ఎనిమిది గంటలకల్లా లేచి అద్దం ముందు కూర్చున్నాడు సింహాద్రి. చిరంజీవి డ్యూటీకెళ్ళి సాయంత్రం తిరిగి వచ్చేసరికి అప్పుడే మేకప్ పూర్తిచేసి లేచి నిలబడ్డాడు.



"ఎలా వుందిరా ఈ డ్రెస్? బాగా సూటయిందా?" అనడిగాడు ఆనందంగా.

"మాంచి రేసుగుర్రంలాగున్నావ్"

"ఇలా ఈ పోజులో నిలబడమంటావా, గడప దగ్గర?"

"ఛట్! రచయితలు గడప దగ్గరా, కిటికీ చువ్వలు పట్టుకునీ నిలబడతారేమిట్రా!"

"మరేం చేయమంటావ్?"

"ఆ అమ్మాయి వచ్చేసరికి టేబుల్ దగ్గర కూర్చుని నవల రాస్తూ ఉండాలి"

"కానీ నాకు నవల రాయడం రాదుగా?"

చిరంజీవికి చిరాకేసుకొచ్చింది.

"రాకపోవడమేమిట్రా? నీకు రాజూ ఏడు చేపలు కథ తెలీదూ?"

"తెలుసు!"

"దాన్నే సోషలైజ్ చేసెయ్! రాజు బదులు జమీందారు అని పెట్టు! ఆ జమీందారుకి ఏడుగురు కొడుకులు! ఒకడు డాక్టరు, ఒకడు ఇంజనీరు, ఒకడు బిజినెస్ మాన్, ఇంకోడు రచయిత – అలా ఏర్పాటు చేసెయ్. ఆఖరోడు మాత్రం రిక్షా వాడు. నవలంతా వాడిచుట్టూతా తిరుగుతుందన్నమాట!"

"కానీ జమీందారు కొడుకు రిక్షా తొక్కడుకదా?"

"ఆ విషయం ఎవడడుగుతాడ్రా నిన్ను? అంతగ్గాపోతే వాడుట్టి ప్రిన్సిపుల్డ్ ఫెలో అని చెప్పు! తండ్రి డబ్బుతో బతకడం ఇష్టంలేని అభిమానమో, ఆత్మాభిమానమో అదేదో అఘోరించిందని కోసెయ్! నిజానికి వాడు ఏదేశాల్లో ఏదో పెద్ద కోర్సులు ఓ పాతిక చదివాడని చెప్పు. అయినాగాని కాయకష్టం చేసుకు బతకాలని వాడి హాబీ అన్నమాట. అలా ఏదోకటి లాగించెయ్యడమే"

"సరే. ఏవీ కాగితాలు?"

"టేబుల్ మీద ఉన్నవిచాల్లే త్వరగా స్టార్ట్ చేసెయ్. ఆ పిల్ల వచ్చే టైమయింది"

సింహాద్రి టేబుల్ ముందు కూర్చుని తనలో తను కూడబలుక్కుంటూ నవల వ్రాయడం ప్రారంభించాడు.

'అనగనగా ఓ జమీందారు. ఆ జమీందారు చాలా బీదవాడు. కానీ అతని కొడుకులు చాలా ధనవంతులు. అతని భార్య ఇంకా బోలెడు ధనవంతురాలు. కానీ ఆఖరి కొడుకు మాత్రం పరమగర్భదరిద్రుడు...'




"రచయిత ధనుంజయ్‌గారిల్లు ఇదేనాండీ?" అన్న సన్నని గొంతువిని ఉలిక్కిపడి, గాబరా అయిపోయి తక్కున లేచి నిలబడ్డాడు సింహాద్రి.

ఎదురుగ్గా ఫొటోలో చూసిన బొమ్మ ప్రాణం ప్లస్ ఇంకా బోలెడు అందంతో ఎదురుగ్గా నిలబడి ఉంది.

కొద్ది క్షణాలపాటు సింహాద్రి ఆమె వంకే చూస్తూ, నోరు మెదపకుండా నిలబడిపోయాడు.

ఆమెకు అతని మానసిక పరిస్థితి మీద అనుమానం కలిగింది. గాలిలోకి చేయెత్తి అతని కళ్ళముందు రెండు చిటికెలు వేసింది.




అప్పుడుగాని సింహాద్రి స్పృహలోకి రాలేదు.

"ఆ... ధనుంజయ్‌గారిల్లాండి...ఆయన ఈ గది ఖాళీ..." మిగతాది కూడా పూర్తిచేసి ఉంటే ఆమె బులెట్‌లాగా అక్కడి నుంచి దూసుకు వెళ్ళిపోయుండేది.

కానీ సింహాద్రి పరిస్థితంతా హారర్ పిక్చర్ చూస్తున్నట్లు గమనిస్తోన్న చిరంజీవి చప్పున అడ్డుపడిపోయాడు.

"ఉష్! వాగకురా! రండి మేడమ్ రండి! ఇదే ధనుంజయ్‌గారిల్లు" అన్నాడు చిరునవ్వు నవ్వుతూ.

శ్రీదేవి సంతృప్తిగా గాలి పీల్చుకుంది.

"హమ్మయ్య... వెదకలేక చచ్చాను. పాడు ఇంటి నంబరు. ఇంటి నంబర్లు, ఒక పరుసాలేదూ, వాయిూలేదు"

"అవునండీ! అసలివి ఇళ్ళనంబర్లు కాదండీ. సీక్రెట్ కోడ్ నంబర్లు. ఒకరిల్లు ఒకరికి తెలీకుండా ఉంటానికని కార్పొరేషన్‌వాళ్లు అలా ఏర్పాటు చేశారు. రండి. లోపల కూర్చోండి"

శ్రీదేవి లోపలికొచ్చి కుర్చీలో కూర్చుంది.

"అన్నట్లు ఇంతకూ ధనుంజయ్ గారెవరు?" అంది ఇద్దరినీ పరీక్షగా చూస్తూ.

"ఇదిగో వీడేనండీ" అన్నాడు చిరంజీవి చప్పున సింహాద్రిని చూపిస్తూ. అని సింహాద్రి భుజం మీద రహస్యంగా తన మోచేత్తో ఒక్కపోటు పొడిచాడు.

దాంతో సింహాద్రి "అమ్మో" అని అరవబోయి ఆపుకుని "అవునండీ... నేనేనండీ" అన్నాడు గాబరాగా.

"మీరా!" ఆశ్చర్యంగా అడిగిందామె.

"అవునండీ! నేనే!"

"ఓ... నమస్తే"

"నమస్కారమండీ!"

"నా ఉత్తరం అందిందా మీకు?" అడిగిందామె.

"అందిందండీ! ఫొటో కూడా అందింది. ఫొటో చాలా బాగుందండీ"

"అందిందో లేదో అని భయపడుతూ వచ్చాను...ఇంతకూ వీరెవరు?" చిరంజీవిని చూస్తూ అడిగిందామె.

"వాడు నా ఫ్రెండండీ! ఇద్దరం ఇంటర్ కలిసి చదువుకున్నాం"

"ఓహో! క్లాస్‌మేటన్నమాట"

"అవునండీ! 'డి' సెక్షన్! కదురా?"

"అవునండీ...'డి' సెక్షన్! రోల్ నంబర్ థర్టీ సెవన్"

"నమస్తే" అందామె చిరంజీవివేపు తిరిగి.

"నమస్తే...నమస్తే...నమస్తే"

"మీ పేరేమిటండీ?"

"చిరంజీవి అంటారండీ"

"ఎవరు?"

"ఎవరా? ఎవరంటే...అదే అందరూ నండీ. వీడు కూడా అంతే"

"నిజమేనండీ! వాడి పేరు చిరంజీవే"

"ధనుంజయ్‌గారూ మీరేదో రాస్తున్నట్లున్నారు కదూ?" టేబుల్ మీద కాగితాలు, పెన్నూ చూసి అడిగిందామె.

"అవునండీ! అర్జంటుగా ఓ నవల రాద్దామనీ..."

"మీ నవలలంటే నాకెంతో ఇష్టమండీ! మీ నవలల్లోని హీరోలందరూ రోజు కొకరు చొప్పున నా కలలో కనిపిస్తారండీ"

"అలాగా. చాలా సంతోషం"

"కనబడి ఏం చేస్తారో తెలుసాండీ?"

"తెలీదండీ! ఏం చేస్తారు?"

"తెల్లారే వరకూ వదలరండీ! కబుర్లు

చెప్తారు; షికార్లు తీసుకెళ్తారు. భలే తమాషాగా ఉంటుందిలెండి! మీ నవల 'గతి తప్పిన మతి' ఎన్నిసార్లు చదివానో మీకు రాశానా?"

"రాయలేదండి!"

"ఇరవైమూడుసార్లు చదివానండి!" ఆనందంగా అందామె.

"అబ్బ-ఇరవైమూడుసార్లా? ఎందు కండీ అన్నిసార్లు చదవడం?"

"కనీసం అప్పటికయినా సురేఖ పంతం మాని శ్రీవిరించి దగ్గరకెళ్తుందేమో ననండి!"

సింహాద్రి కన్‌ఫ్యూజ్ అయిపోయాడు.

"సురేఖా? సురేఖ ఎవరండీ?" ఆశ్చ ర్యంగా అడిగాడు.

శ్రీదేవి కిలకిల నవ్వేసింది.

"అదేమిటి మీ నవలలో హీరోయిన్నే మరిచిపోయారా మీరు"

సింహాద్రికి చెమటలు పట్టేసినాయ్.

"ఇహి...ఇహిహి" అన్నాడు తప్పించుకోడానికి.

చిరంజీవి మళ్ళీ సింహాద్రి రక్షణకు వచ్చేశాడు.

"వాడికి కొంచెం మతిమరపు ఎక్కువలెండి. నవలల పేర్లు, పాత్రలు, సంఘటనలు, కథావస్తువు ఇవేమీ గుర్తుండ వండీ! కదురా?"

సింహాద్రి ఠకీమని తేరుకున్నాడు.

"అవునండీ! అస్సలు గుర్తుండవు"

శ్రీదేవి ఆశ్చర్యపోయింది.

"అరె! భలే ఆశ్చర్యంగా ఉందే! అంత మతిమరుపువాళ్లు మరల్లాంటి నవలలెలా రాయగలుగుతున్నారు?"

"నాకూ అదే తెలీటం లేదండీ! భలే తమాషాగా ఉంది కదండీ?"

శ్రీదేవి ఓ క్షణం ఆలోచనలో పడి ఇంటి లోపల ఇంకా గదులేమయినా ఉన్నాయేమోనని చూసింది.

"ఇంట్లో మీఇద్దరే ఉంటున్నారాండీ" సింహాద్రినడిగిందామె.

"అవునండీ!"

"అంటే మీకింకా పెళ్ళికాలేదా?"

"అబ్బే, ఇంకా లేదండీ! పిల్లలుకూడా లేరు"

"అలాగా!"

"అవునండీ!"

"నేనింకా మీకు పెళ్ళయిపోయిందను కుంటున్నాను"

"ఇంకా లేదండీ! చేసుకుందామనే అను కున్నాను గానీ చేసుకోలేదు"

"ఎందుకని ఆగారు?"

"ఇంతవరకూ నాకు నచ్చిన అమ్మాయి దొరకలేదండీ! ఇంతవరకూ అంటే ఇంతకుముందువరకూ అన్న మాటండీ!"

"మీక్కావలసిన అమ్మాయి ఎలా ఉండాలనుకుంటున్నారు? మీ హీరోయిన్ సురేఖలాగానా, చంద్రకళలాగానా, భారతిలాగానా?"

సింహాద్రి మళ్ళీ కన్‌ఫ్యూజ్ అయి పోయాడు.

"ఎలాగా? ఎలాగంటేనండీ! ఎలా గంటే...ఎలారా చిరంజీవీ?"

చిరంజీవి ఠకీమని అందుకున్నాడు.

"భారతిలాగా ఉండాలనుకుంటున్నా డండీ!"

సింహాద్రిలో కూడా ఉత్సాహం పొంగుకొచ్చింది.

"అవునండీ! అచ్చం భారతిలా ఉండే నాకు భలే ఇష్టం"

"అయ్యో! అదేమిటి?" ఆశ్చర్య పోయింది శ్రీదేవి.




సింహాద్రి నీరసపడిపోయాడు.

''ఏమైందండీ?''

''భారతి పిచ్చిదికదండీ మీనవలలో?''

''ఆ...పిచ్చిదా?''

''అవును...మర్చిపోయారా?''

''అబ్బే గుర్తుంది. ఏమిట్రా చిరం జీవీ?''

చిరంజీవి ఖంగారుపడ్డాడు.

''అయితే..అయితే ఆభారతి కాదండీ! వీడు రాయబోతున్న కొత్త నవలలో హీరోయిన్ భారతి...''

ఆమె కళ్లు ఆనందంతో మెరిసినయ్.

"ఓ...మీరు కొత్త నవల రాస్తున్నా నన్నారు కదూ?''

''అవునండీ!''

''ఈ నవల కూడా హిప్నాటిజం మీదే రాశారాండీ?''

''అవునండీ! బోలెడు హిప్నాటిజం ఉంటుంది కథలో. అంతేకాదు - టెలీ పతి కూడా ఉంటుంది''

''కథేమిటో చెప్పరూ? ప్లీజ్''

సింహాద్రి తడిబడిపోయాడు!

''కథా? కథా.. అదేనండీ ... ఏమిటంటే.... ఏమిటంటే"

''అదేరా-నాకు చెప్పావుగా ఇందాక. జమీందారు ఉంటాడు.."తనందుకున్నాడు చిరంజీవి!

''ఆ గుర్తుకొచ్చేసింది-ఇంక నువ్వు చెప్పొద్దు! నేనే చెప్తా చూడు! అనగనగా ఓ జమీందారు ఉంటాడండీ! ఆయన రోజూ రిక్షా తొక్కి పొట్టపోసు కుంటూంటాడండీ''

శ్రీదేవి ఆశ్చర్యపోయింది.

''అదేమిటి? జమీందారు రిక్షా తొక్కటం ఎందుకు?''

"ఏమో తెలీదండీ'' అంటూ చిరంజీవి వేపు చూశాడతను.

''జమీందారు కాదురా- జమీందారు కొడుకు అన్నావిందాక''

''ఆ...అవునవును! జమీందారుగారి ఆరో కొడుకు రిక్షా తొక్కుతాడన్న మాటండీ!''

శ్రీదేవికి చిరాకేసుకొచ్చింది.

''అతనయినా గాని అంత ఆస్తి ఉండగా రిక్షా ఎందుకు తొక్కాలి?''

''ఎందుకంటే అది హాబీ అన్న మాటండీ! ఇప్పుడు మనకి స్టాంపులు సేకరించడం, రచనలు చేయడం, ఫొటో గ్రఫీల్లాంటివి ఎలా హాబీలో వాడికది హాబీ అన్న మాటండీ''

''నేనింతవరకూ అలాంటి హాబీ గురించే వినలేదు'' అందామె నమ్మ లేనట్లు.

''నేనూ వినలేదనుకోండి! కానీ మన నవలలో అలా వుంటుందన్న మాటండీ!''

''మరి ఇందులో హిప్నాటిస్ట్ ఎవ గండీ''

సింహాద్రి స్పీడుగా ఆలోచించ సాగాడు.

''ఎవరా? ఎవరంటే...ఎవరంటే... ఆ! వాడేనండీ! రిక్షావాడు!''

శ్రీదేవి ఉలిక్కిపడింది.

"రిక్షావాడా?"

"అవునండీ!"

''అతనికెలావచ్చు హిప్నాటిజం?''

''వాడు అమెరికాలో హిప్నాటిజం నేర్చుకుని వచ్చాడన్న మాటండీ! అది నవల ఆఖర్లోగానీ ఆడియెన్స్‌కి తెలీదు"

''ఆడియెన్సేమిటి? పాఠకులుకదూ?''

''ఓ...అయామ్‌సారీ. ఇదే పిక్చర్ కూడా తీయాలని ప్లాన్ చేస్తున్నాలెండి. అందుకని ఆడియెన్స్ అన్నాను''



''అప్పుడేమవుతుందండీ?''

"ఏముందండీ? ఓరోజు ఓ అమ్మాయి అతని రిక్షాఎక్కి ఏడుస్తుందండీ. ఆమెను చూసి జాలిపడి రిక్షావాడు కథేమిటని అడుగుతాడండీ. ఆమె కథ చెప్తుందండీ! రిక్షావాడు ఆమెకు సహాయం చేయాలని నిశ్చయించుకుని రంగంలోకి దిగుతాడండీ!

అక్కడినుంచి కథ భలే మెలికలు తిరిగి పోతుందండీ! కథలోకి మహామహా మంత్రి గాళ్ళు కూడా జొరబడతారండీ"

''అబ్బ! ఒండర్ ఫుల్"

"మనం కాసేపలా బీచ్ కెళ్దామాండీ?''

''బీచ్ కా? హైదరాబాద్‌లో బీచ్ ఏమిటి?"

"సారీ! కాదండీ. డిన్నర్ కెళ్దామా అన బోయి బీచ్ అన్నానండీ! అచ్చు తప్పన్న





మాటండీ”

“ఇప్పుడు టైం లేదండీ! మరోసారి వెళాం. మా డాడీ నాకోసం ఎదురుచూస్తుంటాడు. అది సరేగానండీ–మీకు హిప్నా



టిజం వచ్చా?''

సింహాద్రి ఉలిక్కిపడ్డాడు.

''హిప్నాటిజమా?''

''అవునండీ! అది వచ్చినవాళ్ళంటే నాకెంతో ఇష్టం"

"అలాగా! అయితే నాకూవచ్చండి'' హిప్నాటిజమేకాదు టెలీపతీ, విలోపతీ, సైకోపతీ, మైకోపతీ ఇవన్నీ కూడా వచ్చండీ!''

"ఆ! నిజంగానా?''

"అవునండీ!కావాలంటే మా చిరంజీవి నడగండి''

"అవునండీ! వాడు చాలా పెద్ద హిప్నాటిస్ట్! కాపోతే ఈ విషయం ఎవరికీ తెలీదు. ఆఖరికి వాడిక్కూడా తెలీదు. అంత సీక్రెట్ అన్నమాట!"

''ధనుంజయగారూ! నన్నోసారి హిప్నటైజ్ చేయరూ? ప్లీజ్!"

"మిమ్మల్నా?"

"అవునండీ"

''మిమ్మల్ని చేయటం కుదరదండీ!''

"ఎందుకని?''

''ఏమోనండీ!తెలీదు. కానీ మీ అంత అందమయిన అమ్మాయిలను చేయాలంటే చాలా కష్టమండీ! కదురా చిరంజీవీ''

''అవునండీ! కుదరదండీ!"

''పోనీ చిరంజీవిగారిని చేయగలరా?''

"ఓ- ఇట్టే చేస్తాను. చిరంజీవి ఇలారారా! ఇటుకూర్చో'' అన్నాడు సింహాద్రి ఆనందంగా. చిరంజీవి వచ్చి అతని కెదురుగ్గా కూర్చున్నాడు.

''నువ్విప్పుడు నావంకే చూస్తున్నావ్.. నావంకే చూస్తున్నావ్ .. నావంకే చూస్తున్నావ్'' అన్నాడు సింహాద్రి.

చిరంజీవి మత్తెక్కినవాడిలా అతని వంకే చూడసాగాడు.

''నువ్విప్పుడు నిద్రలో కెళ్ళిపోతున్నావ్...నిద్రలోకెళ్ళిపోతున్నావ్... నిద్రలోకెళ్ళిపోతున్నావ్'' అన్నాడు సింహాద్రి.

చిరంజీవి గుర్రున గురక పెడుతూ కూర్చునే నిద్రలోకి వెళ్ళిపోయాడు. ఆ దృశ్యం చూసి ఆనందంపట్టలేక శ్రీదేవి తప్పట్లు కొట్టేసింది.

''అబ్బ! యూ ఆర్ రియల్లీ ఒండర్ ఫుల్'' అంది అతనివంక అభిమానంగా చూస్తూ.

"ఇప్పుడు నువ్వు నిద్రలేచి ఎగిరి గంతులేస్తున్నావ్..ఎగిరిగంతులేస్తున్నావ్.. ఎగిరి గంతులేస్తున్నావ్'' అన్నాడు సిహాంద్రి ద్విగుణీకృత ఉత్సాహంతో.

అంత కష్టమయిన ఎక్సర్సైజ్ ఇస్తున్నందుకు సింహాద్రి వంక కొరకొరా చూస్తూ ఎగిరి గంతులేయసాగాడు చిరంజీవి.

శ్రీదేవి మళ్ళీ తప్పట్లు కొట్టేసింది.

"ఇప్పుడు నువ్వు ఇంటిబయటికెళ్ళి రూమ్‌చుట్టూ ప్రదక్షణలు చేస్తున్నావ్... రూమ్‌చుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నావ్... రూమ్‌చుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నావ్"

చిరంజీవికి వళ్ళు మండిపోయింది. కాని చేసేదిలేక తూనీగలా బయటకు పరుగెత్తి రూమ్‌కి ఓ ప్రదక్షణ చేసేసరికి అప్పుడే రూమ్‌ముందు ఆటో దిగుతున్న మామయ్య కనబడ్డాడు. వెంటనే తూనీగలాగ మళ్ళీ రూమ్‌లోకొచ్చేసి కుర్చీలో కూలబడిపోయాడు ఒగరుస్తూ.

అదిచూసి వెంటనే తన సజెషన్ మార్చేశాడు సింహాద్రి.

"నువ్విప్పుడు మామూలు స్థితిలో కొస్తున్నావ్ ... మామూలుస్థితిలో కొస్తున్నావ్...మామూలు స్థితిలోకొస్తున్నావ్''





"ఒరేయ్! బయట నిలబడ్డ ఆ వ్యక్తిని హిప్నటైజ్ చెయ్ చూద్దాం!" అంటూ చిరంజీవి సైగచేశాడు శ్రీదేవి చూడకుండా.

సింహాద్రి రోడ్డుమీద ఆటోరిక్షావాడి దగ్గర చిల్లరకోసం నిలబడ్డ మామయ్యను చూసి ఖంగారుపడ్డాడు. చిరంజీవి అయిడియా ప్రకారం రిస్క్ తీసుకోకపోతే శ్రీదేవి ముందు తన పరువు తీసేస్తాడు మామయ్య.

శ్రీదేవికూడా ఆ సలహా నచ్చింది.

"అవునండీ! అదిగో ఇప్పుడే ఆటో దిగాడే-ఆ మీసాలతనిని చేయండి! భలే సరదాగా ఉంటుంది" అంది ఆనందంగా.

"సరే. మీరడిగారు కాబట్టి చేస్తాను" అన్నాడు సింహాద్రి వణుకుతూ. అప్పటికే విశ్వనాథం గడపదగ్గరకొచ్చి లోపల సింహాద్రి, చిరంజీవిలతోపాటు ఓ అందమయిన ఆడపిల్లకూడా ఉండడం చూసి తక్కున ఆగిపోయాడు. అతనిని చూసేసరికి సింహాద్రి నోటివెంబడి మాటరాలేదు. పెదాలు మాత్రమే కదులుతున్నాయ్. అదిచూసి చిరంజీవి సింహాద్రిని మోచేత్తో ఒక్క పోటు పొడిచాడు. "అమ్మో" అని అరచాడు సింహాద్రి! అరచి వెంటనే స్పృహలోకొచ్చి విశ్వనాథం వేపుచూసి "మీరు లోపలికొస్తున్నారు... లోపలికొస్తున్నారు ... లోపలికొస్తున్నారు" అన్నాడు.

విశ్వనాథానికి అతనిమాటలేమాత్రం అర్థం కాలేదు.అసలా ఆడపిల్ల ఆ రూంలో ఎందుకుందా అని అర్థమవక చస్తూంటే మధ్యలో సింహాద్రి "మీరు లోపలికొస్తున్నారు" అని మూడు సార్లు అనడం మరింత అయోమయంగా అనిపించింది. ఆ ప్రదేశంలో ఎక్కడో ఏదో అసహజంగా ఉన్నట్లనిపిస్తోంది. అనుమానంగా గదిలోకి నడిచి నాలుగు మూలలా గాలిస్తున్నట్లు చూశాడతను.

"మీరు నావంకే చూస్తున్నారు... నావంకే చూస్తున్నారు....నా వంకే చూస్తున్నారు" అన్నాడు సింహాద్రి మళ్ళీ.

దాంతో వళ్ళుమండిపోయింది విశ్వనాథానికి.

"నోర్మూసుకోరా పక్షీ! నీ వంకే చూడడం ఏమిటి? చూస్తున్నాను! చూస్తేనేం? ఏం చేస్తావ్?" అన్నాడు గట్టిగా అరుస్తూ.

"మీరిప్పుడు నిన్నటిలో కెళ్తున్నారు, నిన్నటిలోకెళ్తున్నారు... నిన్నటిలోకెళ్తున్నారు" అన్నాడు సింహాద్రి అతని మాటలు పట్టించుకోకుండా.

హఠాత్తుగా విశ్వనాథానికి అనుమానం ముంచుకొచ్చింది.

సింహాద్రి ప్రవర్తన అనుమానాస్పదంగా కనిపిస్తోంది. తనతో భావయ్య చెప్పిన విషయాలన్నీ నిజమేనేమో! సింహాద్రికి అకస్మాత్తుగా చిన్నసైజు పిచ్చి పట్టుకుందేమో! లేపోతే అలా అర్థం పర్థంలేని మాటలు ఎందుకుమాట్లాడతాడు?

'మీరు నిన్నటిలోకెళ్తున్నారు' అట వీడిమొఖం! పిచ్చికాకపోతే నిన్నటిలోకెవరయినా వెళ్ళగలరా? ఛస్తే వెళ్ళలేరు. నిన్నటిలోకీ వెళ్ళలేరు, రేపటిలోకీ వెళ్ళలేరు.

సింహాద్రి విశ్వనాథం మొఖంలోని మార్పులన్నీ జాగ్రత్తగా గమనిస్తూనే వున్నాడు.

"మీరు నిన్నలో ఉన్నారు-నిన్నలో ఉన్నారు-నిన్నలో ఉన్నారు" అన్నాడు అతను మళ్ళీ.

విశ్వనాథం అంతతేలిగ్గా సింహాద్రి పిచ్చిగురించి నిర్ధారణకు రాదల్చుకోలేదు.

అంచేత క్రాస్‌కొశ్చన్స్ వేయాలని నిర్ణ యించుకున్నాడు.

''ఏమిటి భావయ్యదగ్గర వాగావుట?'' తీవ్రంగా అడిగాడు.

''చూశావా శ్రీదేవీ! అతనిప్పుడు నిన్నటిలో కెళ్ళిపోయాడన్నమాట. నిన్న జరిగిన అతని తాలూకు విషయాలన్నీ ఇప్పుడు మాట్లాడతాడన్న మాట!''

''అబ్బ! ఎంత బాగుందో'' అంది శ్రీదేవి ఆనందంగా.

"ఏమిటా పిచ్చివాగుడు?'' అరచాడు విశ్వనాథం.

శ్రీదేవి తప్పట్లు కొట్టింది. ఆమెతో పాటు చిరంజీవి కూడా తప్పట్లుకొట్టేశాడు

''వండర్‌ఫుల్'' అంది శ్రీదేవి.

''యస్. కంప్లీట్‌గా నిన్నటిలో కెళ్ళి పోయాడు'' అన్నాడు చిరంజీవి.

''ఏం? నీక్కూడా ఎక్కిందాపిచ్చి?'' చిరంజీవిని తీవ్రంగా చూస్తూ అడిగాడు మావయ్య.

''ఏమిట్రా అతనుమాట్లాడుతున్నాడు" అర్థంకానట్లు సింహాద్రినడిగాడు చిరంజీవి.

''పిచ్చిగురించి మాట్లాడుతున్నాడు. బహూశా నిన్న వాళ్ళింట్లో ఎవరికో పిచ్చి పట్టిఉంటుంది. లేదా ఈయనకే పిచ్చి ఉండవచ్చు. అతను ఇంకొంచెం వివరంగా మాట్లాడితేనేగాని మనకుతెలీదు'' అన్నాడు సింహాద్రి.

మావయ్యకేమీ పాలుపోవడం లేదు. భావయ్య చెప్పినట్లు సింహాద్రి పిచ్చివా డనడానికే ఎక్కువ ఆస్కారాలు కనబడు తున్నాయ్.

కానీ మరి ఈ చిరంజీవిగాడు కూడా ఎందుకలా మాట్లాడుతున్నట్లు? అంటే ఇందులో ఏదోనాటకం ఉందన్నమాట!

''అయితే ఇద్దరూ కలసి భావయ్య దగ్గర నాటక మాడారన్నమాట'' అన్నాడు కోపంగా.

సింహాద్రి, చిరంజీవి మొఖాలు చూసు కున్నారు.

''భావయ్య ఎవరు?'' చిరంజీవి సింహాద్రిని అడిగాడు.

''నిన్న జరిగిన ఓ సంఘటనలో భావయ్య అనేవ్యక్తికూడా ఉన్నాడన్న మాట!'' చెప్పాడు సింహాద్రి.

''మీ వెధవ్వేషాలు నాదగ్గర కాదు! ఆ సంబంధం తప్పించుకోడానికి నీకు పిచ్చివున్నట్లు నువ్వు వాగితే, వాడేమో నీది మెంటల్ కేసని భావయ్యకు సర్టిఫికేట్ ఇస్తాడా? ఇద్దరూ కలసి నిక్షేపంలాంటి సంబంధంకాస్తాచెడగొట్టేస్తారా?రాస్కెల్స్ మీ పని ఇప్పుడే పడతాను" అంటూ ఓ అడుగు ముందుకి వేశాడు విశ్వనాథం.

"ఏమిటి అంటాడు?"అడిగింది శ్రీదేవి సింహాద్రిని.

"ఏదో పెళ్ళి సంబంధం గురించి. ఇతనినెవరో కుర్రాళ్ళు ఆటలు పట్టించి నట్లున్నారు. అందుకని కోపం వచ్చిందన్న మాట!" అన్నాడు సింహాద్రి.

"అబ్బ! రియల్లీ ఒండర్‌ఫుల్!" అంది శ్రీదేవి.

"అవును. చాలా మోర్వలెస్ ఈవెంట్" వప్పుకున్నాడు చిరంజీవి.

"ఒకోసారి ఇలా బాగా కుదురు తుంది" అన్నాడు సింహాద్రి.

"అవును శ్రీదేవిగారూ! సింహాద్రి ఇంతకు ముందు కూడా ఇలాంటి ప్రద ర్శనలు చాలా ఇచ్చాడుగానీ, ఇంత సూపర్బ్‌గా ఎప్పుడూ కుదరలేదు?" అన్నాడు చిరంజీవి.

విశ్వనాథం ఉగ్రుడయిపోయాడు.

అయితే దక్కున వాళ్ళ మీద దాడి




చేయడానికి మాత్రం కొంచెం బెరుగ్గానే ఉంది. "రాస్కెల్! ఏమిట్రా సూపర్బ్ అంటున్నావ్" చిరంజీవి వంక చూస్తూ అరిచాడు.

"మీరు మళ్ళీఇవాళ్టిలోకొచ్చేస్తున్నారు- ఇవాళ్టిలో కొచ్చేస్తున్నారు.... ఇవాళ్టిలో కొచ్చేస్తున్నారు" అన్నాడు సింహాద్రి విశ్వనాథం వంక చూస్తూ.

"ఇవాళ్టిలోకా?" అరచాడు విశ్వనాథం.

"అవును" అన్నాడు సింహాద్రి.

"ఏమిటి ఇవాళ్టిలోకి రావడం?"

"అంటే -అదే ఇవాళ్టిలోకి. ఇంతవరకూ నిన్నటిలో ఉన్నారు కదా?"

''ఇవాళ లేదు నిన్నాలేదు! నోర్మూసుకో! ఇప్పుడు మీ ఇద్దరినీథొక్క చీరేస్తేగాని అసలు విషయం బయట పడదు'' అంటూ వాళ్ల థొక్క చీరడానికని సరయిన ఆయుధం కోసం గదంతా వెతకసాగాడు. అతని కళ్లకి టేబుల్ మీదున్న పొడుగాటి దబ్బలం కనిపించగానే స్ప్రింగులా ఎగిరి అది చేతిలోకి తీసుకున్నాడు.

శ్రీదేవి ఆశ్చర్యపోయింది.

"అదేమిటి?అతను ఇవాళ్టిలోకిరాడేం?" సింహాద్రినడిగింది విసుపోతూ.

"ఒకోసారి అంతేనండీ! ఓ పట్టాన రాడు'' అన్నాడు సింహాద్రి.

''మరి రాపోతే ఎలా?''

''ఎలాగేముందీ? ఎన్ని రోజులయినా అక్కడే ఉండిపోతాడు"

''పాపం! పూర్ ఫెలో" జాలిపడింది శ్రీదేవి.

"ఏయ్ పిల్లా! ఎవరన్నవ్వు" శ్రీదేవి వంక కోపంగా చూస్తూ అరిచాడు విశ్వనాథం.

శ్రీదేవి మరింత ఆశ్చర్యపోయింది.

''నాతోనేనా మాట్లాడుతున్నాడు?'' సింహాద్రినడిగిందామె.

"అవును" అన్నాడు చిరంజీవి.

"అతను నిన్నటిలో ఉన్నాడు కదా! మరి నాతో ఎలా మాట్లాడుతున్నాడు?''

"నిన్నలో కూడా మీలాంటి ఓ అమ్మాయితో ఘర్షణ పడ్డాడన్న మాటండీ! అందుకని మిమ్మల్నలా అంటున్నాడు" చెప్పాడు చిరంజీవి.

''పాపం! పూర్ ఫెలో!" మళ్లీ జాలి పడింది శ్రీదేవి.

"ఇదిగో ఇంకోసారి పూర్ ఫెలో గిర్ ఫెలో అన్నావంటే మక్కెలిరగ్గొడతాను" కోపం అణచుకుంటూ అరచాడు విశ్వనాథం.

''వెరీబాడ్ లాంగ్వేజ్" శ్రీదేవి.

"అవునండీ! భాష చాలా మెరుగు పర్చుకోవాల్సుంది అతను! పదిహేను రోజుల్లో తెలుగు అనే పుస్తకం కొంటే సరిపోతుంది'' తన అభిప్రాయం చెప్పాడు చిరంజీవి.

''ఇంతకూ ఇప్పుడితనిని బయటకు పంపటం ఎలా?'' అడిగింది శ్రీదేవి.

''అదే.... అదే.... నాకూ తెలీటం లేదు" అన్నాడు సింహాద్రి.

''దాన్దేముందీ- బలవంతంగా గెంటెయ్యడమే'' అన్నాడు చిరంజీవి.

''అమ్మో! బలవంతంగానా!" భయంగా అంది శ్రీదేవి.

''అవును"

''అతను గొడవచేయడూ?"

''మరతను ఇవాళ్టిలోకి రాకపోతే మనమేం చేస్తాం" అన్నాడు సింహాద్రి చిరంజీవిని సమర్థిస్తూ.

విశ్వనాథం ఇంక పట్టలేకపోయాడు.

"ఏంట్రా! నన్ను బయటకు గెంటుతారా?" మండిపడుతూ అరిచాడు.

"అవును" అన్నాడు సింహాద్రి.

"మీ అంతట మీరు వెళ్ళకపోతేనే లెండి! వెళ్ళిపోతే ఆ అవసరం ఉండదు" అన్నాడు చిరంజీవి.

"ఎగ్జాక్ట్‌లీ" వప్పుకున్నాడు సింహాద్రి.

"ఒరేయ్ సింహాద్రీ! నీ పులుసు పిండేస్తాను చూడిప్పుడు" అంటూ చేతిలోని దబ్బలం పైకెత్తి పట్టుకున్నాడు విశ్వనాథం ఉక్రోషంగా.

"అరె! మీ పేరు ధనుంజయ్ అయితే సింహాద్రి అంటాడేమిటి?" ఆశ్చర్యంగా అడిగింది శ్రీదేవి.

"అదా అదీ...అది....అదె..అవ్నా చిరంజీవి! సింహాద్రి అంటాడేమిటి?" ఆశ్చర్యం నటిస్తూ అడిగాడు సింహాద్రి.

"దటీజ్ సింపుల్" అన్నాడు చిరంజీవి.

"ఏమిటి సింపుల్"

"అదే! నీ పేరు. అందులో పెద్ద ఇదేముంది! అతని మేనల్లుడి పేరు సింహాద్రే అయ్యుంటుంది. అందుకని అతనితో మాట్లాడుతున్నట్లే నీతో మాట్లాడుతున్నాడు"

"అంటే ఈ గొడవంతా నిన్న అతనికీ, అతనిమేనల్లుడికీ మధ్య జరిగిందన్నమాట" అంది శ్రీదేవి.

"అంతేకాదు! అతని మేనల్లుడి ఫ్రెండ్‌కీ, మిమ్మల్నిపోలిన ఓ అమ్మాయికి కూడా అతనితో పేచీ పడిందన్నమాట!" వివరించాడు చిరంజీవి.

"ఇలా అందరితోనూ పేచీపడ్డాడంటే పట్టి పేచీకోరు మనిషి లాగున్నాడు" అందామె.

"పట్టి ఏమిటి ? మహా పేచీకోరన్న మాట!"

ఈ పరిస్థితి సహించడం ఇంక విశ్వనాథంవల్ల కాలేదు. వీళ్ళిద్దరి నాటకంవల్లే భావయ్య ఆస్తిలో బోలెడు భాగం కొట్టెయ్యవచ్చన్న తన ప్లానంతా సర్వనాశనం అయిపోయింది. పోనీ ఈ సింహాద్రిగాడు స్పష్టంగా భావయ్యతో- "నీ కూతురిని పెళ్ళిచేసుకోవడం నాకు ఇష్టంలేదు" అంటే భావయ్య ఇంతగా అగ్గి అయ్యేవాడు కాడు. అలాకాకుండా పిచ్చిఎక్కినట్లు ప్రవర్తించడంవల్ల వాడికి నిజంగా పిచ్చి వుందని నమ్మాడతను. అంతేకాదు అలాంటి పిచ్చివాడిని తన కూతురికి అంటగట్టబోయినందుగ్గాను తను అతనికివ్వాల్సిన యాభయివేలూ అర్జంటుగా అప్పటికప్పుడు కక్కమని వార్నింగిచ్చాడు. అంచేత తనకింత అపారనష్టం కలిగించిన వీళ్ళిద్దరినీ ఇలా తిట్లతో వదుల్తే లాభంలేదు. మరోసారి ఇలాంటి వేషాలు వేయకుండా చేసేయాలి.

ఇలా నిర్ణయించుకుని దబ్బలంతోవారి మీదకు ఎగిరి దూకాడతను. అతని వాలకం చూసి సింహాద్రి మరుక్షణం గదిమూలను గెంతి రన్నింగ్ రేస్‌లో పరుగెత్తబోతున్న వాడిలా పొజిషన్ తీసుకుని నిలబడ్డాడు.

అది చూసి చిరంజీవికూడా నాలుగు అడుగులు వెనక్కువేసి తలుపు దగ్గరకు చేరుకున్నాడు.

మరుక్షణంలో రన్నింగ్ రేస్ ప్రారంభమయిపోయింది.

ముందు సింహాద్రీ, అతని వెనుక దబ్బలంతో విశ్వనాథం, అతనివెనుక చిరంజీవి గదిచుట్టూ గంటకు ముప్పయ్ కిలోమీటర్ల వేగంతో పరుగెత్తసాగారు.




శ్రీదేవి ఇంతకుముందు కొన్ని పరుగు పందాలు చూసివుంది. అసలు తనే కాలేజ్ తరఫున 400 మీటర్స్ రన్నింగ్ రేస్‌లో పరుగెత్తింది కూడానూ. అయితే ఇంత థ్రిల్లింగ్‌గా ఏ పందెంకూడా కనిపించ లేదు. అదీ గాకుండా ఫిఫ్నాటిజంలో ఇంతగొప్ప గేమ్స్, స్పోర్ట్స్‌కూడా ఉంటా యన్న విషయం ఆమెకు తెలీదు.

సింహాద్రి, చిరంజీవి కొద్దిరౌండ్లు బాగానే కొట్టారు అయితే విశ్వనాథం స్పీడ్ పెరుగుతున్నకొద్దీ వారికి ఆ గది చాలా ఇరుగ్గా కనిపించసాగింది. దానికి తోడు మధ్యలో హార్డిల్స్‌లాగా మంచం ఒకటీ, చిరంజీవి పక్కచుట్ట ఒకటీ, సింహాద్రి సూట్‌కేస్ ఒకటీ - వీటన్నిటి మీదనుంచి టైమ్ లిమిట్‌లేకుండా జంప్ చేయడం చాలా రిస్కీగా కనిపించింది.

అయితే పరిస్థితి ఇంతదూరం వచ్చాక చేయగలిగిందేమీ కనిపించలేదు. శ్రీదేవి తప్పట్లుకొడుతూ, ఆనందంతో కేరింతలు కొడుతూ విశ్వనాథం చేతిలోని డబ్బలం సింహాద్రి వీపుకి ఎంతదూరంలో ఉన్నదీ రన్నింగ్ కామెంటరీ ఇస్తోంది.

"రెండడుగులు...అమ్మో ఒక్క అడుగు. ధనుంజయ్‌గారూ పరుగెత్తండి! పరుగెత్తండి-పెద్ద స్టెప్స్ వేయండి. ఓకే... ఇప్పుడు దబ్బలం మూడడుగుల దూరంలో ఉంది..."

ఇలా ఈ పరుగు పందెం కామెంటరీ ఎంతసేపు గడిచేదోగాని ఈలోగా తలుపులు దభీమని తోసుకుని సింహాద్రి పేట్రనైజ్ చేసిన వీధి కుక్క మళ్ళీ ఆ రోజు తాలూకు బిస్కెట్ల కోటాకోసం గదిలో జొరబడింది. అదింతకుముందు ఆకలి ఆపుకోలేక చాలా ఇళ్ళల్లో దొంగ తనంగా జొరబడడం, వంటిళ్ళల్లో కెళ్ళి కనబడ్డదల్లా తినేయడం చేసింది. అయితే ఏ ఇంట్లో జొరబడ్డా ఆ ఇంటి తాలూకు వాళ్ళు పెరట్లో ఎవరితోనో మాట్లాడుతూ ఉండడంగానీ, లేదా అందరూ కలిసి హాల్లో కూర్చుని సినిమాల గురించి వర్ణించుకోడంగానీ, లేదా ఇంకేదయినా వ్యవహారం మాట్లాడుకోడంగానీ చూసేది. కానీ ఎవ్వరూ ఇలా తలుపులు దగ్గర కేసుకుని ఇంట్లో రన్నింగ్ రేస్‌లు ప్రాక్టీస్ చేస్తూ కనిపించలేదు. స్వతహాగా దానికి ఆటలంటే ఎంతో ఇష్టం! చిన్నప్పుడు ఏ రోజూ కూడా గంటకు యాభయ్ కిలో మీటర్ల స్పీడుకి తక్కువ పరుగెత్తేదికాదు. ఎవరయినా కర్రలతోగానీ, ఇంకే రకంగా గానీ వెంబడిపడితే స్పీడ్ మరింత ఎక్కువుండేది. రాన్రాను ఇప్పుడు అంతగా పరుగెత్తే అవసరమే కనిపించడంలేదు. ఏదయినా దొంగపని చేసినప్పుడు పట్టు బడినా ఎవరూ తన వెంట పడడంలేదు. తను ఆ ఇంటి కాంపౌండ్ దాటగానే ఊరు కుంటున్నారు. ఒకరిద్దరు ఛేజింగ్ మీద ఆసక్తి ఉన్నవాళ్ళు వెంబడించినా - తను వెనక్కి తిరిగి 'గుర్'మంటూ పళ్ళు బయటపెట్టేసరికి వెనక్కి తిరిగి అదే వేగంతో పారిపోతున్నారు. ఇంతకాలానికి ఇప్పుడు ఆ రూమ్‌లో సాగుతోన్న రన్నింగ్‌రేస్ దానికి దాని చిన్నతనపు రోజుల్ని గుర్తుకు తెచ్చింది. తనూ ఆ రేస్‌లో జాయినయి, ఆ ఆనందాన్ని పంచుకోవాలనిపించి విశ్వనాథం వెనుకే అదే స్పీడ్‌లో పరుగెత్తటం ప్రారంభిం చింది. అయితే అలా ఒకరి వెనుక ఒకరు పరుగెత్తటంలో దానికి థ్రిల్ కనిపించ లేదు. అదీగాకుండా రాన్రాను విశ్వనాథం స్పీడ్ గంటకు పది కిలోమీటర్లకు పడి పోయింది. అంత తక్కువ స్పీడ్‌లో

పరుగెత్తటం తనను చిన్నతనంగా భావించి అది అందరినీ ఓవర్ టేక్ చేస్తూ రన్నింగ్ ప్రారంభించింది. వాళ్ళందరూ కలసి ఒక రౌండ్ కొట్టేసరికి అది నాలుగు రౌండ్లు పూర్తిచేయగలుగుతోంది. విశ్వనాథం మొదటిసారి ఆ కుక్క తనను ఓవర్ టేక్ చేయడం చూశాడుగానీ అది కేవలం తన భ్రమ అని మనస్ఫూర్తిగా నమ్మాడు. కానీ రెండోసారి ఓవర్ టేక్ చేసినప్పుడు మాత్రం అనుమానం కలిగింది. అనుమానం నిర్ధారణ అయేసరికి అది మరో పది రౌండ్లు కొట్టేసింది. దాంతో విశ్వనాథం పైప్రాణం పైనే ఎగిరిపోయింది.

అది కిందటిసారి తనను కరచిన కుక్కే! ఏమాత్రం సందేహం లేదు. తను అన్ని కుక్కలనూ గుర్తుపెట్టుకోలేక పోవచ్చుగానీ, తనను కరిచినవాటిని మాత్రం మహాజాగ్రత్తగా గుర్తుపెట్టుకోగలడు. వాటిని ఎన్ని సంవత్సరాల



తర్వాత చూసినా, ఎన్నవేల కుక్కల్లో ఉన్నా శకీమని గుర్తుపట్టేస్తాడు.

దానిని గుర్తించగానే అతనికి అంతకు ముందు తనను అదేరూమ్‌లో కరచిన క్రూర జంతువు అన్నసంగతీ, ఆ కుక్కకాటు తాలూకు పద్నాలుగు ఇంజెక్షన్లు ఇంకా పూర్తికాలేదన్న విషయమూ కూడా గుర్తుకొచ్చాయ్. ఇప్పుడు తను అర్జంటుగా ఆ కుక్క బారినుండి తనను తను రక్షించుకోకపోతే మరో పద్నాలుగు ఇంజెక్షన్లు ప్రారంభించాల్సి రావచ్చు. అప్పటికప్పుడే బయటకు ఎలా పారిపోవాలా అని ఆలోచన ప్రారంభించాడతను. హఠాత్తుగా తలుపులో నుంచి బయటకు పారిపోతే దానికి కోపం వచ్చి వెంబడిపడి కరచే ప్రమాదం ఉంది.

అందుకని స్లోఅయిపోయి, ఏదో పని మీద గది బయటకెళ్తున్నట్లు నడిచి వెళ్ళిపోవాలి.

కుక్కల సంగతి తనకు బాగా తెలుసు. పరుగెడితే కోపం ఎక్కువ వాటికి!

పరిగెడుతూనే "దొంగవెధవల్లారా! ఆ కుక్క మీది కాదన్నారు కదూ?" అన్నాడు విశ్వనాథం ఒగరుస్తూ.

"మాది కాదు" అన్నాడు సింహాద్రి కూడా ఒగరుస్తూనే.

"మరిప్పుడెందుకొచ్చింది మళ్ళీఅది?"

"అది దాని రొటీన్ ప్రోగ్రాం — అంతే!"

"అవును! అందరిళ్ళకూ వెళ్ళి పలుకరింపుగా కనబడి పోతూంటుంది!"

"అబద్ధం" అరచాడు విశ్వనాథం ఆగకుండానే.

"కాదు, నిజం" అన్నాడు సింహాద్రి.

"నేను నమ్మను"

"ఏం ఫరవాలేదు"

"నన్ను మళ్ళీ కరిపించాలనే దాన్ని పిలిచారిప్పుడు" అన్నాడు విశ్వనాథం కొంచెం స్లోగా పరిగెడుతూ.

"నెవర్" అన్నాడు చిరంజీవి. "అలాంటి ఆలోచనేలేదు! పైపెచ్చు అది మాదికాదు"

"మీది కాపోతే ఎందుకొచ్చింది ఇప్పుడు?"

"చెప్పాం కదా! దాని హాబీ-అంతే!"

"అయితే ముందు దాన్ని బయటకు గెంటండి!"

"ఎందుకు?"

"లేపోతే మళ్ళీ కరుస్తుంది నన్ను"

"ఏమాత్రం కరవదు"

"నీకెలా తెలుసు?"

"కుక్కలూ- వాటి మనస్తత్వాలూ పుస్తకంలో చదివాను"

"ఏమని?"

"ఎవరయినా సరే వాటిని ఏదో రకంగా ఇన్సల్ట్ చేస్తేనే తప్ప అవి కరవవు అని!"

"మరిమొన్న నేనేం ఇన్సల్ట్ చేశానని నన్ను కరచింది?" ఇంకొంచెం నెమ్మదిగా పరిగెడుతూ అడిగాడతను.

"అదే మనకు తెలీదన్నమాట! అది కనుక్కోవాలంటే 'కుక్కలూ - అసంకల్పిత ప్రతీకారచర్యలూ' అని ఇంకో పుస్తకం ఉంది. అది చదవాలి"

"ఆ పుస్తకాలన్నీ హంబక్" అన్నాడు విశ్వనాథం.

"అందుకే మిమ్మల్ని కరచిందది" అన్నాడు చిరంజీవి.

"ఇప్పుడు దాన్ని ఎవరయినా పట్టుకుంటే నేను బయటకు పరుగెడతాను" రాజీకొస్తూ అన్నాడతను.

"దానిని పట్టుకోవడం ఎందుకు?"





అడిగాడు సింహాద్రి ఆశగా.

"లేకపోతే తప్పకుండా కరుస్తుంది నన్ను! ఇప్పటికింకా కిందటిసారి కరచిన కాటు తాలూకు పధ్నాలుగు ఇంజెక్షన్లు పూర్తి కానేలేదు"

"పధ్నాలుగు అనవసరం. ఎనిమిది చాలు"

"డాక్టరు పధ్నాలుగు చేయించుకో మన్నాడుగా?"

"అది పిచ్చికుక్కలకయితే"

"మరి ఇది మంచికుక్క అన్న గారంటీ ఏమిటి?"

"దాని చూపులు. అది మనవంక చూస్తున్నప్పుడు...." చిరంజీవి ఇంకేం చెప్పేవాడోగాని సింహాద్రి ఆ కుక్కను ఆపి దాని మెడపట్టుకోవడం-అదే అద సనుకుని విశ్వనాథం గదిలోనుంచి బులెట్ లాగా బయటకు దూసుకుపోవడం క్షణంలో జరిగిపోయింది.

"అబ్బ! ఇంకా ఇదంతా కలలాగానే ఉంది" అంది శ్రీదేవి ఆశ్చర్యం నుంచి తేరుకుంటూ.

"హిప్నాటిజం అంటే ఇంతేనండీ! కలలాగానే ఉంటుంది" అన్నాడు సింహాద్రి.

"అతను ఆ దబ్బలంతో మిమ్మల్ని పొడిచేస్తాడేమోనని భలే భయం వేసింది నాకు" అందామె.

"ఏస్తాడు. అందుకే గదా సింహాద్రి ఈ కుక్కను హిప్నటైజ్ చేసి లోపలకు పిలిపించాడు" అన్నాడు చిరంజీవి.

"ఏమిటి? ఈ కుక్కను హిప్న టైజ్ చేశారా!" ఆశ్చర్యంగా అడిగిం దామె.

"అవును! తప్పలేదుమరి" అన్నాడు సింహాద్రి.

"అంటే జంతువుల్ని కూడా హిప్న టైజ్ చేయవచ్చా?" అడిగిందామె.

"ఓ! ప్రాణం ఉన్న వాటన్నిటినీ చేయ వచ్చు! ఆఖరికి చెట్లను కూడా చేయవచ్చు. అయితే ఆకోర్సు నేనింకా కంప్లీట్ చేయ లేదు"

"ఒండర్‌ఫుల్" అందామె.

"అఫ్‌కోర్స్"

తేలిగ్గా అన్నాడు సింహాద్రి.

శ్రీదేవి టైమ్ చూసుకుంది.

"థాంక్యూ ధనుంజయ్‌గారూ! మిమ్మల్ని కలుసుకున్నందుకు చాలా సంతోషంగా ఉంది. మరి నే వెళ్తానిక-మా డాడీ హోటల్లో ఎదురు చూస్తుంటారు" అంది లేచి నిలబడుతూ.

సింహాద్రి మొఖంలో జీవకళ నశించి పోయింది.

"ఆ...వెళ్ళిపోతారా! మీతో బోలెడు విషయాలు మాట్లాడాలనుకున్నానండీ" దిగులుగా అన్నాడతను.

"మరోసారి మాట్లాడుకోవచ్చులెండి! ఆ...చెప్పడం మర్చిపోయాను. వచ్చే ఆదివారం నా బర్త్‌డే! మీరిద్దరూ తప్ప కుండా విశాఖపట్నం రావాలి" అందామె ఉత్సాహంగా.

"విశాఖపట్నమా?"

"అవునండీ! కష్టమేముంది? రాత్రి రైలెక్కితే పొద్దునకల్లా దిగుతారు. అక్కడ రెండు రోజులు మా ఇంట్లోనే గెస్ట్సుగా ఉండాలి. ఓకే?"

"ఓకే" అన్నాడు సింహాద్రి ఆనం దంగా.

"రేపే మీకు ఇన్విటేషన్ పోస్ట్ చేస్తాను. ఒకవేళ అది అందకపోయినా ఇదే ఇన్విటేషన్ అనుకుని వచ్చేయండి"

"ఓ...తప్పకుండా వస్తామండీ"

"మర్చిపోరు కదూ?"

"మీరు మర్చిపోకుండా ఉండాలి- మాదేముంది. ఇహిహి" అన్నాడు సింహాద్రి.

"మరి మా అడ్రస్ తెలుసా మీకు?"

"తెలుసండీ! బాంబ్ నిలయం, రెడ్ బాంబ్, విశాఖపట్నం. కరెక్టేకదండీ?"

"రెడ్‌బాంబ్ కాదు. రెడ్ ఫీల్డ్"

"అవునూ బాంబు మీ ఇంట్లో ఉందా అండీ? చుట్టుపక్కలుందా?"

"బాంబేమిటి?"

"ఆదేనండీ - బాంబ్ నిలయం అంటే అర్థం బాంబులుండే ప్రదేశంఅని కదా"

"అదా" ఆమె నవ్వేసింది. "బాంబులు మా ఇంట్లోనూ లేవు... ఇంటి బయటా లేవు"

"మరా పేరెందుకు పెట్టినట్లు?"

"మాడాడీ ఆర్మీలో కల్నల్. సర్వీస్‌లో ఉండగా ఆయన ఎన్నో బాంబులు పేల్చారు. ఎంతోమంది ఎనిమీస్‌ని బాంబులతో ఆనవాల్లేకుండా ఎగరగొట్టేశారు. అందుకని బాంబ్‌లమీద ఇష్టంకొద్దీ బాంబ్‌నిలయం అని పేరుపెట్టారు"

సింహాద్రికి భయమేసింది.

"ఇప్పుడుకూడా ఎవర్నయినా బాంబ్‌లతో పేలుస్తున్నారాండీ?" డౌటుగా అడిగాడు.

"అబ్బే.ఇప్పుడసలు బాంబ్‌లు వాడడం లేదు. రివాల్వరూ, పిస్టలూ, గన్నూ- ఇవన్నీ ఉన్నాయిగా. ఒకరిద్దర్నయితే వాటితో కాల్చటమే ఎకనామికల్ అంటారు డాడీ. కనీసం పాతిక, యాభై మందయినా లేకపోతే బాంబులు వాడడం చాలా ఖర్చుతో కూడినపనట"

"అలాగాండీ...." దిగులుగా అన్నాడతను.

"మీరు విశాఖపట్నంలో దిగి బాంబ్ నిలయంఅంటే ఎవర్నడిగినా చెప్తారు. అంత ఫేమస్ మా డాడీ. ఇల్లు కనుక్కోవడం వెరీ ఈజీ!"

"వస్తానండీ"

ఆమె వెళ్ళిపోయింది.

"హమ్మయ్య! అంతా అనుకున్నట్లుగానే సుఖంగా గడిచిపోయింది" అన్నాడు చిరంజీవి పరిస్థితిని సమీక్షిస్తూ.

"ఒకటితప్ప" అన్నాడు సింహాద్రి దిగులుగా.

"ఏమిటది?"

"మావయ్య ఎపిసోడ్"

"ఓస్....అదా? అలాంటివి చాలా మైనర్ విషయాలు- మనంచేసిన గొప్ప కార్యక్రమాల్తో పోలుస్తే"

"దానివల్ల ఏ గొడవా రాదంటావ్!"

"ఒక్క అంగుళంకూడా రాదు"

"మామయ్య నా ఆస్తిని ఏ అనాథశరణాలయానికో ఇచ్చెయ్యడంటావ్?"

"వాళ్ళ మావయ్యవల్ల కూడా కాదు"

సింహాద్రికి సంతృప్తి కలిగింది. అయినా మరో ప్రశ్న వేయాలనిపించింది.

"నువ్వు ఆ లాయరు ఇంటిపక్కన ఎన్నిరోజులున్నావ్?"

"నూట ఆర్రోజులు. రాత్రింబగళ్లు వున్నాను"

"అయితే ఇప్పుడు మన ప్రోగ్రాం ఏమిటి?"

"ఏముంది. ఆదివారం పొద్దునకల్లా మనం విశాఖపట్నం బాంబ్ నిలయంలో ఉంటాం! శ్రీదేవి బర్త్‌డేపార్టీలోపాల్గొంటాం. మాంఛి ఏకాంత సమయం చూసుకొని నువ్వు శ్రీదేవితో నీ ప్రేమను వెల్లడిస్తావ్. ఆమె 'ఓకే' అంటుంది"

సింహాద్రి ఆనందంతో పొంగి

 

పోయాడు.

"నిజంగా 'ఓకే' అంటుందంటావా?"

"వట్టి ఆంధ్రప్రదేశ్ పౌరుడిలా గున్నావే" విసుక్కున్నాడు చిరంజీవి.

ఆ వారంరోజులూ సింహాద్రికి నిద్ర పట్టలేదు. ఎప్పుడయినా నిద్రపడితే ఆదివారం వచ్చేసినట్లూ, తనింకా హైద్రాబాద్‌లోనే వుండిపోయినట్లూ, శ్రీదేవి తన కోసం ఎదురుచూసి రామేశ్వర్ జఠానీ అనేవాడిని పెళ్ళిచేసుకున్నట్లుకల-వెంటనే కెవ్వున అరచిలేచి కూర్చోవడం మామూలయిపోయింది.

అసలు శ్రీదేవి పెళ్ళి చేసుకున్న ఆ రామేశ్వర్ జఠానీ ఎవడో ఎంత ఆలోచించినా అర్థం కావటం లేదు.

"అసలు ఆ పేరు కూడా విన్లేదింత వరకూ. వాడెవడయి ఉంటాడంటావ్?" చిరంజీవినడిగాడతను.

"వాడివల్ల మానవజాతి చాలా నష్టపోయిందని ఎప్పుడో ఎక్కడో చదివుంటావ్" అన్నాడు చిరంజీవి.

సింహాద్రి తను చదివిన పుస్తకాలన్నీ తిరగేశాడు-అయిదు నిమిషాల్లో! కాని ఆ పేరు ఎక్కడా కనిపించలేదు.




ఆదివారం ఉదయానికల్లా శ్రీదేవి బర్త్‌డే కోసమని కుట్టించుకున్న సింహాద్రి ఖరీదయిన సూటుతో వైజాగ్‌లో దిగారిద్దరూ.

టాక్సీవాడు 'బాంబ్ నిలయం' అనగానే మీటర్ మీద పది రూపాయలు ఎక్కువ ఇమ్మన్నాడు.

"అదేమిటి ? అంతెందుకు?" ఆశ్చర్యంగా అడిగాడు సింహాద్రి.

"బాంబ్ నిలయం కెళ్ళాలంటే రిస్క్ సార్ ! ఎవరయినా ఇంతే ఛార్జ్ చేస్తారు"

"ఏమిటి రిస్క్?"

"ఫలానా అని చెప్పలేమండీ ! కాని రిస్కండీ!"

సింహాద్రీ, చిరంజీవీ మొఖాలు చూసుకున్నారు.

"ఏమిటి రిస్కంటాడు వాడు?"

"అదే నేనూ తీవ్రంగా ఆలోచిస్తున్నాను" అన్నాడు చిరంజీవి.

"మరిప్పుడేం చేద్దామంటావ్?" అడిగాడు సింహాద్రి వణుకు కనపడనీయకుండా.

"వాడికింకో పది ఇస్తే వాడే చెబుతాడ్లే" అన్నాడు చిరంజీవి. ఇద్దరూ టాక్సీ ఎక్కారు.

కాస్త దూరంవెళ్ళాక చిరజీవినిసంగతి కనుక్కోమని మోచేత్తో పొడిచాడు సింహాద్రి.

"ఆ! చూడవోయ్ డ్రైవరూ...ఇదిగో సిగరెట్ కాలుస్తావా?"

"ఏం సిగిరెట్టండీ అది ? ఇండియా దేనా?"

"అవును-కాస్ట్లీ సిగరెట్టేలే"

"నేను ఫారిన్ సిగరెట్లే కాలుస్తానండీ! ఇండియావి క్లీనర్ కుర్రాళ్ళు కాలుస్తారు"

"ఓ-ఐసీ" అన్నాడు చిరంజీవి. "గుడ్.. వెరీగుడ్" అనికూడా అన్నాడు.

"పోనీ ఇవి మీ క్లీనర్ కుర్రాళ్ళ

కిస్తారా?"

"అక్కడ పడెయ్యండి - ఇస్తాను" అంటూ ఫారిన్ సిగరెట్ వెలిగించాడతను.

ఇక సిగరెట్లతో మంచి చేసుకోవడం సాధ్యం కాదని సంభాషణ మళ్ళీ డబ్బు మీదకు మళ్ళించాడతను.

"వెధవ పెట్రోలు ధరలు తెగ పెరిగి పోతున్నాయ్! పాపం మీకు చాలా ఖర్చవుతుందనుకుంటాను"

డ్రైవర్ మొఖం వెలిగిపోయింది.

"అవున్సార్! అందుకే మీటర్ మీద పది ఎక్కువడుగుతాం. ఆ మాత్రానికే కొంపలు మునిగిపోయినట్లు గొడవచేస్తారు జనం" కోపంగా అన్నాడతను.

"మేము అలాంటి వాళ్ళం కాదు! అందుకే నీకు పది ఎక్కువివ్వడానికి ఒప్పుకున్నాం" అన్నాడు చిరంజీవి.

"ఈ పది అందుక్కాదండీ నేనడిగింది"

"మరి?"

"ఇది రిస్క్ కోసమని అడిగాను"

"ఏమి రిస్క్?"

"బాంబ్ నిలయానికెళ్ళే టాక్సీలు, ఆటోలవాళ్ళందరూ - ఇలా రిస్క్ ఎలవెన్స్ అడగాలని మేమంతా నిర్ణయించుకున్నామండీ!"

"ఏమిటక్కడ రిస్క్ ?"

"ఒకటని కాదు సార్ చాలా పేచీలున్నాయ్"

"సరే-నీకు రిస్క్ ఎలవెన్స్ పది రూపాయలు కాక పెట్రోల్‌కి మరో పది ఇస్తాంలే. సంగతేమిటో చెప్పు" అన్నాడు సింహాద్రి ఆత్రుతగా.

డ్రైవర్ ఉత్సాహంగా వెనక్కు తిరిగి వాళ్ళిద్దరి మొఖాలవంకే చూశాడు.

"మరేం లేదండీ! అందులో ఆర్మీ ఆఫీసరున్నాడండీ! ఆయన మహా డేంజరస్ మనిషి. వాళ్ళింటి దగ్గర ఓసారి హారన్ మోగించాడని మా అప్పలస్వామి టాక్సీ టైర్ గన్‌తో కాల్చేశాడండీ! మరోసారి ఓ ఆటోరిక్షా డ్రైవర్ మీటర్ మీద రెండ్రూపాయలు ఎక్కువిమ్మని పేచీ పెట్టుకుంటే ఆ డ్రైవర్ కాలిమీద ఎయిర్ గన్‌తో కాల్చాడండీ! మాకు తెలిసినంత వరకూ ఇప్పటికి ఆయన దగ్గర ఎనిమిది రకాల కాల్పుల ఆయుధాలున్నాయండీ! మరి అసలెన్ని రకాలున్నాయో ఎవరికీ తెలీదు"

కథ పూర్తయేసరికి సింహాద్రికి చెమటలు పట్టేసినయ్.

టాక్సీ బాంబ్ నిలయానికి రెండొందల గజాల దూరంలో ఆపేశాడు డ్రైవరు.

"ఇక్కడినుండి నడిచివెళ్ళండి సార్! ఇంకా దగ్గరకు పోనీయడం కుదరదు"

"అదేమిటి? రిస్క్ ఎలవెన్స్ ఇచ్చాం కదా?"

"అది ఈ వీధిలోకి రావడానికి సార్!"

"మరి ఇంటిదగ్గరికెళ్ళడానికి?"

"దానికి టైర్ ఖర్చులు ఇప్పించాలి సార్"

సింహాద్రి, చిరంజీవి టాక్సీ దిగి కాలి నడకనే ఇంటివేపు బయల్దేరారు.

"విష్‌యూ సేఫ్ రిటర్న్ సార్!" జాలిగా అన్నాడు టాక్సీ డ్రైవర్.

బాంబ్ నిలయం నిజంగా బాంబ్ షేప్‌లోనే ఉన్నట్లు కనిపించసాగింది సింహాద్రికి.

"అదేమిట్రా! తలుపులు మూసి ఉన్నాయేమిటి?"

"గాపోస్ట్లు ఇళ్ళెప్పుడూ అంతేరా!




మూసె ఉంటయ్"

"మరి తలుపు కొడదామా?"

"ఛట్! తలుపులు కొట్టకూడదురా పక్షీ! ఎక్కడో కాలింగ్ బెల్ ఉంటుంది. నొక్కాలి. తలుపు కొట్టావంటే మనం జనతాక్లాస్ పక్షులమని తెలిసిపోతుంది"

"మరి కాలింగ్ బెల్ ఎక్కడున్నట్లు?"

"అది కనుక్కోవడమే కొంచెం కష్టం! ఎక్కడో గోడ కలర్‌లోనే మాచింగ్ అయిపోయి దాక్కునుంటుంది"

సింహాద్రి గోడంతా చేత్తో తడమ సాగాడు.

అలా గోడ చివరికెళ్ళాక పక్కకు ఓ పెద్ద గార్డెన్ కనిపించిందతనికి. అటు వేపున్న గోడకి మాంచి మీట ఆకుపచ్చ రంగులో కనబడుతోంది.

"అదిగోరా! అక్కడుంది" అన్నాడు సింహాద్రి.

"నేను చెప్పలే! ఎక్కడో చోట ఉంటుంది మొత్తానికి" అన్నాడు చిరంజీవి విజయగర్వంతో.

"కానీ తలుప్పక్కనే ఉంచకుండా ఈ పక్కన గార్డెన్ దగ్గర ఉంచారేమిటి?" అనుమానంగా అడిగాడు సింహాద్రి.

"ఈ ఆర్మీ వాళ్ళంతే రా బాబూ! శత్రువులకు దొరగ్గూడదని ఇలాంటి పనులు చాలా చేస్తుంటారు"

సింహాద్రి ఆ బటన్ గట్టిగా నొక్కాడు.

మరుక్షణం ఆ పక్కనే ఉన్న పెద్ద జయింట్ సైజ్ పంజరం తలుపు సర్రున పక్కకు తొలగిపోవడం, అందులోని రకరకాల చిలకలు, పక్షులు ఝూమ్మని కేరింతలు కొడుతూ ఎగిరిపోవడం...ఒకి క్షావుక్షణంలో జరిగిపోయింది.

సింహాద్రి ఖంగారుపడిపోయాడు.

"కొంప మునిగింది" అన్నాడు అదిరి పోతూ.

"అవును" ఒప్పుకున్నాడు చిరంజీవి.

"అంటే ఇది డోర్ బెల్ కాదన్న మాట"

"కాదనే తెలుస్తోంది"

"ఒకవేళ ఆ చిలుకల పంజరం తలుపుకి సంబంధించిన మీటేమో"

"పాజిబుల్!"

"ఇప్పుడేమిటి చెయ్యడం మరి"

చిరంజీవి ఆ బటన్ మళ్ళీ నొక్కాడు. పంజరం డోర్ ఠక్కున మూసుకు పోయింది.

"సందేహం లేదు. ఇది పంజరానికి సంబంధించినదే"

"అయితే మనం ఇక్కడ నిలబడడం క్షేమం కాదనుకుంటాను"

"పద. తలాకిటి డోర్ దగ్గరకెళ్ళి తలుపు కొడదాం"

ఇద్దరూ కొంచెం స్పీడుగానే తలాకిటి తలుపు దగ్గరకు చేరుకున్నారు.

తలుపు కొట్టబోతూంటే ఠక్కున తలుపులు వాటంతట అవే తెరచు కున్నాయ్.

"హలో" అంది శ్రీదేవి చిరునవ్వుతో ఎదురుగ్గా నిలబడి.

"హలో హలో" అన్నాడు సింహాద్రి.

"హలో" అన్నాడు చిరంజీవి.

"మీరా!" అందామె.

"అవునండీ...మేమే!"

"నేనింకా మీరనుకోవడం లేదు. బెల్ ఆగకుండా మోగుతుంటే మా కుక్క అనుకున్నాను"

"కుక్కా?"

"అవును! మా అల్సేషన్ అలాగే డోర్ బెల్ ఆగకుండా నొక్కుతుంది!"

"కానీ మేము అసలు బెల్ నొక్కనే



లేదుగా?"

"నొక్కలేదా? అదేమిటి మీరు ఇంకా దానిమీదే నుంచుని ఉన్నారు"

సింహాద్రి, చిరంజీవి అదిరిపడి పక్కకు గెంతారు.

సింహాద్రి కాలుకిందే నేలమట్టానికి చిన్న మీట కనిపించింది.

"నిజమే మీరన్నది! మేమింకా మీట కోసం వెతుకుతున్నాం"

"వెతకటం ఎందుకు క్లియర్‌గా కనబడుతోంటే"

"అఫ్‌కోర్స్ అఫ్‌కోర్స్" అన్నాడు చిరంజీవి.

"లోపలకు రండి! మీరు తప్పకుండా వస్తారనే ఎక్స్‌పెక్ట్ చేస్తున్నాను"

"అలాగాండీ!"

ఇద్దరూ లోపలకు నడిచి సోఫాలో కూర్చున్నారు.

శ్రీదేవి వాళ్ళకెదురుగ్గా మరో సోఫాలో కూర్చుంది. ఆమె చేతిలో ఏదో నవల ఉంది.

"చాలా థాంక్సండీ" అందామె.

"ఎందుకండీ?" అడిగాడు సింహాద్రి.

"ఇంత శ్రమ తీసుకుని వచ్చి నందుకు"

"ఓ...అదా! ఏం ఫర్లేదండీ! మీ కోసం శ్రమ తీసుకోవడంలో అందం, ఆనందం వగైరాలున్నాయి..."

ఆమె నవ్వింది.

సింహాద్రి కూడా నవ్వాడు.

చిరంజీవీ నవ్వాడు.

"అన్నట్లు నేను పంపిన ఇన్విటేషన్ అందిందా?" అడిగిందామె.

"ఇన్విటేషనా?"

"అవును. నాలుగు రోజులయింది పోస్ట్ చేసి"

"అరె! అందలేదే!"

"అందలేదా?"

"లేదు"

"పోస్టల్‌వాళ్ళు కొట్టేసి ఉంటారు"

"అదేమిటి? వాళ్ళెందుకు కొట్టేస్తారు?"

"అలవాటు"

"అలవాటా?"

"అవును. సాధారణంగా పోస్ట్‌లోవచ్చే మాగజైన్లు కొట్టేయడం అలవాటేగా వాళ్ళకు"

"మాగజైన్లు కొట్టేస్తారా?"

"అవును. మీకు తెలీదా ఆ విషయం?"

"తెలీదు. అసలు నేను ఏ మాగజైనూ చదవనుగా!"

"అదీసంగతి! అందుకే తెలీదు"

"కానీ మాగజైన్లు కొట్టేయడం అల వాటున్నవాళ్ళు ఇన్విటేషన్ కార్డ్ ఎందుకు కొట్టేస్తారు?" అడిగాడు సింహాద్రి.

"వెరయిటీ కోసం" నవ్వుతూ అందామె.

"తమాషాగా ఉందే"

"తమాషా ఏమీ లేదు. ఇన్విటేషన్ కొత్త పద్ధతిలో వేయించారు డాడీ. దానికి మధ్యలో ఎనిమిది పేజీలుంటాయ్"

"ఓహో...ఒండర్‌ఫుల్"

"అందుకే అది కూడా ఓ కొత్త మాగజైన్ అనుకుని కొట్టేసి ఉంటారు"

"పాజిబుల్" అన్నాడు సింహాద్రి.

"ఇల్లు తేలిగ్గా కనుక్కున్నారా?" అడిగిందామె.

"ఓ! వెరీ ఈజీ! ఎవర్నడిగినా చెప్పేస్తున్నారు"

"అవును! డాడీ చాలా ఫేమస్ ఈ సిటీలో"

"టూమచ్ ఫేమస్!"

"ఐసీ"

"డాడీ ఇంట్లోలేరు. లేపోతే ఇప్పుడే పరిచయం చేసేదాన్ని"

"ఇంట్లో లేరా?" తేలిగ్గా గాలి పీల్చు కుంటూ అన్నాడు సింహాద్రి.

"లేరు"

"ఎక్కడికెళ్ళారు? ఊరు వెళ్ళారా?" ఆశగా అడిగాడు.

"అబ్బే ఊరికి కాదు! వేటకెళ్ళారు!"

"వేట ఏమిటి?"

ఆమె ఆశ్చర్యపోయింది.

"ఏమిటి? మీకు వేటంటే తెలీదా?"

"తెలీదు"

"తెలీపోవడమేమిటి? భలేవారే! జంతు వుల్ని వేటాడడానికి అడవికెళ్ళరూ?"

"ఓ...అదా! ఆ వేట తెలుసు" తల ఊపాడతను.

"కానీ సాధారణంగా మహారాజులే కదా వేటకెళ్ళేది. జానపద కథల్లో చదివాను వేట గురించి!"

"ఇప్పుడు అందరూ వేటకెళ్తారు లెండి" అందామె చిరాకుగా.

"ఇంతకూ మీ డాడీ వేటకెందుకెళ్ళా





రండీ'' అడిగాడు చిరంజీవి.

"ఇవాళ నా పుట్టిన్రోజుకదా! అందు కని నాకిష్టమయిన జింకను షూట్ చేసు కొస్తానని అడవికెళ్ళారు''

"అయితే మీకు జింక చాలా ఇష్ట మాండీ?''

''బోలెడిష్టం''

"అంటే ఆయన అప్పుడప్పుడూ ఇలా అడవికెళ్ళి వేటాడుతూంటారాండీ?'' అనుమానంగా అడిగాడు సింహాద్రి.

''అప్పుడప్పుడు ఏమిటి? చాలా ఎక్కువగానే వెళ్తూంటారు. వళ్ళు మండిం దంటే రోజూ వేటాడతారుకూడా!"

చిరంజీవి ఉలిక్కిపడ్డాడు.

"రోజూనా?''

''అవునూ! ఏం?''

''మరేంలేదండీ! ఊరికే అడిగాను'' అన్నాడతను గోడకు తగిలించిఉన్న రక రకాల ఆయుధాలు చూస్తూ.

''అవన్నీ డాడీవి'' అందామె ఉత్సాహంగా.

''అలాగా'' ఎంత ఆపటానికి ప్రయ త్నించినా అతని గొంతులో కొంచెం వణుకు కనిపించింది.

''అవును! డాడీకి 'గన్స్' అంటే ఎంతో ఇష్టం. ఏ కొత్త మోడల్ వచ్చినా కూడా కొనేస్తూంటారు"

''కానీ ఎందుకండీ అలా కొనడం అనవసరంగా"

''అది డాడీ హాబీ"

"ఓ..అలాగా. హాబీఅన్నమాట!అంటే ఫొటోగ్రఫీ, సంగీతం సేకరించడం అలాంటి హాబీ కదండీ!"

''ఎగ్జాక్ట్లీ! అంతేకాదు. అవన్నీ వారానికోసారి ప్రయోగిస్తేగాని డాడీకి మనశ్శాంతిగా ఉండదు"

''వారానికోరోజాండీ"

"అవును"

''అంటే రోజూ వేట...వారానికోరోజు గన్స్తో షూటింగు అంతేనాండీ?"

"మరీరోజూ కాదనుకోండి. ఓ రోజు అటూ ఇటుగా. కానీ వేటలో ఏ జంతువూ దొరక్కపోతే మాత్రం భలే కోపంగా ఉంటుందాయనకు. ఆ రోజంతా మనం దూరంగా ఉండకపోతే మననే కాల్చి పారే స్తారు''

''ఆ...మననా?"

"మననంటే-మరీ మనను కాదనుకోండి! ఇంకెవరినయినా! ఆ... మీరు కూర్చుని ఈ మాగజైన్స్ చూస్తూం డండి. మేడమీద రూమ్ రడీ చేయిం చేస్తాను. వంటవాడు మీకు కాఫీ తెచ్చిస్తాడు..."

''ఇప్పుడు కాఫీ అదీ మీకు శ్రమ కదూ?"

''శ్రమ నాదెలా అవుతుందండీ! వంట వాడిది. నేనీలోగా ఈ నవల చదివేస్తాను. ఇంక వంద పేజీలే ఉంది"

''ఎవరిదండీ ఆ నవల? నాదేనా?"

''అబ్బే మీదికాదండీ! ఇంకో రైటరు. ఇతను కూడా హిప్నాటిజం మీద భలే రాశాడు. వస్తానండీ. మాంచి సస్పెన్స్లో ఉన్నాను" అంటూ లోపలకు పరుగెత్తిం దామె.

"ఇల్లు బ్రహ్మాండంగా ఉందికదురా?" అడిగాడు చిరంజీవి హాలంతా కలియ జూస్తూ.

"ఆ గోడకున్న ఆయుధాలు తప్పితే మిగతాదంతా బాగానేఉంది" ఒప్పు కున్నాడు సింహాద్రి.

"ఫర్నిచర్ కూడా ఒండర్ఫుల్గా ఉంది"

"వీళ్ళ డాడీతో మనకేమీ ప్రమాదం ఉండదుకదా?" అనుమానంగా అన్నాడు సింహాద్రి.

"ఛట్. మనకేం భయంరా! నువ్వు గ్రేట్ రచయిత ధనుంజయ్‌వని తెలిసిందంటే ఆయనే నీ కాళ్ళమీద పడిపోతాడు"

"కాళ్ళమీదెందుకు పడటం?"

"అదంతేరా! ఈ మిలిటరీవాళ్ళకి లిటరేచరంటే అంత ప్రాణం. సర్వీసంతా ఈ సాహిత్యం వగైరాలకు దూరంగా ఎక్కడో బోర్డర్స్‌లో ఉంటారుకదా! అందుకని ప్రేమ మరీ ఎక్కువన్నమాట! మన శ్యాంప్రసాద్‌గాడి చిన్నాన్న అంతే గదా! రిటైరయ్యాక తన అభిమాన రచయితను కలుసుకుని పిస్టల్‌తో కాల్చిపారేశాడు"

సింహాద్రి ఉక్కిరిబిక్కిరయ్యాడు.

"కాల్చిపారేశాడా ?"

"అవును! కానీ ఆ రచయిత ప్రాణం పోలేదులే! వారంరోజుల్లో తనే బోలెడు డబ్బు ఖర్చుచేసి ఆ గాయం మానిపించేశాడు"

అయినా సింహాద్రికి సంతృప్తి కలగలేదు.

"అసలు కాల్చటం ఎందుకు?"

"చెప్పానుకదురా! అభిమానం మరీ ఎక్కువయితే వాళ్లంతే. అలా అనిపిస్తుందట! తరువాత చెప్పాడాయన"

సరిగ్గా అప్పుడే బయట సైరన్ కూసినట్లు జీపు హారన్ మోగింది. ఆ శబ్దం వినడంతోనే సింహాద్రికి వణుకు ప్రారంభమయిపోయింది.

"శ్రీదేవి...శ్రీదేవి వ్వాళ్ళ డ్డాడ్డీ వచ్చినట్లున్నాడు" అన్నాడు వణుకు కనిపించకుండా కంట్రోల్ చేస్తూ.



"అరె ...పస్తేగానీరా! ఎందుకలా అనవసరంగా వణుకుతున్నావ్?" కోప్పడ్డాడు చిరంజీవి.

"ఏమోరా ఎంత వద్దనుకున్నా తెగ భయంగా ఉంది"

"ఏం పర్లేదు నేనున్నానుకదా! అంతా నేను చూసుకుంటాను"



మరుక్షణం పెద్దగా బూట్లచప్పుడు- గుండెలమీద కొస్తున్నట్లు లోపలి కొచ్చేసింది.

మరుక్షణంలో ఆరడుగుల ఎత్తుఆకారం జంగిల్ డ్రెస్‌లో నుంచి ఇల్లెగిరిపోయేట్లు అరచింది.

"ఒరే రంగా....రంగా!"

సింహాద్రీ, చిరంజీవీ వణికిపోయారు.

నౌకరు లోపల్నుంచి పరుగెత్తుకొచ్చాడు.

కల్నల్ తన గన్ అతనికందించాడు.

"క్లీన్ చెయ్యమంటారా సార్?"

"షూట్ చేస్తాను రాస్కెల్? క్లీన్ చెయ్యాలా...ఏమిట్రా ఇడియట్! నోర్మూసుకుని క్లీన్‌చెయ్"

"అలాగే సార్"

"ఇవాళ బులెట్స్ అన్నీ వేస్టయిపోయాయి. మోస్ట్ అన్ ఎకనామికల్! ఒక్క జంతువుకూడా దొరకలేదు..."

రంగా గన్ తీసుకుని లోపలికెళ్ళిపోయాడు.

కల్నల్ మేడమీదకెళ్ళబోతూ తక్షున ఓమూల సోఫాలోకూర్చున్న సింహాద్రినీ, చిరంజీవినీ చూసి ఛటుక్కున వాళ్ళవేపు తిరిగాడు కోపంగా.

"న....న... నమస్కారమండీ" అన్నాడు సింహాద్రి.

"నమస్కారమండీ" తనూ అన్నాడు చిరంజీవి.

కల్నల్ అనుమానంగా మరో రెండు అడుగులు వాళ్ళవేపు వేశాడు. రెండ్రోజుల క్రితం పేపర్లో చదివినవార్తే అతని కళ్ళముందు కదలసాగింది.

'పెద్ద మనుషుల్లాగా - ఫుల్‌సూట్లో ఇంట్లో జొరబడి చేతికందిన సామాను తీసుకు పారిపోయిన ఘరానా దొంగల ఉదంతం' అని ఉందా పేపర్లో.

"ఎవరు మీరు?" అనుమానంగా అడిగాడు కల్నల్.

"నేను సింహాద్రిసండీ! మైనేమ్ ఈజ్ సింహాద్రి" అన్నాడు తడబడుతూ.

చిరంజీవి ఉలిక్కిపడ్డాడు.

"అబ్బే..కాదండీ!వీడిపేరు ధనుంజయ్. సింహాద్రికాదు!"

కల్నల్‌కి అనుమానం మరింత పెరిగి పోయింది.

"సింహాద్రి కాదా?"

"కాదండీ! ఏమాత్రం కాదు"

"మరెందుకు చెప్పాడలా?"

"పొరబాటున చెప్పాడండీ! జస్ట్ యాక్సిడెంటల్".

"అవునండీ" తనూ వప్పుకున్నాడు సింహాద్రి.

"పొరబాటున పేరు తప్పు చెప్పే వాళ్లను నేనెక్కడా చూడలేదు."

"అవునండీ!నేనూఎక్కడా చూళ్ళేదు" చెప్పాడు చిరంజీవి.

"దెన్?"

"అంతేనండీ! ది ఎండ్"

"వ్వాట్ ది ఎండ్?"

"ఇదేనండీ! వాడిపేరు సంగతి!"

"ఐసీ" చిరంజీవి వంక కోపంగా చూస్తూ అన్నాడతను.

"నాపేరు చిరంజీవండీ! వాడిపేరు సింహ...నోనో...సారీ! వాడిపేరు ధనుంజయ్, నా పేరు చిరంజీవి! అంతేనండీ! ఇంకేమీ మార్పులుండవ్"

"నేనడుగుతోందిమీడెవిలిష్ పేర్లుకాదు!"

"ఓహో! కాదాండీ! అవుననుకుని చెప్పామండీ" అన్నాడు సింహాద్రి.

"అవునండీ! పేర్లే అడిగారనుకుని..." సర్ది చెప్పబోయాడు చిరంజీవి.

"షటప్" గర్జించాడు కల్నల్.

ఇద్దరూ ఉలిక్కిపడ్డారు.

''ఓకే అండీ! మీరెలా చెప్తే అలా షటప్‌గానే ఉంటామండీ'' గాబరాగా అన్నాడు సింహాద్రి.

''మీరెవరూ అని నేనడుగుతున్నాను'' మళ్ళీ అన్నాడు కల్నల్.

''మేమాండీ?''

''యస్. అయామ్ టాకింగ్ ఎబౌట్ యూ ఓన్లీ''

"మేము...మేము ఒరిజినల్‌గా కాలేజ్ మేట్స్ అండీ! అంటే అంతకు ముందు కూడా తెలుసన్నమాటండీ! ఇంటర్‌లో క్లాస్‌మేట్స్‌మండీ''

''అవునండీ! ఇద్దరం 'డి' సెక్షన్ వాళ్లం?''

"డి సెక్షన్ హాకీకి బాగా ఫేమస్ అండీ!"

కల్నల్ మండిపడ్డాడు.

"టు హెల్ విత్ యువర్ ఇంటర్- అండ్ టు హెల్ విత్ యువర్ 'డి'

సెక్షన్'' అన్నాడు కోపంగా.

"'జి' సెక్షన్ కాదండీ! 'డి' సెక్షన్'' కరెక్ట్ చేశాడు చిరంజీవి.

"అవునండీ! నాట్ 'జి' సెక్షన్''

''అయ్‌సే షటప్"

"ఓ.కే. సార్!''

''నేనడిగేది అదిగాదు!"

చిరంజీవికి అర్జంటుగా స్పార్క్ వచ్చింది.

''ఓహో అర్థమయిందండీ!" ఆనందంగా అన్నాడు.

''ఏమిటది?"

''మీరడిగేదేమిటో తెలిసింది – మీరు మా ప్రొఫెషన్ అడుగుతున్నారు. నథింగ్ రాంగ్ ఇనిట్! యు ఆర్ వెల్ కమ్! ప్రొఫెషన్ తెలుసుకోవాల్సిందే. ఐ కెన్ అండర్‌స్టాండ్! వీడేమో బిజిలీ అండ్ బిజిలీ కంపెనీలో ఎకౌంటెంట్ అండీ! నేనేమో రైల్వేలో అసిస్టెంట్ స్టేషన్ మాస్టర్‌గా వర్క్ చేస్తున్నానండీ"

సింహాద్రి ఠప్పున అందుకున్నాడు....

"అయితే మొన్న జరిగిన యాక్సిడెంట్ కీ, వీడికీ ఎలాంటి సంబంధం లేదండీ! కదురా?"

''అవునండీ! అదింకా తేల్లేదు. ఇంజనీరింగ్ వాళ్ల ఫాల్ట్ అని కారేజ్ అండ్ వాగన్ డిపార్ట్‌మెంటు వాళ్ళూ, కాదు కారేజ్ అండ్ వాళ్లదే అని వాళ్లు..''

"షటప్''

ఇద్దరూ సైలెన్సయిపోయారు.

''ఇద్దరూ లేవండి ముందు''

ఇద్దరూ లేచినిలబడిపోయారు.

"ఇలా దగ్గరకు రండి''

"దగ్గరకాండీ" దిగులుగా అడిగాడు సింహాద్రి.




''అవును"

"ఎందుకులెండి ! ఇక్కడికి బాగానే వినబడుతున్నాయ్ మీ మాటలు''

"ఐసే షటప్! వస్తారా? నన్నే మీ దగ్గరకు రమ్మన్నారా?"

ఇద్దరూ కల్నల్ వేపు రెండడుగులు వేశారు.

''నేనడిగేది మీరు ఇక్కడ నాయింట్లో ఏం చేస్తున్నారూ అని?"

"కూర్చున్నామండీ!''

''జస్ట్ రిలాక్సింగ్" సర్ది చెప్పాడు సింహాద్రి.

"ఎందుకూర్చున్నారు!''

అప్పుడర్థమయింది చిరంజీవికి కల్నల్ ప్రశ్నలోని అర్థం.

"అదా–మేము మీ ఇంటికెందుకొచ్చామనా మీ అభిప్రాయం !'' అంటూ ఈజీగా కనిపించడానికని గట్టిగా నవ్వాడు చిరంజీవి ''సంగతేమిటంటే మేము శ్రీదేవిగారి బర్త్‌డే కోసం వచ్చామండీ!''

"బర్త్‌డేకా ?'' కల్నల్‌కి రాను రాను వాళ్ళమీద అనుమానం బలపడిపోతోంది.

"ఎగ్జాక్ట్‌లీ!''

"ఎవరు పిలిచారు మిమ్మల్ని?''

"శ్రీదేవి గారేనండీ!''

"ఏదీ– శ్రీదేవి పంపిన ఇన్విటేషన్ కార్డ్ చూపించండి!''

"అదా! అది పోస్ట్‌లో మిస్సయిపోయిందండీ!''

"కల్నల్ నడుముకి వేలాడుతున్న పిస్టల్ మీద చెయ్యివేశాడు.

''పోస్ట్‌లో మిస్సయిందా? నేన్నమ్మను'' అన్నాడు కఠినంగా.

''నమ్మరా?'' ఆశ్చర్యంగా అన్నాడు సింహాద్రి.

"ఛస్తే నమ్మను''

సింహాద్రి ఆశ్చర్యంగా చిరంజీవివేపు చూశాడు.

"ఏమిట్రా! నమ్మనంటున్నారు?"

"పోస్టల్‌వాళ్లు మాగజైన్లు, ఇతర పుస్తకాలు చాలావరకూ కొట్టేస్తూంటా రండీ!"

"అవునండీ! కావాలంటే, ఏ మాస పత్రిక ఎడిటర్నయినా అడగండి!"

కల్నల్ ఇంక సహించదల్చుకోలేదు. తను ఇప్పటికే చాలా ఎక్కువ మార్జిన్ ఇచ్చాడు వీళ్ళకు. ఇంత మార్జిన్ ఈమధ్య కాలంలో ఎవరికీ ఇవ్వలేదు. రంగాగాడు కాబోలు-పంజరంలో ఉన్న చిలకల్లో ఒక దానికి జ్వరం వచ్చినప్పుడు బయటకు తీస్తుంటే ఎగిరిపోయిందది. అలాంటి చిలకను వదిలేసినందుకు వాడిని కాల్చి పారేద్దామనుకున్నాడుగానీ, వాడు రెండ్రోజులు టైమడిగి, దానిని మళ్ళీ పట్టిఇవ్వడం చేత ఊరుకున్నాడు.

"గెటవుట్" అన్నాడు కల్నల్ బయటకు దారి చూపుతూ.

సింహాద్రీ, చిరంజీవీ ఆశ్చర్యంగా ఒకర్నొకరు చూసుకున్నారు.

"ఎవర్నండీ" అర్థం కాక అడిగాడు సింహాద్రి.

"ఇడియట్! ఇంకెవర్ని? మిమ్మల్నే!"

"కానీ....మమ్మల్ని బర్త్ డే కి రమ్మని..."

"షటప్!" అరచాడు కల్నల్.

"ఇదిగో ఇప్పుడు టైమెంతయిందో తెలుసా?"

"తెలీదండీ!"

"పదకొండు గంటల ఎనిమిది నిమిషాలయింది"

"ఫర్లేదండీ! మాకింకెక్కడా వేరే పనిలేదు" చెప్పాడు చిరంజీవి

కల్నల్ అదేమీ వినిపించుకోలేదు.

"మీకు సరిగ్గా రెండు నిమిషాలు టైమిస్తున్నాను. ఈ రెండు నిమిషాల్లో ఇల్లూ, కాంపౌండూ కూడా దాటి బయట పడకపోతే-ఆ తర్వాత ఈపిస్టల్ గుళ్ళకు స్ట్రెచర్ మీద వెళ్ళాల్సి వస్తుంది... ఓకే?"

"ఓకేసార్" అన్నాడు చిరంజీవి అప్పుడే తలుపు వేపు అడుగులు ప్రారంభిస్తూ.

"క్వయిట్ సింపుల్" అన్నాడు సింహాద్రి అతన్ని ఫాలో అవుతూ.

సరిగ్గా అప్పుడే శ్రీదేవి నవల పట్టుకుని పరుగుతో వచ్చిందక్కడికి.

"హల్లో డాడీ!" అంది కల్నల్‌ని చూసి ఆప్యాయంగా.

"హల్లో బేబీ!" కోపం తగ్గించుకుంటూ జవాబిచ్చాడు కల్నల్.

"డాడీ!"

"యస్ బేబీ!"

"మీకు నా ఫ్రెండ్స్‌ని ఇంట్రడ్యూస్ చేస్తాను. మీట్ మిస్టర్..."

"వాట్? వీళ్లు నీ ఫ్రెండ్సా?" షాక్ తింటూ అడిగాడు కల్నల్.

"అవును డాడీ"

"మరలా 'డెకాయిట్స్' లాగున్నారేమిటి?"

చిరంజీవి చప్పున అందుకున్నాడు.

"అబ్బే క్రాఫ్ కొంచెం చెదిరిపోయిందండీ! అందుకని అలా కనబడుతున్నాం"

"అవునండీ! దువ్వెనా, అద్దం ఇస్తే మళ్ళీ మామూలుగా అయిపోతామండీ!" చెప్పాడు సింహాద్రి.

"ఐసే షటప్!" మళ్ళీ భీకరంగా అరచాడు కల్నల్!

శ్రీదేవి పరిస్థితినంతా తక్కున అర్థం చేసుకుంది.

తను వెంటనే కలుగజేసుకోకపోతే పరిస్థితి మరింత క్షీణించే ప్రమాదం ఉందని తెలుసుకుని తక్కున అడ్డుపడి పోయింది.

"డాడీ!"

"యస్ బేబీ!''

"వేటలో ఏదీ దొరకలేదా డాడీ!''

"లేదమ్మా! బులెట్స్ వేస్ట్ అయినయ్ గాని ఒక్కటి కూడా దొరకలేదు ఆ మచ్చల జింక ఉంది చూడు! దాన్ని ఈసారి మాత్రం వదలను! ఇదిరెండోసారి కొంచెంలో మిస్సవడం''

"ఓ! అందుకే చాలా కోపంగా ఉన్నారు డాడీ! పదండి! మేడ మీదకెళ్లి డ్రస్ మార్చుకుందురుగాని! నేనీలోగా కాఫీ లైట్ రిఫ్రెష్‌మెంట్స్ ఎరేంజ్ చేస్తాను''

కల్నల్ ఓసారి చిరంజీవి వంకా,



సింహాద్రి వంకా అయిష్టంగా చూశాడు.

వాళ్ళకూ, తనకూ మధ్య శ్రీదేవి నిలబడడంతో ఇంకేమీ మాట్లాడలేక మేడ మీదకెళ్ళిపోయాడు.

శ్రీదేవి తేలిగ్గా గాలి పీల్చుకుంది.

అంతకంటే ఎక్కువ గాలి సింహాద్రీ, చిరంజీవి పీల్చుకున్నారు.

"ఓ, అయామ్‌సారీ ధనుంజయ్ గారూ! ముందే చెప్పానుకదా! మా డాడీకి వేటలో జంతువు దొరక్కపోతే ఎవర్ని పడితే వాళ్ళను కాల్చిపారెయ్యాలని కోరికగా ఉంటుంటట!" అంది నొచ్చుకుంటూ!

"సైకలాజికల్ వీక్‌నెస్" అన్నాడు చిరంజీవి.

"మీరేమీ అనుకోకండి!" సింహాద్రి వంక చూస్తూ అందామె.

చిరంజీవి సింహాద్రి భుజం తట్టాడు.

"శ్రీదేవిగారితో ఆ విషయం మాట్లాడుతూండు! నేనీలోగా గార్డెన్ ఓసారి చూసి వస్తాను" అంటూ సింహాద్రికి కన్ను కొట్టి బయటికెళ్లాడు.

సింహాద్రికి అర్థమయిపోయింది.

తన ప్రేమను వెల్లడి చేయడానికి ఇంతకంటే మంచి అవకాశం వచ్చేట్లు కనిపించలేదు. పరిస్థితులు ఎప్పుడెలా ప్రమాదకరంగా మారతాయో ఊహించడం కష్టంగా ఉంది.

"ధనుంజయ్‌గారూ! మీరు మరొక్క పావుగంట కూర్చోండి! నేనీలోగా నవల పూర్తి చేసి వస్తాను. మరో పాతిక పేజీలే ఉన్నాయ్" అంది శ్రీదేవి.

"నవల బావుందాండీ!"

"అద్భుతంగా ఉంది" అంది శ్రీదేవి.

సింహాద్రి మొఖం చిన్నబోయింది.

"నా నవలకంటేనాండీ?"

"నోనోనో. మీ నవలల కంటె గొప్పవి ఇంకెవరూ రాయలేరు ధనుంజయ్‌గారూ. అసలు మీరే స్వయంగా ఓ హిప్నాటిస్ట్ అన్న సంగతి నాకు ఇన్ని రోజులూ తెలీదు. తెలుస్తే..." ఆమె ఆపేసింది.

సింహాద్రి గుండెలు వేగంగా కొట్టుకున్నాయ్.

"తెలుస్తే? ఏం చేసేవారండీ" ఆనందంగా అడిగాడు.

"ఏనాడో...మీకు దగ్గరయేదాన్ని" సిగ్గుపడుతూ అందామె.

"శ్రీదేవిగారూ... నాకూ మీరంటే ఎంతో ఇష్టమండీ! మీ ఫొటో చూసిన దగ్గర్నుంచీ నిద్ర పట్టటం లేదంటే నమ్మండి. నిద్రపడితే చాలు - మీరు రామేశ్వర్ జఠానీ అనేవాడిని పెళ్ళి చేసు చేసుకున్నట్లు ఒకటే పీడకలలండీ!"

శ్రీదేవి ఆశ్చర్యపోయింది.

"రామేశ్వర్ జఠానీ ఎవరు?"

"అదే నాకూ తెలీటం లేదండీ! మన కిష్టం లేని పేరేదయినా చదువుతే అది మనసులో అలాగే నిలిచిపోతుందని చిరంజీవి అన్నాడండీ! వాడికి సైకాలజీ బాగా తెలుసులెండి! ఎందుకంటే నూట ఆర్రోజులు రాత్రింబగళ్లు ఒక లాయరు ఇంటి పక్కన ఉన్నాడు కదండీ!"

శ్రీదేవి నవ్వేసింది.

"శ్రీదేవిగారూ"

"ఏమిటండీ!"

"నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నానండీ"

"ఓ!" సిగ్గుపడిపోయిందామె.

"అయ్ టూ లవ్‌యూ" అంది ఓ క్షణం ఆగి.

సింహాద్రి ఆనందంతో ఉక్కిరిబిక్కిరయాడు.




ఈలోగా వంటవాడు ట్రేలో కాఫీ కప్పులతో వచ్చేశాడు.

"ఓకే. మీరు కాఫీ తాగుతూండండి! ఇప్పుడే ఈ పాతిక పేజీలూ చదివేసి వస్తాను. సస్పెన్స్ కంట్రోల్ చేసుకోలేక ఛస్తున్నాను'' అనేసి లోపలికి పరుగెత్తింది శ్రీదేవి.

ఆమె అటు వెళ్ళగానే చిరంజీవి పరుగుతో లోపలికొచ్చేశాడు.

''కేసు సక్సెసేనా ?''

"సక్సెసున్నర" గర్వంగా అన్నాడు సింహాద్రి.

''పెళ్ళికి డేట్ ఫిక్స్ చేయడమే ఆలస్యం అన్నమాట''

"అది కూడా ఆట్టే ఆలస్యం ఉండదు''

''ష్యూర్''

''డామ్ ష్యూర్''



ఇద్దరూ కాఫీ కప్పులందుకుని రెండు గుక్కలు తాగేసరికి కల్నల్ డ్రస్‌మార్చుకుని మేడ దిగి వచ్చాడు. వస్తూనే వాళ్లను చూసి అనుమానంగా దగ్గర కొచ్చాడు.

"ఎవరు మీరు?" అన్నాడు కఠినంగా.

సింహాద్రి చిరంజీవి మొఖం చూశాడు.

"మేము... మేము... పిడి పేరు ధనుంజయ్ అండీ. నా పేరు..."

"షటప్. పేర్లడగటం లేదు. మీరెవరూ అనడుగుతున్నాను''

"మేము శ్రీదేవిగారి ఫ్రెండ్స్ అండీ! ఆమె బర్త్‌డే పార్టీకొచ్చాము''

కల్నల్‌కి తక్కున గుర్తుకొచ్చింది.

''ఓ! ఇందాక కలుసుకున్నాంకదూ! బేబి చెప్పింది కూడానూ!అయామ్ సారీ" అన్నాడు నొచ్చుకుంటూ.

''అబ్బే అదేంఫర్లేందులెండి. అందులో పెద్ద సారీ ఏముందని?'' అన్నాడు సింహాద్రి.

"అరె! అలా నిలబడ్డారెందుకు? కూర్చోండి''

ఇద్దరూ మళ్ళీసోఫాలో కూర్చున్నారు

కల్నల్ అభిమానంగా చూశాడు వాళ్ళవేపు.

"మా బేబీ ఫ్రెండ్సంటే నాకెంతో ఇష్టం" అన్నాడు తనూ వాళ్ళకెదురుగ్గా కూర్చుంటూ.

"అలాగండీ! దటీజ్ వెరీ నైస్" అన్నాడు చిరంజీవి.

"రియల్లీ ఒండర్‌ఫుల్" అన్నాడు సింహాద్రి.

"అది మీ మానవత్వాన్ని చాటుతోంది" అన్నాడు చిరంజీవి.

"మానవసేవే..మాధవసేవ అనీ మా పాలసీకూడా అదేనండి!"

కల్నల్ ఇద్దరివంకా చిరాగ్గాచూశాడు. దాంతో ఇద్దరూ సైలెంటయిపోయారు.

"మా బేబి అందరితోనూ స్నేహం చేయదు. సెలెక్టెడ్ పీపుల్‌తోనే చేస్తుంది. అన్నట్లు మీ పరిచయభాగ్యం అవలేదు'' అన్నాడు కల్నల్ వివరాలకోసంచూస్తూ.

చిరంజీవి ఉత్సాహంగా ప్రారంభించాడు.

"ఇతను ప్రఖ్యాత రచయిత ధనుం

జయ్ అండీ! నా పేరు చిరంజీవి! ఇద్దరం ఫ్రెండ్స్!"

"కాలేజ్ మేట్స్ అండీ!"

"ఇద్దరం ఇంటర్‌లో 'డి' సెక్షన్‌లో వుండేవాళ్ళం"

కల్నల్ అసహనంగా చూశాడు.

"రచయిత ధనుంజయ్ నువ్వా?" సింహాద్రివంక చూస్తూ అడిగాడతను.

సింహాద్రి ఆనందంతోపొంగిపోయాడు.

"అవునండీ! నేనే!"

"అవున్సార్! ఇతనే ఫేమస్ రైటర్ ధనుంజయ్!"

"నాపేరు ఇంతకుముందే మీకు తెలుసాండీ?" అడిగాడు సింహాద్రి ఆనందంగా

"తెలుసు!"

"అఫ్‌కోర్స్. మా వాడిపేరు తెలీని వారుండరులెండి" సగర్వంగా అన్నాడు చిరంజీవి.

"నా నవలలు మీరు చదివారాండీ?"

"ఓ! ఒకటేమిటి? చాలా చదివాను"

"మీరుచదివాక ఎలాఫీలయ్యారండి?"

"చా లా ఫీలయ్యాను. అది చదివినప్పటినుంచీ నీ అడ్రస్‌కోసం ఎంతో ట్రై చేస్తున్నాను"

చిరంజీవి ఆ మాటలు వినగానే విజయగర్వంతో సింహాద్రివేపు చూశాడు.

"నేను చెప్పలేదు బ్రో!"

కల్నల్ అనుమానంగా చూశాడతని వేపు.

"ఏం చెప్పావ్?"

''మిలటరీఆఫీసర్ల సంగతండీ!"

"ఏమిటి వాళ్ళసంగతి?"

"వాళ్లు సాహిత్యమంటే ప్రాణం ఇస్తారండీ!"

"అలా అని నీకెవరు చెప్పారు?"

"మా శ్రీనివాసులండీ!"

"వాడెవడు?"

''మా ఫ్రెండండీ?"

''వాడెందుకు చెప్పాడా విషయం?"

''వాడి రచనలంటే పడిచచ్చే ఓ మిలటరీ ఆఫీసరుగారు రిటైరయ్యాక వాడిని ఇంటికి పిలిచి ఎంతో గౌరవించారటండీ!"

''ఐసీ"

చప్పున సింహాద్రి అందుకున్నాడు.

''పాపం ఎప్పుడూ బోర్డర్స్‌లో వుంటారు కదండీ! అంచేత సాహిత్యం అంటే మరీ అభిమానం అటండీ!''

"నీకెవరు చెప్పారు?''

"వీడేనండీ''

''దటీజాల్ ట్రాష్!''

"అలాగాండీ?"

"అవును! మియర్ ట్రాష్!"

''సరేనండీ!"

"నన్నడిగితే మేమంతా బోర్డర్స్‌లో అందరికీ దూరంగా ఉండడం మీఅదృష్టం అంటాను''

''ఎందుకండీ!''

"మాకు సమీపంగా ఉన్నట్లయితే ఏం జరిగేదో నేనే చెప్పలేను''

"అదేంటండీ మా శ్రీనివాసులుచెప్పాడు. పాపం అతని అభిమాని...''

''సైలెన్స్'' అరిచాడు కల్నల్.

''ఎందుకు సార్ అలా అరచారు?"

''టుహెల్ విత్‌యువర్ శ్రీనివాస రావ్!''

"శ్రీనివాసరావ్‌కాదండీ!శ్రీనివాసులు"

''అయ్‌సే షటప్''

చిరంజీవికిఇంక మాట్లాడడంభావ్యంగా కనిపించక సైలెంటయిపోయాడు.

''మిష్టర్ ధనుంజయ్'' శాంతంగా పిలిచాడు కల్నల్.

''ఏమిటండీ?'' అతని గొంతులోని




మార్పుకిసంతోషిస్తూ అన్నాడుసింహాద్రి.

"అలాంటి నవలలు ఇకముందు కూడా రాయాలన్న ఆలోచన ఉందా నీకు?'' కల్నల్ తాపీగా అడిగాడు.

సింహాద్రి గర్వంతో పొంగిపోయాడు.

''అవునండీ! ప్రస్తుతం కూడా ఓ నవల రాస్తున్నారండీ! కథేమిటంటేనండీ ఓ జమీందారు ఉంటాడండీ! ఆ జమీందారుకి ఏడుగురు కొడుకులండీ! అందులో ఆరోవాడు రిక్షా తొక్కుతూంటాడన్న మాటండీ. ఎందుకంటే వాడు చాలా ప్రిన్సిపుల్డ్ అన్నమాట! ఎవరిమీదా ఆధారపడడం ఇష్టంలేదన్నమాట! కేవలం స్వార్జితం...''

"స్టాపిట్!'' అరచాడు కల్నల్.

సింహాద్రి ఆశ్చర్యపోయాడు.

ఈ మనిషి తత్వం బొత్తిగా బోధపడడం లేదు తనకి అతనే క్వొశ్చన్స్ వేస్తాడు. జవాబు వివరంగా చెప్తూంటే కరవబోతాడు.

''అయితే ఇంకేమాత్రం ఆలస్యం చేయడానికి వీల్లేదు'' అన్నాడు కల్నల్.

సింహాద్రి మళ్ళీ ఉత్సాహంతో పుంజుకున్నాడు.

''అవునండీ! ఆలస్యాత్ విషం అమృత్ అన్నారండీ''

''అంటే వాడు చెప్పింది శాన్స్క్రిట్‌లెండి! బైదిబై హినోస్ శాంస్క్రిట్ ఆల్సో'' అన్నాడు చిరంజీవి.

''టు హెల్ విత్ హిజ్ శాన్స్క్రిట్'' అరచాడు కల్నల్.

''సరేనండీ!''

''మీరు తప్పక చదవండి సార్! పబ్లిష్ అవగానే కాపీ నేనే స్వయంగా మీకు తెచ్చిస్తాను'' అన్నాడు సింహాద్రి టాపిక్ మార్చేస్తూ.

"షటప్'' అరచాడు కల్నల్.

సింహాద్రికి ఏమీ అంతుబట్టటంలేదు.

"ఆల్ రైట్'' అన్నాడు.

''పోనీ అర్జంటుగా చదవాలనుకుంటే ఇప్పుడే వినిపిస్తాను. ఇప్పుడే అంటే ఇప్పుడే కాదులెండి! రాత్రి డిన్నర్ అయాక మూన్‌లైట్‌లో అయ్‌మీన్ లైట్ లేకుండా అనికాదు - చిన్నబల్బు సిక్స్టీవాట్స్‌ది సరిపోతుంది. లేదా స్క్రిప్ట్ రడీ అవగానే ముందు మీకే చదవడానికి యిస్తాను''

"నీ నవల చదవాలనుకునేంత వెధవని కాదు''

''అలాగాండీ! అయితే 'ఆలస్యం చేయడానికి వీల్లేదు' అన్నారు-ఏ విషయం గురించి?'' అనుమానంగా అడిగాడు సింహాద్రి.

''నిన్ను కాల్చిపారేసే విషయం''

సింహాద్రితోపాటు ఈసారి చిరంజీవి కూడా అదిరిపడ్డాడు.

"కా....కా.. కాల్చేస్తారా?"

''అవును! పిస్టల్‌తో కాల్చాలా, రివాల్వర్‌తో కాల్చాలా అనేది నేనింకా నిర్ణయించుకోలేదు. బైదిబై- ఈ రెండిట్లో నీకేదంటే ఇష్టం?''

''కాని...కాని... ఇప్పుడెందుకు సార్ అనవసరంగా కాల్చటం నన్ను? నేనేం చేశానని?''

''ఏం చేశావా? దేశం నాశనం చేస్తున్నావ్! మా శ్రీదేవి నీ హిప్నాటిజం రచనల మాయలోపడి - పెళ్ళంటూ చేసుకుంటే హిప్నాటిజం వచ్చినవాడినే చేసుకుంటానని మొండికేసింది. అందువల్ల ఎన్నో మంచిసంబంధాలను తిరక్కొట్టేసింది. హిప్నాటిజం వచ్చిన మా స్టేటస్‌కి తగ్గ వెధవాయి ఒక్కడూ దొరకడం

లేదు. అప్పట్నుంచే అసలు దీనికంతటికీ కారణమయిన నిన్ను షూట్ చేయాలని చాలా రోజుల్నుంచి ప్లాన్ చేస్తున్నాను. కానీ అడ్రస్ దొరకలేదు. అసలు నీ అడ్ర సేమిటి?''

''అడ్రస్ చాలా తేలికండీ కనుక్కో వడం. తిన్నగా మలక్‌పేట వచ్చేసి అక్కడ 6-6-3-2-8-1-3-1-628/319 A-S-K-N-C''

''స్టాపిట్'' అరచాడు కల్నల్.

''ఇంకా పూర్తి కాలేదండీ అడ్రస్'' చెప్పబోయాడు చిరంజీవి.

''టుహెల్ విత్ యువర్ అడ్రెస్. ఇప్పుడు నువ్వే పర్సనల్‌గా దొరికాక ఇంకా అడ్రసెందుకు? ఆల్‌రైట్ పద! మేడమీద కెళ్దాం''

సింహాద్రి ఆశ్చర్యపోయాడు.

''మేడమీదకా?''

''అవును''

''ఎందుకు సార్?''

''డ్రాయింగ్‌రూమ్‌లోనిన్ను కాల్చడం నాకిష్టం లేదు. ఫర్నిచర్ పాడయిపోతుంది. ఇది చాలా కాస్ట్‌లీ ఫర్నిచర్''

చిరంజీవి ఇదే అదునుగా తీసుకొని కల్నల్‌ని మాట మరిపించాలని ప్రయత్నాలు ప్రారంభించాడు.

''ఫర్నిచర్ నిజంగా చాలా ఒండర్ ఫుల్‌గా ఉందిసార్! అద్భుతమైన టేస్ట్ మీది. ఎక్కడినుంచి తెప్పించారు సార్ దీన్ని?''

''స్విట్జర్లాండ్ నుంచి''

''సూపర్ ఛాయిస్! చాలామంది తెలివితక్కువ వెధవలు చిలీ, ఉగాండా దేశాలనుంచి తెప్పిస్తూంటారండీ''

''అలా తెప్పించేవాళ్లు ఇడియట్స్ అంటాను''

''అవునండీ!''

కల్నల్ సింహాద్రిని చూసి తక్కున మళ్ళీ ప్రోగ్రామ్ గుర్తు తెచ్చుకున్నాడు. వెంటనే చిరంజీవి వేపు చూసి ''నువ్వు కూడా మేడ మీదకు పద'' అన్నాడు కర్కశంగా.

''నేనా? నేనెందుకు సార్?''

''ఈ ధనుంజయ్‌గాడి స్నేహితుడి వయినందుకు. అసలీ ధనుంజయ్‌గాడికి సంబంధించినవారందరినీ కూడా షూట్ చేయాలని షెడ్యూల్ వేసుకున్నాను''

సింహాద్రి ఛప్పున భయంలో నుంచి తేరుకున్నాడు. అతని మెదడుకో అద్భుత మయిన ఉపాయం తట్టింది.

''సార్! నేనికముందు నవలలు రాయడం మానేస్తున్నానండీ! నిన్నే డెసిషన్‌తీసుకున్నాను'' అన్నాడు కల్నల్ మనసు మారుతుందన్న ఉత్సాహంతో.

''అయినా సరే! ఇదివరకు రాసిన వాటికే నిన్ను షూట్ చేయబోతున్నాను'' ఊఁ... గెటప్! పదండి మేడమీదకు!''

''ఇది అన్యాయం సార్! మే ము శ్రీదేవిగారి స్నేహితులం''

''ఏంఫరవాలేదు. ముందు రచయితగా చద్దూగాని. తరువాత మా బేబీ ఫ్రెండ్‌గా చావవచ్చు. కమాన్. మేడమీదకుపదండి''

చిరంజీవికి పరిస్థితి విషమించి పోతోం దని అర్థమయిపోతోంది.

''సార్! వాడురాసిన నవలలకు బోలెడు పశ్చాత్తాప పడుతున్నాడు కదా! క్షమించేయగూడదూ?''

''ఆర్మీలో పశ్చాత్తాపం పనిష్మెంట్ కాదు''

సరిగ్గా అప్పుడే శ్రీదేవి లోపల్నుంచి వచ్చేసింది.

''డాడీ! ఏంచేస్తున్నారు మీరు?''




అంది తండ్రి చేతిలోని పిస్టల్‌నూ, పిస్టల్ కెదురుగ్గా నిలబడ్డ సింహాద్రినీ, చిరంజీవినీ చూసి.

''వీళ్ళను కాల్చడానికి మేడమీదకు తీసుకెళ్తున్నాను''

''ఓకే డాడీ! ఇంకా ఇక్కడే కాలుస్తారేమోనని భయపడ్డాను! ఫర్నిచరంతా రక్తంమరకలు అయిందంటే మళ్ళీ అన్నీ క్లీన్‌చేయించలేక పెద్ద హెడేక్''




సింహాద్రీ, చిరంజీవీ ఉలిక్కిపడ్డారు.

సింహాద్రి ఏడుపుమొఖంతో శ్రీదేవి వంక చూశాడు.

''అయినా నీ కిలాంటి ట్రుమీగాళ్ళతో ఎలా ఫ్రెండ్‌షిప్ అయిందమ్మా?'' ఆప్యాయంగా అడిగాడు కల్నల్.

''ట్రుమీఅంటే ఏమిటండీ?'' అడిగాడు సింహాద్రి.

''డోంటాక్'' అరచాడు కల్నల్.

''అతని నవలలు చదవడంమూలాన ఫ్రెండ్‌షిప్ చేసుకున్నాను డాడీ'' చెప్పింది శ్రీదేవి.

"ఏవీ ఆ హిప్నాటిజం నవలలా?"

"హిప్నాటిజమే కాదు డాడీ, టెలిపతీ, అలోపతీ, విలోపతి – ఇంకొకటి ఏమిటబ్బా..." ఆలోచనలో పడిందామె.

"సైకోపతి అండీ" అందించాడు చిరంజీవి.

"కరెక్ట్. సైకోపతి. ఇవన్నీ రాస్తాడు డాడీ!"

"అదంతా ట్రాష్" అరచాడు కల్నల్.

''ట్రాష్‌కాదు డాడీ! మొన్న అతనే హిప్నాటిజం చేసి చూపించాడు"

''ఏడ్చాడు"

''కాదుడాడీ! నిజమే! మనుషుల్నే కాదు కుక్కనికూడా చేస్తాడు"

''కుక్కనా?"

''అవును డాడీ!"

"ఆల్ ట్రాష్" బిగ్గరగా అన్నాడు.

''ట్రాష్‌కాదండీ! నిజమే" కల్పించుకుంటూ అన్నాడు చిరంజీవి.

కల్నల్‌కి ఛటుక్కున ఓ ఆలోచన వచ్చింది.

''ఐ సీ" అన్నాడు తల పంకిస్తూ.

''మిస్టర్ సింహాద్రీ" నెమ్మదిగా పిలిచాడతను.

"ఏమిటండీ"

''మనుషుల్నీ, జంతువుల్నీ కూడా హిప్నటైజ్ చేస్తావన్నమాట నువ్వు!''

''అఫ్‌కోర్స్.ఇహి....అవునండీ! ఆల్ మోస్టాల్ చేయగలనండి.కాపోతే ఇహిహి.. అంతేనండీ" భయంగా అన్నాడతను.

"ఆల్‌రైట్ ! నన్ను హిప్నటైజ్ చెయ్ చూద్దాం'' అన్నాడు నడుం మీద రెండు చేతులు పెట్టుకుని.

సింహాద్రి ఖంగారుపడిపోయాడు.

"ఇప్పుడాండీ?''

"అవును! ఇప్పుడే ! ఈ నిమిషంలోనే!"

''మిమ్మల్నాండీ!''

''నన్నే!''

''ఇప్పుడు చేయడం కొంచెం కష్టమండీ!''

"ఏం... ఎందుకు కష్టం?"



"మూడ్ బాగోలేదండీ?''

"ఎవరిది!"

"నాదేనండీ!"

"మిస్టర్ సింహాద్రీ!"

"యస్సార్''

"నన్ను హిప్నటైజ్ చేస్తావా, ఇక్కడే కాల్చిపారేయ్‌మన్నా రా''

శ్రీదేవి కెవ్వున అరచింది.

"అయ్యో ఇక్కడ కాల్చొద్దు డాడీ! ప్లీజ్ ! సోఫాలన్నీ బ్లడ్‌స్టెయిన్స్ అవుతాయ్"

"ఓ...సారీ బేబీ! మర్చేపోయానా విషయం''

"పోనీ ఓ పనిచేయనాండీ" నెమ్మదిగా, దీనంగా అడిగాడు సింహాద్రి.





"ఏమిటది?"

"మా చిరంజీవిని చేసి చూపిస్తానండీ" ఆశగా అన్నాడు.

"డోంట్ థింక్ అయామే ఫూల్'

"అబ్బే... అలాఅనుకోవడంలేదండీ"

"ష్యూర్"



"షూ్యరండీ!"

''అయితే నోర్మూసుకుని నేను చెప్పినట్లు చెయ్''

''ఏం చెప్పారండీ?''

"నన్ను హిప్నటైజ్ చేయమని"

"కానీ....''

''త్రీ వరకూ లెక్కపెడతాను! ఈలోగా ప్రారంభించకపోయావో ఫట్"

''కానీసార్:అసలు హిప్నటిజం చేయడానికి...''

"వన్''

''అదికాదన్సార్! పోనీ ఇవాళ్టికి చిరంజీవిని...''

"టూ''

''పోనీ మిమ్మల్నే రేపు తెల్లారు జామున...''

''త్రీ" అనేసి పిస్టల్ అతని ఛాతీకి గురిపెట్టాడు కల్నల్.

''బాబోయ్ వద్దులెండి! చేస్తాను... ఇప్పుడే చేస్తాను" వణుకుతున్న గొంతుతో అన్నాడు సింహాద్రి.

"అయితే చెయ్''

''మీరలా కూర్చుని నా కళ్ళల్లోకే చూడండి" అన్నాడతను.

"ఎందుకు?''

''హిప్నటిజంలో అలా చూడాలని ఓ ఆచారం ఉందండీ'' సర్ది చెప్పాడు చిరంజీవి.

కల్నల్ ఎదురుగ్గా కూర్చుని సింహాద్రి కళ్ళల్లోకి భీకరంగా చూడసాగాడు.

''మీరు నావంకే చూస్తున్నారు-నావంకే చూస్తున్నారు - నావంకే చూస్తున్నారు'' అన్నాడు సింహాద్రి.

''అవును! చూస్తున్నాను" అన్నాడు కల్నల్.

''మీరు నిద్రావస్థలోకెళ్తున్నారు-నిద్రావస్థలోకెళ్తున్నారు -నిద్రావస్థలోకెళ్తున్నారు'' అన్నాడు మళ్ళీ.

''ఎక్కడికి?'' ఆశ్చర్యంగా అడిగాడు కల్నల్.

''నిద్రావస్థలోకి"

''అంటే?"

"అంటే నిద్రలోకెళ్తున్నారని అర్థమండీ?"

''నేను వెళ్ళటం లేదు'' అన్నాడు కల్నల్.

''వెళ్ళటం లేదాండీ ?'' అడిగాడు సింహాద్రి.

''లేదు''

"ఎందుకనండీ?'

''ఎందుకెళ్ళాలి?''

''హిప్నాటిజంలో ఎదుటివ్యక్తి చెప్పినట్లు చేయాలికదండీ?''

''నేను చేయను"

సింహాద్రికేంచేయాలో తోచలేదు.

"సరేనండీ! మరోసారి ప్రయత్నిస్తాను. మీరు కళ్ళు మూసుకుంటున్నారు - కళ్ళుమూసుకుంటున్నారు - కళ్ళుమూసుకుంటున్నారు''

''మూసుకోవటం లేదు" అన్నాడు కల్నల్.

"మీరు నిన్నటిలోకి వెళ్తున్నారు-నిన్నటిలోకి వెళ్తున్నారు నిన్నటిలోకి వెళ్తున్నారు" అన్నాడతను మళ్ళీ.

''ఎక్కడికీ వెళ్ళటంలేదు" అన్నాడు కల్నల్.

"ఇలా అన్నిటికీ ఎదురు తిరిగితే కష్టమండీ" బుంగమూతితో అన్నాడు సింహాద్రి.

"కష్టమా! మరి మా బేబీ ఎదురుగ్గా ప్రదర్శన ఇచ్చావుగా? ఇప్పుడేమయింది ఆ ఫోజంతా? చూశావా బేబీ—నేను చెప్ప




లేమా ఇదంతా ట్రాష్!"

"కావాలంటే మా చిరంజీవిని చేస్తానండీ" బతిమాలసాగాడు సింహాద్రి.

"అవునండీ! మొన్న భలే బాగా చేశాడు నన్ను"

"కంప్లీట్ బంకమ్!"

"బంకమ్ అంటే ఏమిటి సార్?"

"ఆల్ ట్రాష్!"

"కాదాసార్! మూడ్ బావుండలేదు"

"ఆల్ రైట్! నన్ను చేయడానికి మూడ్ బావుండలేదు కదా?"

"అవున్సార్!"

"అయితే మా కుక్కనుచెయ్"

"కుక్కనా?" నీరసంగా అన్నాడు సింహాద్రి.

"అవును! ఒరే రంగా" గట్టిగా పిలిచాడు కల్నల్.

రంగా పరుగుతో వచ్చాడక్కడికి.

"ఏం సార్?"

"మన అల్సేషన్ని తీసుకురా!"

"అలాగేసార్" అంటూ పరుగుతో బయటికెళ్ళి అయిదు నిమిషాల్లో మనిషంత ఎత్తుఉన్న ఆల్సేషన్‌తో తిరిగివచ్చాడు.

"హలో జ్విబికా!" అన్నాడు కల్నల్.

ఆల్సేషన్ ఆనందంగా అతని దగ్గరకెళ్ళి అతని చేతులు నాకి ఆజ్ఞకోసం ఎదుర్చూస్తూ నిలబడింది.

"గోటూ పట్ డెకాయిట్ అండ్ సిట్ దేర్ జ్విబికా" అన్నాడు కల్నల్.

జ్విబికా సింహాద్రి దగ్గరకొచ్చి అతనికెదురుగ్గా కూర్చుంది.

సింహాద్రి కాళ్లు, చేతులు వణుకుతున్నాయ్ దానిని చూస్తుంటే.

"కమాన్! డూ ఇట్" అరిచాడు కల్నల్ సింహాద్రి వంక చూస్తూ.

సింహాద్రికేమీ పాలుపోవడంలేదు.

"ఆల్సేషన్ని హిప్నటైజ్ చేయడం కుదరదండీ" అన్నాడు చిరంజీవి!

కల్నల్ చిరంజీవి వేపు కోపంగా చూశాడు.

"ఏం? ఎందుకని కుదరదు?"

"ఏమోసార్! కుదరదని పుస్తకాల్లో రాశారండీ!"

"చూశావా బేబీ! నేను నీకు ముందే చెప్పానుకదా! అంతా ట్రాష్" అన్నాడు కల్నల్ శ్రీదేవితో.

శ్రీదేవి కోపంగా సింహాద్రి వేపు చూసింది. సింహాద్రి చిరంజీవి వేపు చూశాడు. చిరంజీవి సీలింగ్ వేపు చూశాడు.

"జ్విబికా! వెరీగుడ్ నేమ్" అన్నాడు కల్నల్‌తో.

"డోంటాక్" అన్నాడు కల్నల్.

"ఒరే రంగా! జ్విబికాను తీసుకెళ్ళిపో"

రంగా జ్విబికాను తీసుకెళ్ళబోయాడు.

"ఒరే రంగా" మళ్ళీ పిలిచాడు కల్నల్.

"సార్!"

"గన్ క్లీన్ చేశావా?"

"చేశాన్సార్!"

"ఏదీ...తీసుకురా!"

రంగా జ్విబికాను తీసుకెళ్ళి రెండు నిమిషాల తర్వాత గన్‌తో తిరిగి వచ్చాడు.

కల్నల్ గన్ తీసుకుని పరీక్షించాడు.

"బారెల్లో వేడినీళ్లు పోశావా?"

"పోశాన్సార్!"

"పుల్‌త్రూ కొట్టావా?"

"కొట్టాన్సార్!"

"మాగజైన్ తీసి క్లీన్ చేశావా?"

"అది రావటం లేదండీ! ఎలా తీయాలో మర్చిపోయాను"

కల్నల్ కోపంతో మండిపడ్డాడు.

"ఇడియట్! మాగజైన్ ఎలా తీయాలో తెలీదట్రా!"

"తెలుసుగానండీ! మర్చిపోయాను. ఎంత లాగినా రావటం లేదు"

"బ్లడీఫూల్! మాగజైన్ తీయటం తెలీదా? ఎవడినడిగినా చెప్తాడా విషయం! ఏ వెధవాయిని తీయమన్నా తీసి చూపిస్తాడు"

అని ఆ పని ఎవరితో చేయించాలా అని చుట్టూ చూశాడు. అతనికి చిరంజీవి తప్పితే ఇంకెవరూ కనిపించలేదు.

"ఏమోయ్. మాగజైన్ ఎలా తీస్తారో నీకు తెలీదూ?"

చిరంజీవి ఈ అవకాశాన్ని వదలదల్చుకోలేదు. ఎన్.సి.సి.లో తను సంపాదించిన విజ్ఞానమంతా ఉపయోగించి కల్నల్‌ని సంతోషపెట్టాలని నిర్ణయించుకున్నాడు.

"తెలుసండీ! అసలు గన్‌లో మూడు భాగాలుంటాయండీ! అవి వరుసక్రమంలో బట్‌గ్రూప్, బాడీగ్రూప్, బారెల్‌గ్రూప్‌గా వ్యవహరింపబడును. మాగజైన్ బయటకు తీయాలంటే ట్రిగ్గర్‌కి సమీపమున ఒక మీట ఉండును. అంటే ఉదాహరణకు డోర్‌బెల్‌కి మీ బిల్డింగ్‌లో కింద మీట ఉన్నట్లు..."

కర్నల్‌కి అతని మీద సదభిప్రాయం కలగడం మొదలుపెట్టింది.

"తను చాలామంది ఎన్సీసీ స్టూడెంట్స్‌ని చూశాడుగానీ ఇలా ఇన్ని రోజులు పార్ట్స్ గుర్తుపెట్టుకున్నవాళ్లు బహుకొద్దిమంది.

"నువ్వు ఎన్సీసీలో ఉన్నావా?" అడిగాడు కల్నల్.

"అవునండీ"

"ఆర్మీలో ఎందుకు జాయినవలేదు మరి?"

"వాళ్లు రానీలేదండీ!"

"ఎందుకని?"

"తెలీదండీ!"

"ఆయ్‌విల్ రికమెండ్ యువర్ కేస్"

"థాంక్యూ సర్!"

ఇంకాసేపు అలా మాట్లాడితే అతని మీద పూర్తిసదభిప్రాయం కలిగేదేమోకాని ఇంతలోకి సింహాద్రి మాట్లాడాడు.

"అవునండీ! మీ చిలకల పంజరం డోర్‌కి ఆ వెనుక వేపు గోడకు మీట ఉన్నట్లు మాగజైన్‌కి కింద మీట ఉంటుందండీ!"

కల్నల్ అనుమానంగా సింహాద్రి వేపు చూశాడు.

"వాట్... పంజరానికి మీటా? మీట అక్కడ ఉన్నట్లు మీకెలా తెలుసు?"

చిరంజీవి సింహాద్రి వేపు చూసి పళ్లు పటపట కొరికాడు.

జరిగినతప్పు తెలుసుకుని నాలిక్కరుచుకున్నాడు సింహాద్రి.

"అబ్బె మాకు తెలీదండీ!"

"తెలీదా?"

"వట్టండి! తెలీదు"

"నిజం చెప్పండి! ఆ మీట నొక్కారా మీరు?"

"అబ్బె లేదండీ! అదసలు ఉందనే తెలీదు"

"తెలీందే గోడకి మీట ఉన్నట్లు ఎలా చెప్పావ్?"

"ఊహించానండీ!"

"అయ్ డోన్ట్ బిలీవ్. నేను వెళ్లి పంజరం చూసి వస్తాను" అంటూ రెండడుగులు వేసి మళ్ళీ అనుమానంగా ఇద్దరి వేపూ చూశాడతను.

"ఒరేరంగా! వీళ్ళిద్దరూ పారిపోకుండా చూస్తూండు" అని చెప్పి బయటికెళ్లాడు.

ఇదే అదననుకుని సింహాద్రి శ్రీదేవిని బతిమాలసాగాడు.




"శ్రీదేవిగారూ! మమ్మల్ని రక్షించండి! ప్లీజ్!"

శ్రీదేవి కోపంతో మండిపడింది.

"పిల్లేదు! మిమ్మల్ని కాల్చిపారెయ్యాల్సిందే!"

"అదేంటండీ! మనిద్దరం ప్రేమించుకున్నాం కదా?"

"అది ఇందాక చదువుతున్న నవల పూర్తికాక ముందు సంగతి"

"మరిప్పుడండి?"

"ఇప్పుడు అయ్ హేట్ యూ అండ్ యువర్ హిప్నాటిజం"

"మరి సైకోపతీ, టెలీపతీ, విలోపతీ సంగతి?"

"అయ్ హేట్ ఎవ్విరీథింగ్"

"ఐసీ" అన్నాడు సింహాద్రి.

"యస్. యూకెన్ గోటూ హెల్" అందామె ఇంకా కోపంగా.

"కానీ మీరు ఎందుకండీ వాటిని ఇంత సడెన్‌గా హేట్ చేస్తున్నారు?"

"ఇప్పుడు నేను చదివిన నవలవల్ల!"

"అలాగాండీ!"

"యస్!"

"ఏమయిందండి ఆ నవల్లో?"

"ఇంకేమవుతుంది? ఆ విలన్‌గాడు తన కొచ్చిన హిప్నాటిజం, టెలీపతీ, సైకోపతీ ద్వారా హీరోయిన్నీ, ఆమె ఫామిలీ మెంబర్స్‌నీ నానా అవస్థలూ పెట్టి ఛంపి పారేశాడు. వాటివల్ల ఇంత చెడు జరగడానికి కూడా అవకాశంవుందని నాకింత వరకు తెలీదు"

"తెలుస్తే ఏంచేసేవారండీ?"

"ఆ చెత్త ఏనాడో చదవడం మానేసేదాన్ని!"

సింహాద్రికింకేం మాట్లాడాలో తెలీ లేదు. దీనంగా చిరంజీవివేపు చూశాడు. చిరంజీవికి అతనిని చూస్తే జాలేసింది. వెంటనే వాడిని రక్షించకపోతే తమ స్నేహానికి ఉపయోగం ఏముందీ అనిపించింది.

"శ్రీదేవిగారూ!" అన్నాడు గొంతు సవరించుకుని.

"యస్" ప్రశ్నార్థకంగా అతనివేపు చూసిందామె.

"నిజం చెప్పాలంటే హిప్నాటిజం అంటే మీకెంత ద్వేషమో పాపం వాడికి కూడా అంతే ద్వేషం అండీ!" అన్నాడు సీక్రెట్ బయటపెడుతున్నట్లు.

శ్రీదేవి నమ్మలేనట్లు చూసింది.

"ద్వేషమా?"

"అవునండీ!" తలూపాడు సింహాద్రి.

"నేన్నమ్మను!"

"అలా అనకండి! మీమీద వట్టు!"

"ఆ పుస్తకాలే రాస్తూ అవంటే అసహ్యం అంటారేమిటి? మీకేమయినా మెదడుందా అసలు?"

"మెదడుందండి! ఈమధ్యే ఎక్స్‌రే తీయించినప్పుడు క్లియర్‌గా కనిపించిందది" చెప్పాడు చిరంజీవి.

"అయితే మరి అలా పిచ్చిమాటలు ఎందుకు మాట్లాడుతున్నట్లు?"

"పిచ్చిమాటలు కాదండీ! ఫాక్ట్స్! వీడు కేవలం కమర్షియల్ రైటర్! అంతే!"

"అంటే?"

"అంటే కేవలం బిజినెస్‌కోసం-అంటే అలాంటి పుస్తకాలు ఎక్కువ అమ్ముడు అవుతాయి కాబట్టి రాస్తున్నాడు"

"నే నమ్మను!"

"ప్లీజ్! ఈ ఒక్కసారికీ నమ్మండి" బతిమాలాడు సింహాద్రి.

"నో"

"శ్రీదేవిగారూ!"

''మిస్ శ్రీదేవీ అనండి!''

''మిస్ శ్రీదేవీ''

అప్పుడే కల్నల్ లోపలికొచ్చాడు మళ్ళీ.

"నిజం చెప్పండి! ఆ మీట నొక్కింది మీరా, కాదా?" సింహాద్రి దగ్గరికొచ్చి అడిగాడు కల్నల్.

"అబ్బే- నిజంగానండీ! మాకేం తెలీదు" అన్నాడు సింహాద్రి.

"అవున్సార్! మాకేమాత్రం తెలీదు! మేము కేవలం డోర్ బెల్ కోసం వెతుకుతూంటే - శ్రీదేవిగారే తలుపు తెరచి డోర్‌బెల్ మీట కాళ్ళకిందే ఉందని చెప్పారు"

"అవునండీ! మీ కుక్క కన్వీనియెన్స్ కోసం అలా ఏర్పాటు చేశామని కూడా అన్నారు"

"కానీ మీ కుక్క పేరు చాలా బావుందండీ! వెరీ నైస్ నేమ్"

"ఆ పంజరంలోని చిలకలన్నీ ఏమయిపోయినయ్ ?" కర్కశంగా అడిగాడు కల్నల్.

"ఎగిరిపోయాయండీ!" అనేసి నాలిక్కరచుకున్నాడు సింహాద్రి.

"వాట్? ఎగిరిపోయాయా ?"

"అవునండీ!"

"అంటే- అది మీ పనేనన్న మాట!"

"అబ్బే! మాకదేం తెలీదండీ!"

"తెలీందే ఎగిరిపోయినాయని ఎలా చెప్పావ్ మరి?"

"ఎలాగంటేనండీ- ఎలాగంటేనండీ- ఎలాగంటే.." సహాయం కోసం చిరంజీవి వేపు చూశాడతను.

"అది జస్ట్ కామన్ సెన్సండీ!" జొరపడుతూ అన్నాడు చిరంజీవి.

"కామన్సెన్సా?" కోపంగా అడిగాడు కల్నల్.

"అవునండీ! చిన్నప్పుడు మీరు తెలుగువాచకంలో గేయం చదువలేదూ? ఆ గేయం పేరు 'చక్కని ఓ పక్షులారా' చాలా అద్భుతంగా ఉంటుంది. రాసిందెవరంటే-సారీ పేరు గుర్తులేదు. కానీ గేయం పేరు మాత్రం...చక్కని ఓ పక్షులారా"

"టు హెల్ విత్ దట్ గేయం" పళ్ళు కొరుకుతూ అన్నాడు కల్నల్.

"అఫ్‌కోర్స్ ఆ గేయం మనకు అప్రస్తుతం! నేను మీ అభిప్రాయంతో ఏకీభవిస్తున్నాను" అన్నాడు సింహాద్రి.

"అయితే కేజ్ డోర్ తెరచింది నువ్వేకదూ ?"

"లేద్సార్! జస్ట్ కామన్సెన్స్ ప్రకారం చెప్పాను. అంతే!"

"ఏమిటా కామన్‌సెన్స్?"

"అదే జంతువులు పరుగెత్తును, చేపలు ఈదును, పక్షులు ఎగురును - ఇవన్నీ కామన్‌సెన్సే కదండీ! జస్ట్..కామన్‌సెన్స్"

"టు హెల్ విత్ కామన్స్‌సెన్స్! కేజ్ డోర్ ఎవరు తెరచారు?"




ఇలా ఆ సంభాషణ ఇంకెంతసేపు కొనసాగేదోగాని ఈలోగా ఓ పొడుగాటి వ్యక్తి బ్రీఫ్‌కేస్ తీసుకుని సరాసరి లోపలికొచ్చేశాడు.

"గుడ్‌మాణింగ్" అన్నాడు

కల్నల్‌తో.

కల్నల్ అతనివంక అయిష్టంగా చూశాడు.

"గుడ్‌మార్నింగ్" అన్నాడతను సింహాద్రి వంక చూసి.

"గుడ్‌మార్నింగ్!'' అన్నాడు సింహాద్రి.

''గుడ్‌మార్నింగ్'' చిరంజీవికి చెప్పాడు.

''యస్. వెరీ ప్లెజెంట్ మార్నింగ్'' అన్నాడు చిరంజీవి.

అలా అందరికీ చెప్పుకుంటూ వెళ్తే చాలా టైమ్ పడుతుందని ఊహించి–

"గుడ్‌మార్నింగ్ ఎవ్విరిబడీ'' అన్నాడు చిరునవ్వుతో.

కల్నల్‌కింక ఆవేశం ఆగలేదు.

మాంచి ముఖ్యమయిన సన్నివేశంలో ఉండగా పర్మిషన్ తీసుకోకుండా ఇంట్లో జొరబడటమే కాకుండా పేరు పేరునా అందరికీ విష్ చేయడం, ఆ తర్వాత గ్రూప్ విషింగ్ ఇవన్నీ పరమ చిరాకు కలిగించినయ్ అతనికి. ఇలా ముక్కూ మొఖం తెలీని సజ్జంతా ఇంట్లో జొరబడి ఇకిలించడానికి ఇదేం డ్రామా కంపెనీ కాదుగదా!

''హూ ఆర్‌యూ?'' అన్నాడు ఆ వ్యక్తి వేపు తిరిగి కోపంగా.

ఆ వ్యక్తి మళ్ళీ చిరునవ్వు నవ్వాడు.

''ఓ! నన్ను గుర్తుపట్టలేదన్నమాట'' అన్నాడు ఆశ్చర్యంగా.

''హూ ఆర్ యూ?'' మరింత కోపంగా అన్నాడు కల్నల్.

అతను మళ్ళీ చిరునవ్వు నవ్వాడు.

''ఇది మొదటిసారి ఎవరయినా నన్ను గుర్తుపట్టకపోవడం'' అన్నాడు వేదాంత ధోరణిలో.

''నువ్వెవరు?'' తెలుగులో అడిగితే అర్థం చేసుకుంటాడేమోనని అడిగాడు కల్నల్.

సరిగ్గా అప్పుడే వంట అమ్మాయ్ లోపల్నుంచి వచ్చి 'భోజనం రడీ' అంది.

ఆమెను చూడగానే ఆ కొత్త వ్యక్తి మొఖం మీద చిరునవ్వు – మరింత వెలిగిపోయింది. ఆమె దగ్గరకెళ్ళి–

''హాపీబర్త్‌డే టూయూ, హాపీబర్త్‌డే టూ యూ, హాపీబర్త్‌డే టూ యూ'' అన్నాడు ఇంచుమించుగా నృత్యం చేస్తున్నట్లు కదులుతూ.

కల్నల్‌కి పగ్గాలు తెగిపోయాయ్.

"నోర్మూసుకుని నువ్వెవడివో చెప్పు" అంటూ అరచాడు.

అప్పటికీ ఆ వ్యక్తి చెక్కుచెదరలేదు.

"శ్రీదేవిగారిల్లు ఇదేనా?" అనడిగాడు అనుమానంగా.

"అవును" అన్నాడు సింహాద్రి.

"అయితే–అయామ్ ఇన్ కరెక్ట్ ప్లేస్ ఓన్లీ" మళ్ళీ చిరునవ్వుతో అని వంటమ్మాయ్ వేపు తిరిగాడు.

"మీరు కూడా నన్ను గుర్తుపట్టలేదా?" అనడిగాడు.

ఆ అమ్మాయి భయపడిపోయింది.

"ఎవర్నువ్వు?" అంది రెండడుగులు వెనక్కు వేస్తూ.

"హాపీబర్త్‌డే టూ యూ" అన్నాడతను మళ్ళీ.

కల్నల్ పిస్టల్ పైకి తీశాడు.

"నోర్మూసుకుని ముందు నువ్వెవడివో చెప్తావా లేదా?" అన్నాడు ఆఖరుసారిగా.

ఆ వ్యక్తి పిస్టల్ చూసి ఖంగారు పడ్డాడు. ఆ మాట అన్నది తనను కాదేమోనని అటూఇటూ చూశాడు.

"నిన్నే అడిగేది–అలా దిక్కులు చూస్తావేమిటి? చెప్పు! హూ ఆర్ యూ?"

ఇంక ఇంట్రడ్యూస్ చేసుకోవడం చాలా ఆరోగ్యకరమయిన విషయంగా కనిపించిందా వ్యక్తికి.

“ఓకే! [illegible] నా ఫొటో [illegible] చూడలేదా?'' కల్నల్‌నడిగాడతను.

“అడ్డమైన ఫొటోలు చూసేవాడిక్కడ ఎవడూ లేడు” అన్నాడుకల్నల్.

“నేననేది అడ్డమయినాళ్ల ఫొటోల సంగతి కాదండీ! నా ఫొటో సంగతి”

“నీ ఫొటో సంగతే చెప్తున్నాను” అన్నాడు కల్నల్.

ఆ వ్యక్తి కొంచెం ఖంగుతిన్నాడు.

“ఆల్ రైట్ ... ఆల్ రైట్! అయామ్ ధనుంజయ్. ప్రఖ్యాత రచయిత ధనుంజయ్‌ని నేనే” అంటూ ఆనందంగా చుట్టూ చూశాడు.

“వ్వాట్” అదిరిపడ్డాడు కల్నల్.

అతనితో పాటు సింహాద్రి, [illegible]

[illegible]

నువ్వా?" మళ్ళీ అడిగాడు కల్నల్.
"సెంట్ పర్సెంట్"
కల్నల్ జెర్క్ ఇచ్చినట్లు తల తిప్పి సింహాద్రి వేపు చూశాడు. సింహాద్రి కూడా అదే స్పీడ్‌లో చిరంజీవి వేపు చూశాడు. చిరంజీవికి ఎటు చూడాలో తెలీలేదు. అంచేత కల్నల్ వేపు చూసి-
"ఇహిహి" అన్నాడు.
"డోంట్ లాఫ్" అన్నాడు కల్నల్.
శ్రీదేవి మెల్లగా లేచి గదిమధ్య కొచ్చింది.
"మీరు రచయిత ధనుంజయ్‌గారా?" అంది ఆశ్చర్యంనుంచి తేరుకొంటూ.
"సెంట్ పర్సెంట్. నేనే రచయిత ధనుంజయ్‌ని. శ్రీదేవిగారి పెన్ ఫ్రెండ్‌ని" అంటూ చిరునవ్వుతో వంట అమ్మాయి వేపు మళ్ళీ రెండడుగులు వేశాడు.
"ఇప్పుడు తెలిసిందా శ్రీదేవిగారూ! అయామ్ ధనుంజయ్. మీ బర్త్‌డే కదూ ఇవాళ. అందుకే హాపీబర్‌డే టూయూ, హాపీ బర్త్‌డే టూ యూ, హాపీబర్‌డే టూ యూ, మెనీహాపీ రిటర్న్స్ ఆఫ్‌ది డే టూ యూ..."
అతని వాలకం చూసి వంటమనిషి భయపడిపోయింది. కెవ్వున కేకవేసివెళ్ళి కల్నల్ వెనుక దాక్కుంది.
"స్టాపిట్" ఒగ్గరగా అరచాడు కల్నల్.
ధనుంజయ్ అదిరిపోయి మాట్లాడడం ఆపేశాడు.
"ఎవరు అరచిందిప్పుడు?" అన్నాడు చుట్టూ అందరినీ కలియజూస్తూ.
"నేను" అన్నాడు కల్నల్.
"ఎందుకలా అరచారు?"
"నాయిష్టం!" ఇంకా కోపంగా అన్నాడతను.
"అలా అరవకండి! చిన్నప్పటినుంచీ నాకు అరుపులంటే భయం. గుండెల్లో దడవస్తుంది. ఎప్పటినుంచీ అలా జరుగు తోందో తెలుసా? సెవెన్త్‌క్లాస్ చదివే టప్పుడు మా హిందీ మాష్టారు నేను కాపీ కొట్టటం చూసి బిగ్గరగా అరచారు. అప్పుడు.."
"ఐసే షటప్" మళ్ళీ అరిచాడు కల్నల్.
ధనుంజయ్ నిస్సహాయంగా వంట మనిషివేపు చూశాడు.
"శ్రీదేవిగారూ! నన్ను ఆహ్వానించి ఏమీ మాట్లాడరేమిటి?" అన్నాడు దీనంగా.
"శ్రీదేవి నేనుకాదు" అంది వంట మనిషి
"ఆ... మీరు కాదా?"
"కాదు" చిరాకుగా అందామె.
"మరెవరు?"
"అదిగో ఆ అమ్మాయిగారు"
"ఏ అమ్మాయిగారు... మీరా శ్రీదేవి గారు?" శ్రీదేవి వంక చూస్తూ అడిగా డతను.
"అవును" అందామె ముక్తసరిగా
"ఓ! అయామ్ సారీ! ఆమెను చూసి మీరనుకున్నాను. సారీ! వెరీసారీ! గ్లాడ్‌టు సీయూ-గ్లాడ్‌టుమీట్ యూ! నిన్నే మీరు పంపిన ఇన్విటేషన్ అందింది. కొంచెం లేట్‌గా చేరిందనుకోండి! అయినా ఫర్లేదు. బెటర్ లేట్ దేన్ నెవర్!
బైదిబై నేనిప్పుడు అదివరకటి ఇంట్లో లేను. అడ్రస్ మారింది. ఇప్పుడు మా ఇంటి నంబరు 6-3-8-13-269-238- **KHN-SHL** ఆ తర్వాత... ఆ తర్వాత సారీ! ఆ తర్వాత మర్చిపోయాను. రెండు నిమిషాలు టైమిస్తే డయిరీ చూసి చెప్పే స్తాను" అన్నాడు బ్రీఫ్‌కేస్ తెరవబోతూ.

 

"అఖ్కర్లేదు'' అంది శ్రీదేవి హడావుడిగా.

''అఖ్కర్లేదా?''

''అఖ్కర్లేదు''

''ఎందుకని? ఓకే...ఓకే. తర్వాత ఇస్తాను! అన్నట్లు ఇవాళ మీ పుట్టినరోజు కదూ! ముందు నన్ను గ్రీటింగ్స్ చెప్పనీండి! హాపీ బర్త్‌డేటూయూ..హాపీ బర్త్‌డే టూయూ...మెనీ హాపీ రిటర్న్సాఫ్‌దిడే టూయూ"

కల్నల్‌కి తిక్క పూర్తిగా రేగిపోయింది. ముందు ఆ బర్త్‌డే స్లోగన్స్ కట్టించెయ్యకపోతే కోపంతో తనకి పిచ్చెక్కడంఖాయమని అనుమానం వచ్చేసింది.

"స్టాప్ దిస్ నాన్సెన్స్" ఇల్లెగిరిపోయేలా అరచాడు.

''అలా అరవద్దని ఓసారి చెప్పాను గదండీ! నాకు గుండె దడ వస్తుంది. మీకిందాక చెప్పాను కదా–నేను సెవెన్త్‌క్లాస్ చదివేటప్పుడు మా హిందీ మాష్టారు..."

''అయ్‌సే షటప్" పిస్టల్ కిటికీలోంచి గాలిలోకి పేలుస్తూ అన్నాడు.

అందరూ అదిరిపడ్డారు.

ధనుంజయ్ నిశ్శబ్దం అయిపోయాడు.

''నిజం చెప్పు! ఎవడివి నువ్వు ?" అన్నాడు కల్నల్ పిస్టల్ ఆతని గుండెలకు గురిపెట్టి.

"అదేమిటి ? చెప్పాను కదా! నేను రచయిత ధనుంజయ్‌ని" ఆశ్చర్యంగా అన్నాడతను.

''నాన్సెన్స్" మళ్ళీ అరిచాడు కల్నల్.

''ఏమిటి నాన్సెన్స్ ?''

''నువ్ చెప్పేదంతా నాన్సెన్స్''

''ఎందుకని ?"

''రచయిత ధనుంజయ్ ఇడుగో వీడు'' సింహాద్రిని చూపిస్తూ అన్నాడు కల్నల్.

''వ్వాట్ ?" అదిరిపడ్డాడుధనుంజయ్.

''యస్! రచయిత ధనుంజయ్ వీడు"

''ఇంపాజిబుల్ ! ఇందులో ఏదో మోసంఉంది. రచయితధనుంజయ్‌నినేను"

కల్నల్‌కి చిరాకు పుట్టుకొచ్చింది.

సర్వీస్ మొత్తంలో నాలుగు యుద్ధాల్లో తను పాల్గొన్నాడు గానీ ఎప్పుడూ ఇంతటి క్లిష్టమయిన పరిస్థితి రాలేదు.

''బేబీ" నెమ్మదిగా పిలిచాడాయన.

''యస్ డాడీ!"

"అసలీ ధనుంజయ్ పేరుగల రచయితలెంతమంది ఉన్నారు?''

"ఎందుకు డాడీ ?''

''ఒక్కొక్కరినీ వెదికి కాల్చడం కంటే అందరినీ పోగుజేసి ఒకచోట వరుసగా నిలబెట్టి కాల్చేస్తే బులెట్స్ వేస్ట్ కావుకదా! బైదిబై ఇప్పుడు బులెట్ ధరలు పెరిగిపోయాయ్. నీకు తెలుసా ?"

''తెలీదు డాడీ! ఎంత పెరిగాయ్?"

''ఫిఫ్టీ పరసెంట్!కెన్‌యూ ఇమేజిన్"

''మైగాడ్!"

"స్టిప్‌రైజ్" అన్నాడు చిరంజీవి.

కల్నల్ మెచ్చుకోలుగా చిరంజీవి వేపు చూశాడు.

"ఎకానమీ ఈజ్ ది నీడ్ ఆఫ్ ది అవర్" అన్నాడు చిరంజీవి మరింత ఉత్సాహంగా.

"ఎగ్జాక్ట్‌లీ" అన్నాడు కల్నల్.

శ్రీదేవి కోపంగా సింహాద్రి దగ్గరకు నడిచింది.

"ఎవర్నువ్వు?" అంది అనుమానంగా.

"నిజం చెప్పేస్తాను" అన్నాడు సింహాద్రి.

"రెండు నిమిషాలు టైమిస్తున్నాను" అన్నాడు కల్నల్.

"దేనికి?" అడిగాడు సింహాద్రి.

"ఇద్దరిలో ఎవరు ఒరిజినలో ప్రూవ్ చేసుకోడానికి"

"ఎలా ప్రూవ్ చేసుకోవడం?" భయంగా అడిగాడు ధనుంజయ్.

"అదంతా నాకు తెలీదు! ఇప్పుడు టైమ్ పన్నెండూ నలభై రెండు నిమిషాలు" అన్నాడు కల్నల్.

"ఒకవేళ ఇద్దరూ ప్రూవ్‌చేసుకోలేక పోతే?" అడిగాడు చిరంజీవి.

"ఒకే బులెట్‌తో ఇద్దరి పనీ పూర్తవుతుంది! నిజానికి నేనదే జరగాలని కోరుకుంటున్నాను. బులెట్స్ ధర ఎంత పెరిగిపోయిందో నీకు చెప్పాను కదూ?"

"అవునండీ! ఫిఫ్టీ పర్సెంట్ రైజ్"

"కరెక్ట్! టైమ్ పన్నెండూ నలభై మూడు" అన్నాడు కల్నల్ టైమ్ చూసుకుని.

సింహాద్రికి చెమటలు పట్టేస్తున్నాయ్. ధనుంజయ్ పరిస్థితి మరింత ఘోరంగా ఉంది. ఏ క్షణంలోనయినా స్పృహ తప్పేట్లున్నాడు.

"పన్నెండూ నలభై నాలుగు" అన్నాడు కల్నల్ పిస్టల్ పైకి తీస్తూ.

"ఓ మాగజైన్‌లో నా ఫొటో వుండాలి. చూస్తాసుండండి" అంటూ తన బ్రీఫ్‌కేస్ తెరిచాడు ధనుంజయ్.

"శ్రీదేవిగారూ" నెమ్మదిగా మాట్లాడు సింహాద్రి.

"ఏమిటి?"

"నేను ధనుంజయ్‌ని కాదు"

"మైగాడ్"

"మైగాడ్ కూడా కాదండీ! నా పేరు సింహాద్రి"

"సింహాద్రా?" ఆశ్చర్యంగా అంది శ్రీదేవి.

"సింహాద్రా?" ఆశ్చర్యంగా అడిగాడు కల్నల్. "ఈ పేరెక్కడో విన్నట్లుందే" ఆలోచిస్తూ అన్నాడు.

"వినేవుంటారండీ! నా పేరు కూడా అదే" అన్నాడు సింహాద్రి.

"షటప్" అన్నాడు కల్నల్.

"మోసం! ఇంపరసనేషన్" అంది శ్రీదేవి కోపంగా.

ధనుంజయ్‌కి పరిస్థితి అర్థమయిపోయింది.

తనకంటే ముందే మరొకడు తన పేరుతో శ్రీదేవి బర్త్‌డే పార్టీకొచ్చి హోరాహోరీ యాక్షన్ చేసేస్తున్నాడన్న విషయం చాలా చిరాకు కలిగించింది.

"దిసీజ్ టెరిబుల్" అన్నాడు కల్నల్‌తో.

కల్నల్ శ్రీదేవి వేపు చూశాడు. శ్రీదేవి సింహాద్రివేపు చూసింది. సింహాద్రి చిరంజీవి వేపు చూశాడు. చిరంజీవి కల్నల్‌వేపు చూశాడు.

"వెంటనే పోలీసులను పిలిపించండి" అన్నాడు ధనుంజయ్.

"పోలీసులా?" అడిగాడు చిరంజీవి.

"అవును"

"పోలీసులెందుకు?"

"ఎందుకేమిటి? ఇది చీటింగ్ కింద వస్తుంది. సెక్షన్ ఐ.పి.సి. 420"

"రాదు" అన్నాడు చిరంజీవి.

"రాదా?" కోపంగా అడిగాడు ధనుంజయ్.

"ఏమాత్రం రాదు"

"ఎందుకని?"

"ఎందుకంటే ఇది చీటింగ్ కాదు కాబట్టి"

"నీకెలా తెలుసు?"

"నేను ఓ లాయరు ఇంటి పక్కన

 

కొన్నాళ్ళు అద్దెకున్నాను"

"ఆల్ రైట్! సెక్షనేదయినా కానీ! ముందు వాడిని అరెస్ట్ చేయాలి"

"నాట్ నెసెసరీ"

కల్నల్ కి పిచ్చెక్కిపోతోంది.

"స్టాప్ దిస్ నాన్సెన్స్" అంటూ అరచాడు గట్టిగా.

ధనుంజయ్ అదిరిపడ్డాడు.

"మళ్ళీ మీరేనా అరచింది?" అన్నాడు గుండెలు చేత్తో పట్టుకుని కల్నల్ వంక చూస్తూ.

"అవును"

"మీకు చెప్పానుగదండీ అలా అరవ గూడదని! చిన్నప్పుడు – అంటే సెవెన్త్ క్లాసులో మా హిందీ మాష్టారు నేను కాపీ కొడుతూండగా చూసి.."

"షటప్" మళ్ళీ పిస్టల్ పైకి తీసి అరచాడు కల్నల్.

అంతా నిశ్శబ్దం అయిపోయింది.

కల్నల్ శ్రీదేవివంక చూసాడు.

"ఏం బేబీ? పోలీసులను పిలిచి వీడిని అప్పగిద్దామంటావా?" సలహా అడిగాడు.

"ఏయ్ మిస్టర్" సింహాద్రి వంక చూస్తూ పిలిచింది శ్రీదేవి.

"ఏమిటండీ"

"ఎందుకీ నాటకమాడావ్ నువ్వు?"

సింహాద్రి ఈ అవకాశం కోసమే చాలా సేపటినుంచీ ఎదురుచూస్తుండడంవల్ల అడగగానే ఠకీమని అందుకున్నాడు.

"అసలు జరిగిందేమిటంటేనండీ— మీరు రాసిన లెటరు, పంపిన ఫొటో ధనుంజయ్ ఒరిజినల్ అడ్రస్ ప్రకారం నాకు అంటే మా రూమ్‌కి వచ్చింది...."

"సైలెన్స్" సింహాద్రివంక చూస్తూ అరచాడు కల్నల్.

"వీడికి పిచ్చెక్కినట్లు నాకు చాలా అనుమానంగా ఉంది" అన్నాడు శ్రీదేవితో.

"అబ్బేలేదండీ! యూ ఆర్ మిస్టేకన్" అన్నాడు చిరంజీవి.

"డోంటాక్ నాన్సెన్స్"

"సంగతేమిటంటే అదివరకు ఈ రచయిత ధనుంజయ్ ఉన్న ఇంట్లో సింహాద్రి అద్దెకుదిగాడండి! దిగాక శ్రీదేవి గారు ధనుంజయ్‌కి పంపిన ఫొటో వీడి చేతిలోపడిందంతే! ఆ ఫొటోచూసి శ్రీదేవి గారిని గాఢంగా ప్రేమించాడండీ! ఆమె ప్రేమను పొందడానికి వేరే మార్గం లేక ఇలా తనే ధనుంజయ్‌గా యాక్షన్ చేశాడండీ"

"వ్వాట్? ఈ డెకాయిట్ మా బేబీని ప్రేమించాడా?"

"నేను డెకాయిట్‌కాదండీ! క్రాఫ్ చెదిరిపోయింది. అంతే!"

"టు హెల్ విత్‌యువర్ క్రాఫ్. నువ్వు మా బేబీని ప్రేమించావా?"

"అబ్బే. అది మిమ్మల్ని చూడక ముందు సంగతండి"

ధనుంజయ్ ఇంక ఆలస్యం చేయలేక పోయాడు.

"ఇంకా చూస్తారేమిటి? ముందు అర్జంటుగా పోలీసులకు ఫోన్ చేయండి! మీ ఇంట్లో ఫోన్‌లేదూ?" కల్నల్‌నడిగాడతను.

కల్నల్‌కి ఆ ప్రశ్నతో వళ్ళు మండి పోయింది.

"మిస్టర్! నువ్ మేడమీదకు పద ముందు" అన్నాడు కర్కశంగా.

"నేనా?"

"అవును"

"ఎందుకు?"

"నిన్ను ఇక్కడ షూట్ చేస్తే ఫర్ని

చర్ పాడవుతుంది''

''వ్వాట్?'' అదిరిపడ్డాడు ధనుంజయ్ "నన్ను షూట్ చేస్తారా?"

"అవును!''

''నేనెవరనుకుంటున్నారు? ప్రఖ్యాత రచయిత ధనుంజయ్‌ని"

"అందుకే షూట్ చేయడం. బైదిబై - నీకు ఏదంటే ఇష్టం? పిస్టలా, రివాల్వరా, త్రీనాట్ త్రీ రైఫిలా? దేంతో కాల్చమంటావో నువ్వే చెప్పు"

"ఇదన్యాయం! నన్నెందుకు కాలుస్తున్నారు?"

"లేపోతే హిప్నాటిజం మీద నవలలు రాసి మా శ్రీదేవి బ్రైన్ పొల్యూట్ చేసేస్తావా?"

"అందులో తప్పేముంది? అయ్ లైక్ హిప్నాటిజం! అయ్ లవ్ హిప్నాటిజం! అయ్ ఎడోర్ హిప్నాటిజం! అండ్ అయ్ ప్రాక్టీస్ హిప్నాటిజం"

"హిప్నాటిజం - గిప్నాటిజం అంతా ట్రాష్'' అరచాడు కల్నల్.

"అవునండీ! అంతా ట్రాష్" అన్నాడు చిరంజీవి.

"బోగస్" అన్నాడు కల్నల్.

"రబ్బిష్'' అన్నాడు చిరంజీవి.

''నేనొప్పుకోను'' అన్నాడు ధనుంజయ్.

కల్నల్‌కి అప్పటికప్పుడే అతనిని కాల్చిపారేద్దామన్నంత కోపం వచ్చింది. పిస్టల్ పైకితీశాడు గానీ పెరిగిపోయిన బులెట్స్ ధర గుర్తుకొచ్చేసరికి కొంచెం తగ్గాడు. ఇలా ఎవరికివారిని విడివిడిగా కాలుస్తూకూర్చుంటే బులెట్స్ ఖర్చు తడిసి మోపెడవుతుంది.

"అయితే నన్ను అర్జంటుగా హిప్నటైజ్ చెయ్యి చూద్దాం" అతని దగ్గరగా నడుస్తూ అన్నాడు కల్నల్.

''ఇప్పుడా?''

''ఈ క్షణంలో''

''ఆల్‌రైట్'' ఉత్సాహంగా అన్నాడు ధనుంజయ్. "ఇప్పుడే స్టార్టుచేస్తాను. మీరు నావంకే చూస్తూండండి'' అన్నాడు అతని కళ్ళల్లోకి చూస్తూ.

''చూస్తున్నాను'' అన్నాడు కల్నల్.

''నా కళ్ళలోకే చూడండి''

''చూస్తున్నాను''

''మీరు నావంకే చూస్తున్నారు-మీరు నావంకే చూస్తున్నారు - నావంకే చూస్తున్నారు" అన్నాడు ధనుంజయ్ కల్నల్ కళ్ళలోకి గుచ్చిగుచ్చి చూస్తూ.

"అవును చూస్తున్నాను. ఇందాకే చెప్పానుగా ఆ విషయం?" చిరాగ్గా అన్నాడు కల్నల్.

"మీరు నిద్రపోతున్నారు-నిద్రపోతున్నారు-నిద్రపోతున్నారు" తిరిగి అన్నాడతను.

''ఏత్సావ్! నేను మేలుకునే ఉన్నాను" అన్నాడు కల్నల్ కోపంగా.

"మేలుకునే ఉన్నారా?" ఆశ్చర్యంగా అడిగాడు ధనుంజయ్.

"అవును!"

''కొంచెం కూడా నిద్ర పట్టటంలేదా?"

''అరవీసం కూడా లేదు''

''పోనీ మగతగా ఉన్నట్లనిపిస్తోందా?"

''రవ్వంత కూడా అనిపించటం లేదు''

''అయ్‌సీ" అన్నాడు ధనుంజయ్!

అతనికి ఎక్కడలేని చిరాకూ పుట్టుకొచ్చింది. తను చాలామందిని హిప్నటైజ్ చేశాడుగానీ ఎక్కడా ఇలా దెబ్బతిన లేదు. కిక్కురుమనకుండా హిప్నటైజ్

అయిపోయి చెప్పినపనల్లా చేసేవాళ్ళు.

"ఆల్‌రైట్" అన్నాడు ధనుంజయ్. అని మరింత తీక్షణంగా కల్నల్ కళ్ళల్లోకి చూస్తూ "మీరు కళ్ళుమూసుకున్నారు...కళ్ళు మూసుకున్నారు...కళ్ళు మూసుకున్నారు" అన్నాడు.

"మూసుకోలేదు. తెరచే ఉన్నాను. కనబడ్డంలా?" అడిగాడు కల్నల్.

"ఎందుకని మూసుకోలేదు?"

"ఎందుకు మూసుకోవాలి?"

"ఇలా మీరు ఎదురుప్రశ్నలేయకూడదు" అన్నాడు ధనుంజయ్ ఉక్రోషంగా.

"నా యిష్టం! నేను వేస్తాను"

"ఇలా మీరు ఎదురుతిరగ్గూడదసలు"

"నా యిష్టం! నేను తిరుగుతాను"

ధనుంజయ్‌కి కోపంవచ్చిందికాని అణిచేసుకున్నాడు.

"ఆల్‌రైట్! ఇంకోసారి ట్రైచేస్తాను" అన్నాడు.

"మీరు నిద్రపోతున్నారు—నిద్రపోతున్నారు—నిద్రపోతున్నారు"

"పిచ్చివాగుడు వాగకు! నేనేం నిద్రపోవటంలేదు"

"అలా అయితే ఇంపాజిబుల్" అన్నాడు ధనుంజయ్.

"ఏమిటి ఇంపాజిబుల్?"

"మిమ్మల్ని హిప్నటైజ్ చేయడం సాధ్యంకాదు!"

"ఏం...ఎందుకని?"

"హిప్నాటిజంకి లొంగనివాళ్లు చాలా మంది ఉంటారు. అందులో మీరొకరు"

"ఎందుకని లొంగరు వాళ్లు?"

"అదంతేనండీ! దటీజ్ సైంటిఫిక్ లా"

"ఆల్‌ట్రాష్" అరచాడతను.

"ట్రాష్‌కాదు"

"ట్రాష్‌కాకపోతే రబ్బిష్! అదీగాకపోతే ఇంకోటి"

"ఆల్‌రైట్! మీ యిష్టం. ఎవరి అభిప్రాయం వాళ్ళది"

"అవునా. అందుకే నిన్ను మేడ మీదకు రమ్మనేది"

"మేడమీదకెందుకు? నా నవలలమీద మీ అభిప్రాయం చెప్పండి చాలు! దేర్ ఎండ్స్ ది మేటర్!"

"నా అభిప్రాయం అదే! నిన్ను మేడ మీదకు తీసుకెళ్లి కాల్చటం"

"అయితే మేము ఇంక వెళ్లిపోవచ్చు కదండీ?" అడిగాడు సింహాద్రి.

"మీరెక్కడికి?"

"మా ఊరికండీ"

"పోలీసులు రాందే ఎట్లా వెళ్తారు. నోనో ఇక్కడినుంచి కదలడానికి వీల్లేదు" అంటూ ఫోన్‌తీసి డయల్ చేశాడు. "హలో...పోలీస్! అర్జంటుగా బాంబ్ నిలయానికిరండి! ఇక్కడ ఇద్దరు పిచ్చివాళ్లు ఉన్నారు"

సింహాద్రి దిగులుపడిపోయాడు.

"మమ్మల్ని క్షమించండిసార్! రచయిత వేషాల్లో ఇంత రిస్కు ఉంటుందని తెలీదు. తెలుస్తే వేసేవాళ్ళంకాదు! ఇంకోటేదేనా సెలక్టు చేసుకునేవాళ్ళం" అన్నాడు దీనంగా.

"షటప్"

సరిగ్గా అప్పుడే డోర్ తెరచుకుని లోపలికొచ్చాడు విశ్వనాథం. అతనివెనుకే భావయ్య!

సింహాద్రీ, చిరంజీవీ ఇద్దరూ ఖంగారు పడిపోయారు.

"ఇప్పుడేమంటావురా! పిచ్చి ఉన్నట్లు యాక్షన్ చేస్తావా? చెయ్‌రా! చెయ్! ఇదిగో భావయ్య ఎవరో తెలుసా? మేజిస్ట్రేటు!

నిండిపోయి 'హౌస్‌ఫుల్' బోర్డ్ పెట్టాల్సి వస్తుంది.

"హూ ఆర్ యూ?" అన్నాడతను విశ్వనాథం వేపు చూసి.





నీకు నిజంగానే పిచ్చి ఉందని సర్టిఫికెట్ ఇవ్వడానికొచ్చాడు"

కల్నల్‌కి సహనం పూర్తిగా చచ్చిపోయింది.

ముక్కూ మొఖం, అడ్రసూ తెలీని జనం అంతా ఇష్టమొచ్చినట్లు నటించ డానికీ, వాగడానికీ తన ఇంటినే ఎందుకు ఎన్నుకుంటున్నారో ఏమాత్రం అర్థం కావడం లేదు. తనిలా ఊరుకుంటే కాసేపట్లో ఇలాంటి పిచ్చివాళ్ళతో ఇల్లు

"నువ్వెవరు?" అన్నాడు విశ్వనాథం ఎదురు తిరిగి.

దాంతో కల్నల్ కోపం బోర్డర్స్ దాటేసింది.

"బ్లడీఫూల్! నా ఇంట్లో పర్మిషన్ లేకుండా జొరబడింది కాకుండా,

'నువ్వెవరు' అని నన్నే అడుగుతావా? గెటవుట్''

భావయ్య కంగారుపడ్డాడు.

''ఏమి విశ్వనాధం! నిండా తప్పు సేస్తివి. 'సారీ' సెప్పు పెద్దసార్ వాడికి'' అన్నాడు.

''ఎందుకు చెప్పాలి? నేను చెప్పను''

''చెప్పకపోతే బయటకు నడవండి! లేకపోతే గెంటాల్సి వస్తుంది''

విశ్వనాధం అదేమీ వినిపించుకోలేదు.

''ఇప్పుడు మా సింహాద్రి కండిషన్ చూశారుగా! త్వరగా సర్టిఫికెట్ రాయండి'' అన్నాడు భావయ్యతో.

''వాట్ సర్టిఫికెట్?'' అరచాడు కల్నల్.

''ఆ సింహాద్రికిదా సైకలాజికల్ కండిషన్ చాలా ప్రమాదంలో ఉంటాది. అదిదా సర్టిఫికెట్ ఇస్తుండాను''

అని భావయ్య అక్కడే సోఫాలో కూర్చుని సర్టిఫికెట్ రాయడం ప్రారంభించాడు.

''దిసీజ్ టు సర్టిఫై....''

''గెటవ్'' అన్నాడు కల్నల్ తన పిస్టల్ భావయ్యకు గురిపెట్టి.

అది చూడగానే భావయ్య పెన్ను, పుస్తకం కింద పడిపోయినయ్.

''వ్వావ్వావ్వా వ్వా...'' అన్నాడు లేచినిలబడి.

''ఇద్దరూ బయటకు నడవండి''

విశ్వనాధం ఇలా లాభంలేదని కల్నల్‌ని బతిమాలాడు.

''ఒక్క సర్టిఫికెట్ రాయనీండి సార్''

''వాట్ సర్టిఫికెట్?''

''వీడికి పిచ్చి ఉందని'' అన్నాడు సింహాద్రిని చూపిస్తూ.

''ఉంటే సర్టిఫికెట్ ఎందుకు?''

''ఆ సర్టిఫికెట్ ఉంటే వాడిచేతికి ఆస్తి ఇవ్వాల్సిన అవసరం ఉండదు''

''ఆస్తా? ఆస్తేమిటి?''

ఆ మాటతో సింహాద్రి అదిరిపోయాడు. చిరంజీవి వంక ఖంగారుగా చూశాడు.

''ఆ సర్టిఫికెట్ చెల్లదు'' అన్నాడు చిరంజీవి గంభీరంగా.

''ఎందుకు చెల్లదు?''

''ఎందుకంటే ఆ సర్టిఫికెట్ ఇచ్చే వాళ్ళ మానసిక పరిస్థితి బాగుండాలి కనుక!''

''అంటే నాకు పిచ్చి ఉండాదంటావా?'' కోపంగా అన్నాడు భావయ్య.

''అవును! లేపోతే వీడికి పిచ్చి ఉందని సర్టిఫికెట్ ఇస్తారా ఎవరయినా?''

''ఏమయ్యా ఏమిటి సెప్తావు? నువ్వే వాడికి పిచ్చి ఉండాదని అన్నావు'' అన్నాడు భావయ్య.

''డాడీ! ఆ రోజు ఇతనినే సింహాద్రి హిప్నటైజ్ చేసి రన్నింగ్‌రేస్ పెట్టాడు'' అంది శ్రీదేవి.

కల్నల్ ఆశ్చర్యపోయాడు.

''రన్నింగ్ రేసా?''

''అవును డాడీ''

''రన్నింగ్‌రేసేమిటి?''

''ఈయనా, సింహాద్రీ, చిరంజీవి గారూ, కుక్కా...''

''కుక్కా?''

''యస్—ఎ కంట్రీడాగ్''

''కంట్రీ డాగ్ రన్నింగ్ రేస్ చేస్తుందా?''

''చేసింది డాడీ''

''ఇక్కడేమయినా కుక్కలు వున్నాయా'' కుక్క విషయం గుర్తుకి రాగానే భయంగా అడిగాడు విశ్వనాధం.

"ఎందుకు? రేస్ స్టార్ట్ చేస్తావా?'' అడిగాడు కల్నల్.

"భావయ్యగారూ! ముందు మీరు సర్టిఫికెట్ రాయండి'' అన్నాడు విశ్వనాథం.

"విట్‌నెస్ ఎవరుంటారు?''

"ఎవరో ఒకరుంటారు. ముందు రాయండి''

"ఆయన వద్దంటున్నాడుగా?'' అన్నాడు భావయ్య కల్నల్‌ని చూపుతూ.

"సార్! కొంచెం రాయసీండి! ఇది చాలా అర్జంట్"

"వాట్ అర్జంట్?''

"సర్టిఫికెట్ అర్జంట్"

"వాట్ సర్టిఫికెట్?''

"వీడికి పిచ్చిఉందని"

"నా యిల్లు అడ్డమైన రాస్కెల్స్‌కి సర్టిఫికెట్లు రాసుకునే సత్రంకాదు. గెటవుట్. రెండు నిమిషాల్లో కాంపౌండ్ బయట ఉండాలి! లేపోతే ఇద్దరూ అవుట్. ఇప్పుడు టైము ఒంటిగంటా ఇరవై రెండు నిమిషాలయింది'' అన్నాడు కల్నల్ టైమ్‌చూసుకుంటూ.

"సరే. పదండి! బయట రోడ్డుమీద కూర్చుని రాసుకుందాం" అన్నాడు విశ్వనాథం.

"ఏమయ్యా! ఏమిటయ్యా సెప్తావు? మేజిస్ట్రేటు రోడ్డుమీద సర్టిఫికెట్లు రాస్తునా? నిండా బుద్ధిలేదేమి?''

"ఫరవాలేదండీ ఈ ఒక్కసారికీ"

"ఒంటిగంటా ఇరవై మూడు" అన్నాడు కల్నల్.

"అప్పుడే ఒక నిమిషం అయిపోయిందయ్యా'' గాబరాగా అన్నాడు భావయ్య. ఇంతలో హడావుడిగా నలుగురు కానిస్టేబుల్స్, ఓ సబ్‌ఇన్‌స్పెక్టర్ వచ్చేశారు లోపలికి.

"గుడ్‌మార్నింగ్" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"గుడ్‌మార్నింగ్" అన్నాడు కల్నల్.

"ఎవరు పిచ్చివాళ్లు ఇందులో"

"వీళ్ళిద్దరూ" అన్నాడు కల్నల్ విశ్వనాథాన్ని, భావయ్యను చూపుతూ-ముందు వాళ్ళ పీడ వదిలించుకోవాలని చాలా కోరిక కలిగిందతనికి. ఇద్దరూ ఉలిక్కిపడ్డారు.

"మేమా?'' అన్నాడు విశ్వనాథం.

"ఏమయ్యా సెప్తావు మేము పిచ్చివాళ్ళమా?" అన్నాడు భావయ్య.

ఇన్‌స్పెక్టర్ కానిస్టేబుల్స్‌కి సైగ చేశాడు.

వాళ్లు ఇద్దరినీ రెక్కలు విరిచిపట్టుకుని బయటికి ఈడ్వటం మొదలుపెట్టారు.

"ఏమయ్యా ఏమిసేస్తారు? నేనుదా పిచ్చివాడినా? మేజిస్ట్రేటునయ్యా''

"అందరూ ఇలాగే చెప్తార్లే. నడు నడు" అన్నాడు కానిస్టేబుల్.

"అదేమయ్యా అట్లాఅంటావు రియల్ మేజిస్ట్రేటుని''

"అందుకే పద. అక్కడ కేసులు చూద్దూగాని''

"నిజంగానండీ! మేము పిచ్చివాళ్ళం కాదు" అన్నాడు విశ్వనాథం.

"కాపోతే మరీ ఇంటికెందుకొచ్చారు?"

"ఇదిగో ఈ న్యూస్‌పేపర్లో ఈ అమ్మాయి ఫొటో వేసి ఇవాళ బర్త్‌డే అని రాశారు. తప్పక మా సింహాద్రి ఇక్కడ ఉంటాడనివచ్చాం"

"మీ సింహాద్రా? ఎవరతను?''

"అడుగో అతను"

"అతను నీకేమవుతాడు?"

"నాకు వరుసకు మేనల్లుడు"

"వాట్ మిస్టర్! వీడు చెప్పేది నిజమేనా?" సింహాద్రినడిగాడు ఇన్‌స్పెక్టర్.

"అంతా అబద్ధమండీ! అసలింత వరకూ నేనాయన మొఖమే చూడలేదు" ఇన్‌స్పెక్టర్ విశ్వనాథం వంక చూశాడు.

"ఒరేయ్! సింహాద్రీ! ఏమన్నావురా? నేనెవరో తెలీదా నీకు?" కోపంగా అరచాడు విశ్వనాథం.

"పాపం! సివియర్ మెంటల్ షాక్ తగిలి ఉంటుంది. అందరినీ మేనల్లుళ్ళు అనుకుంటున్నాడు" అన్నాడు చిరంజీవి.

ఇన్‌స్పెక్టర్ ఇంకొక్క మాట కూడా మాట్లాడకుండా వాళ్ళిద్దరినీ ఈడ్చుకుంటూ బయటికెళ్ళిపోయాడు.

కల్నల్ తేలిగ్గా గాలి పీల్చుకున్నాడు.

"మీకో విషయం అర్జంటుగా మనవి చేయాలని అనుకుంటున్నామండీ" అన్నాడు చిరంజీవి కల్నల్‌తో.

"ఏమిటది?"

"వీడు ప్రస్తుతం ఓ నవల రాస్తున్నాడండీ"

"అదేమిటి? వీడసలు రచయిత కాదుగా?"

"కాపోయినా సరే! రాస్తున్నాడండీ!"

కల్నల్‌కి ఆశ్చర్యంగా ఉంది.

"హౌ ఇటీజ్ పాజిబుల్? రచయిత కాన్దే ఎలా రాస్తారు?"

"దానిదేముందిసార్! రచయితలు కూడా మొదటి నవల రాసే ముందు మామూలు మనుషులే కదండీ"

కల్నల్ ఆలోచించాడు.

"అఫ్‌కోర్స్! వాళ్లూ మనుష్యజాతికి చెందినవారే! కరెక్ట్! అయితే ఇప్పుడేమంటావ్?"



"వీడు రాయబోయే నవలలో ఈ హిప్నాటిజం గిప్నాటిజం, మంత్రాలూ మాయలూ, అంతా ట్రాష్ అని మెసేజ్ ఇస్తున్నాడండీ"

"అవునండీ! ఆ నవల మీకే అంకితం ఇవ్వాలని కూడా అనుకుంటున్నానండీ" తనూ అందుకుంటూ అన్నాడు సింహాద్రి.

కల్నల్ మెత్తబడ్డాడు.

"ఓకే! మీ విషయం తర్వాత ఆలోచిస్తాను. మిస్టర్ ధనుంజయ్.. మేడమీదకు పద! అన్నట్లు బేబీ! నేను వీడిని రెండు నిమిషాల్లో కాల్చేసి కిందకొస్తాను. ఈలోగా నా జోక్‌బుక్ రడీగా ఉంచు! ఇలాంటివాళ్ళను కాల్చినప్పుడు ఓ జోక్ చదువుతేగాని మూడ్‌రాదు మళ్ళీ"

ధనుంజయ్ భయపడిపోయాడు.

"బాబోయ్! ఇంకెప్పుడూ నవలలు రాయను. నన్నొదిలేయండి"

ఈలోగా శ్రీదేవి ఆలోచనల్లోనుంచి బయటపడింది.

"డాడీ"

"యస్ బేబీ"

"నేను సింహాద్రిని మారేజ్ చేసుకుంటాను డాడీ.

"వాట్ .... ఈ డెకాయిట్‌నా?"

సింహాద్రికి ఆ కొటేషన్ నచ్చలేదు.

"నేను డెకాయిట్ కాదండీ! జర్నీలో క్రాఫ్ చెదిరిపోవడం వల్ల అలా కనబడుతున్నాను. అద్దం, దువ్వెనా ఇప్పిస్తే.."

"షటప్" అరచాడు కల్నల్ ఇలాంటి దొంగవేషాలేసేవాడిని పెళ్ళి చేసుకుంటావా బేబీ!" ఆశ్చర్యంగా అడిగాడు కల్నల్.

"అది వాడి ప్రొఫెషన్ కాదండీ! జస్ట్ పార్ట్‌టైం. ఒరిజినల్‌గా వాడు బిజిలీ అండ్ బిజిలీ కంపెనీలో ఎకౌంటెంట్" అన్నాడు చిరంజీవి.

"ఇలాంటివాడిని ఎకౌంటెంట్ గా పెట్టుకుని ఆ కంపెనీ ఎలా మూత పడలేదో నాకర్థం కావటంలేదు" అన్నాడు కల్నల్.

"ఇందులో అర్థం కాపోడానికేముం దండీ! వీడు ఎక్కువగా అబ్సెంట్ అవు తుంటాడు కదా?"

కల్నల్‌కి అర్థమయింది.

"దట్ మస్ట్‌బీ ది రీజన్" అన్నాడు తలపంకిస్తూ.

"అవునండీ! దటీజ్ ఓన్లీ ది రీజన్" అన్నాడు చిరంజీవి.

"అయినాగాని ఆఫ్టరాల్ ఓ బిజిలీ అండ్ బిజిలీకంపెనీ ఎకౌంటెంట్‌ని నువ్వు పెళ్ళి చేసుకోవడం నాకిష్టంలేదు" అంతలోనే తేరుకొని నిష్కర్షగా చెప్పేశాడు కల్నల్.

సింహాద్రి నీరుకారిపోవాలనుకున్నాడు గానీ, అలా నీరుకారిపోతే ఫారిన్‌తివాచీ తడచిపోవటం, దానివల్ల కల్నల్‌కి మళ్ళీ తిక్కరేగి పిస్టల్‌ని తనవేపు తిప్పడం జరుగుతుందని ఆగిపోయాడు.

"కాని డాడీ.... అతనికింకా మంచి ఉద్యోగం దొరుకుతుందేమోకదా" అంది శ్రీదేవి సర్దిచెప్పడానికి ప్రయత్నిస్తూ.

"ఆ!అవునండీ! మా ఫ్రెండ్ ఒకడు ఇలాగే అప్పడాల కంపెనీలో పద్దులురాసే వాడండీ! అలాంటి వాడు సడెన్‌గా అయ్.ఏ.యస్.కి సెలక్టయిపోయాడు. అంచేత మనం ఎవరి భవిష్యత్తు ఎలా వుంటుందో చెప్పలేమండీ" అన్నాడు చిరంజీవి.

"ట్రాష్!" అరచాడు కల్నల్ "నేన్నమ్మను!"

"మొదట్లో నేనూ నమ్మలేదండీ! కానీ వాడు ఆర్డర్స్ తీసుకొచ్చి నాకు చూపించి ఏడ్చాడండీ!"

"ఏడ్చాడా?"

"అవును..."

"ఏడవటం ఎందుకు?"

"ఆనందం పట్టలేకండీ"

"అయ్.ఏ.యస్.?"

"అవునండీ!"

"వాడిపేరేమిటి?"

"పేరా.. పేరూ..ఛిస్ఫే కపాడియా"

"ఎక్కడ వర్క్ చేస్తున్నాడో చెప్పు. నువ్వు చెప్పేది నిజమో కాదో ఇప్పుడే తెల్చుకుంటాను" అన్నాడు కల్నల్ రిసీవర్ చేతిలోకి తీసుకుంటూ.

చిరంజీవి ఖంగారుపడ్డాడు.

"అబ్బే వాడిప్పుడు ఎక్కడా పని చేయటంలేదండీ!"

"ఏం! ఎందుకని?" అనుమానం ఎక్కువయిపోయింది కల్నల్‌కి.

"ఎందుకంటేనండీ – పాపం వాడు చచ్చిపోయాడు."

"వ్వాట్? చచ్చిపోయాడా?"

"అవున్సార్. పూర్ ఫెలో! ఆర్డర్స్ తీసుకుని రైల్లో మసూరీ వెళుతుంటే ఆ రైలుకి ప్రమాదంజరిగి చచ్చిపోయాడు" కన్నీళ్లు తుడుచుకుంటూ అన్నాడు చిరంజీవి.

"పోతేపోనీ! స్టిల్ అందరూ ఛిస్ఫే కపాడియాలు కాలేరు! దిస్‌ఈజ్ మై ఒపినియన్" అన్నాడు కల్నల్.

"అఫ్‌కోర్స్ – అఫ్‌కోర్స్" అన్నాడు చిరంజీవి ఇంకేమనాలో తెలీక.

"అందులోనూ ఇలాంటి డెకాయిట్స్ ఛస్తే అయ్.ఏ.యస్.కి సెలక్టు కాలేరు. నేను రాసిస్తానలా అని"

"అబ్బే రాయనవసరంలేదండీ! మీ మాటమీద నాకు చాలా గురి"

"అవున్సార్! మీ మాటంటే నాకూ గౌరవం" అన్నాడు సింహాద్రి.

శ్రీదేవికి ఉక్రోషం ముంచుకొచ్చింది. తండ్రిని ఎలా కన్విన్స్ చేయాలో ఏమాత్రం అర్థంకావడంలేదు.

"అవును డాడీ! పాపం ఇతను నన్ను ఎంతగానో ప్రేమించబట్టే గదా ఇంత రిస్క్ తీసుకుని, ఇన్ని వేషాలేశాడు?"

"అఫ్‌కోర్స్! అందులో పాయింటుంది'' ఒప్పుకున్నాడు కల్నల్.

"అంటే ఇంక లైన్ క్లియరే కదండీ" అడిగాడు చిరంజీవి.

''కానీ...'' అన్నాడు కల్నల్.

"అబ్బ! ఇంకేమిటి డాడీ''

"ఆఫ్టరాల్ మూడు వందల యాభయ్ రూపాయలు జీతం తెచ్చుకునే ఎకౌంటెంట్ పక్షి నీకేం సుఖాలు ఇవ్వగలడమ్మా? ఒక పూటే తిండి పెడతాడు"

"నా జీతం మూడు వందల యాభయ్ కాద్సార్ - మూడువందల అరవై" అరచాడు సింహాద్రి

"అహహ్హ" నవ్వాడు చిరంజీవి.

"ఎందుకు నవ్వావ్?" కోపంగా అడిగాడు కల్నల్.

"మీరు మా సింహాద్రిని అండర్ ఎస్టిమేట్ చేశారు"

"అంటే?",

"అసలు వాడెవరనుకుంటున్నారు మీరు?"

"అంటే వీడి అసలు పేరు సింహాద్రి కూడా కాదా?" పిస్టల్ మళ్ళీ చేతిలోకి తీసుకుంటూ అడిగాడు కల్నల్.

"అబ్బె - పేరు సింహాద్రేనండీ! కానీ వీడి ఫైనాన్షియల్ స్టేటస్ మీకు తెలీదు. వీడు లక్షాధికారి. వీడి పేర లక్షల ఆస్తి ఉంది"

"ట్రాష్" అరచాడు కల్నల్.

"ట్రాష్ కాదండీ! వీడికి పాతికేళ్లు వచ్చేవరకూ వీడి ఆస్తికి వీళ్ళ మామయ్యే ట్రస్టీ అండీ. వీడి ఏజ్ ఇప్పుడు ఇరవై

"కానీ డాడీ! అతనికి వాళ్ళ కంపెనీలోనే ప్రమోషన్ వచ్చి మేనేజర్ అయిపోవచ్చుకదా?" అంది మరో పాయింట్ పట్టుకుని.

చిరంజీవి ఠక్కున అందుకున్నాడు.

"అవునండీ! మీకు చెప్పటం మర్చిపోయాను. వీడు ఏ క్షణాన్నయినా మేనేజర్ అయిపోవచ్చు"

"ఎలా అవుతాడు? ఇంత పనికిరాని వాళ్ళు ఎక్కడయినా మేనేజర్లవుతారా?"

"అందరి సంగతి నాకు తెలీదుగానండీ వీడు డెఫినెట్‌గా అవుతాడు"

"ఎందుకని?"

"ఎందుకనంటే...ఆ! వీళ్ళ కంపెనీని మన ప్రభుత్వం తీసేసుకుంటోంది"

"తీసుకుంటే?"

"ప్రభుత్వ రంగ సంస్థల గురించి మీకు తెలీందేముందిసార్? ఆ సంస్థల్లో పెద్ద హోదా ఉన్న ఉద్యోగాలన్నీ ఎందుకూ పనికిరానివాళ్ళకేగా ఇస్తారు?"

"అఫ్‌కోర్ - అఫ్‌కోర్స్" అన్నాడు కల్నల్. అతనికి చిరంజీవి మాటల్లో చాలా నిజం కనిపించింది.

"స్టిల్..." అన్నాడు సింహాద్రి వంక ఓసారి చూసి.

"డాడీ! ఇంకేమీ అడ్డుచెప్పకండి డాడీ ప్లీజ్" అంది శ్రీదేవి.

కల్నల్‌కి శ్రీదేవి చూస్తే జాలివేసింది.

"నువ్వు బాగా ఆలోచించే ఈ నిర్ణయం తీసుకున్నావా బేబీ?" అడిగాడు అనుమానంగా.

అన్న మాటలన్నీ గుర్తుకొచ్చాయ్.

''మరి వాడు సింహాద్రికి పిచ్చి అని సర్టిఫికేట్ ఎందుకు రాయిస్తున్నాడు?''

''ఎందుకంటేనండీ! వాడసలు వీడికి ఒరిజినల్ మామయ్య కాదన్న మాటండీ! కజిన్ మావయ్య. అందుకని వీడికి పిచ్చి అని సర్టిఫికెట్ రాయించి ఆస్తి అంతా తాను కొట్టెయ్యాలని ప్లాన్ వేశాడండీ''

''అయ్‌సీ'' అన్నాడు కల్నల్.

''మరింక ఓకే కదండీ?'' అడిగాడు సింహాద్రి. కల్నల్ సింహాద్రి వేపు చూశాడు. సింహాద్రి శ్రీదేవివేపు చూశాడు. శ్రీదేవి కల్నల్‌వేపు చూసింది.

''ప్లీజ్ డాడీ! కాదనకండి''

''ఆల్‌రైట్!'' అన్నాడు కల్నల్.

అందరి మొఖాలూ వెలిగిపోయాయ్!

''అలాగయితే బర్త్‌డేతోపాటు దండలు మార్చుకునే కార్యక్రమం కూడా సాయంత్రమే కానిచ్చేస్తే సరిపోతుంది. ఏమంటావోయ్ చిరంజీవీ?''

''చాలా సూపర్బ్ ఆలోచనండీ! వాళ్లిద్దరూ ఈడూజోడూ చాలా బాగుంటారు'' అన్నాడు చిరంజీవి.

తనూ ఏదొకటి కల్పించుకుని మాట్లాడితే తనను షూట్‌చేసే విషయం మర్చిపోతాడేమో అని ఆశ పుట్టింది ధనుంజయ్‌కి.

''అవునండీ! చిలకా గోరింకల్లా ఉంటారు'' అన్నాడు మధ్యలో జొరబడి.

కల్నల్‌కు ఠక్కున పంజరం, అందులో నుంచి మాయమయిన చిలుకలు గుర్తుకొచ్చినయ్.

''అయితే అది నీ పనేనన్న మాట'' పిస్టల్ ధనుంజయ్‌కి గురిపెడుతూ అన్నాడు.

''ఏ పనండీ?'' భయంగా అడిగాడు ధనుంజయ్.

''అదే! పంజరం తలుపు తీసి నా చిలకలను వదిలేసింది నువ్వే కదూ?''

''నాకదేం తెలీదండీ'' అన్నాడు గాబరాగా.

''తెలీందే 'చిలకాగోరింకా' అంటూ ఎందుకన్నావ్?''

''మామూలుగా అన్నానండీ''

''ఐ డోంట్ బిలీవ్''

''డాడీ!'' గారాంగా అంది శ్రీదేవి.

''యస్ బేబీ!''

''పార్టీకి టైమవుతోంది''

కల్నల్ టైమ్ చూసుకున్నాడు.

''మైగాడ్! అర్జంటుగా నేను మార్కెట్ కెళ్ళాలి. ఎలా?''

''వెంటనే జీప్‌లో వెళ్దామండీ'' అన్నాడు చిరంజీవి.

''మరి ఈ ధనుంజయ్‌ని షూట్ చేయడం?''

''అది ప్రస్తుతానికి పోస్ట్‌పోన్ చేద్దాం సార్''

కల్నల్ ఓ క్షణం ఆలోచించాడు.

''ఓకే!ఎగ్రీడ్! చూడవోయ్ చిరంజీవీ! బర్త్‌డే ఎరేంజ్‌మెంట్స్ అన్నీ నువ్వే చేసెయ్. పెళ్ళి ఎరేంజ్‌మెంట్స్ నేను చూస్తాను. నీకు హెల్పర్‌గా ఇదిగో ఈ ధనుంజయ్‌ను తీసుకో! అండర్‌స్టాండ్?''

''అండర్‌స్టాండ్ సర్''

''అదీగాక ఆ పంజరంలో నుంచి వదిలేసిన నా చిలకలన్నీ తిరిగి తెచ్చిచ్చే వరకూ వీడిని కాల్చగూడదు మనం''

''అవున్సార్''

''ఆ పని కూడా నువ్వే దగ్గరుండి చేయించు''

''ఆల్‌రైట్ సర్''

కల్నల్ సంతృప్తిగా చిరంజీవి భుజం మీద చరచి బయటకు నడిచాడు. ★

## పొగ తాగినవాడు...

ఎన్నో సిగరెట్ తయారీ కంపెనీలకు ఆలవాలమైన ఇంగ్లండులో ఒకానొకప్పుడు ధూమపానప్రియుల్ని తీవ్రంగా శిక్షించేవారంటే నమ్మశక్యంకాదు. 1565వ సంవత్సరంలో మొట్టమొదటిసారి పొగాకును సర్ జాక హాకిన్స్ ఇంగ్లండుకు తీసుకువచ్చాడు. కానీ ఈ కొత్తపద్ధతి చాలా తీవ్రంగా విమర్శించబడింది.

1604లో మొదటి జేమ్స్‌రాజు పొగాకు వాతకం, ధూమపానం రెండూ మద్యపానమంత చెడ్డవి, శిక్షార్హమైనవని గొడవ చేశాడు. అతనికంటే రెండాకు లెక్కువే చదివిన మైకేల్‌రాజు ఇటువంటి తప్పు మొదటిసారి చేస్తే కొరడాదెబ్బలు, రెండోసారి చేస్తే చెరసాలశిక్ష విధించాలని శాసనం చేశాడు. అంతటితో ఆగకుండా ముక్కుపొడుం పీల్చేవారి ముక్కులు కోసివేయాలని కూడా అన్నాడు.

ఏ రూపంలోనైనా సరే పొగాకును ఉపయోగించడాన్ని గ్రీక్‌చర్చి నిషేధించింది. టెన్ కమాండ్‌మెంట్స్‌తో బాటు పొగాకు వినియోగాన్ని నిషేధిస్తూ ఒక




సాధారణ చట్టాన్ని రూపొందించింది. తూర్పు దేశాలలోని ధూమపానుల స్థితి మరీ ఘోరం. అప్పట్లో పర్షియా, ఇండియాలలో కూడా పొగాకు వాడకందార్లకు శిక్షలుండేవి. టర్కీదేశపు సుల్తాన్ మరీ దారుణమైన శిక్షలు విధించేవాడు. పైపు కాల్చేవారి దవడల్ని సాగదీసి వారినోట్లో పైపును అడ్డంగాపెట్టి వారి మెడలకు పొగాకు కాడలతో పేనిన తాళ్ళనుకట్టి వేలాడదీసేవారు. ఏదైనా శృతి మించితే వికారమే. అతి సర్వత్రవర్జయేత్ అన్నట్లు పరిధిదాటిన ప్రతి విషయం మార్పును కోరుతుంది.

1665లో మాత్రం భయంకరమైన ప్లేగువ్యాధి వచ్చినపుడు దాన్ని అరికట్టేందుకు అప్పట్లో ధూమపానంఒక్కటే ఏకైకమందన్న నమ్మకం బాగా ప్రబలింది. అందుకని ఆ వ్యాధిరాకుండా ఉండేందుకు చిన్నపిల్లల్ని కూడా పొగ తాగమని ప్రోత్సహించేవారుట

## దివ్యౌషధం

పాముని చూసి ఆమడ దూరం పరిగెత్తడం మాట అటుంచి పాముపేరు చెబితేనే జడుసుకుని జ్వరం తెచ్చుకునే వాళ్ళు చాలామందే వున్నారు. పామెంత అందమైనదో అంత ప్రమాదమైనది కావడమే అందుకు కారణం. కానీ పాము విషం వైద్యపరంగా ఎంత అమోఘంగా పన్జేసి అద్భుత ఫలితాలనిస్తుందో తెలుసుకుంటే పరమాశ్చర్యం కలుగుతుంది.

పాము విషంలో ఎంజైముల నిలువ ఎక్కువగా వుండడం వల్ల విషానికి విరుగుడు మందులు తయారుచేయడంలోనూ, బయోకెమికల్ పరిశోధనల్లోనూ విరివిగా వాడుతున్నారు. తాచు



పాము విషంతో ఎలకల్లో వచ్చే 'మౌస్ సర్కోమా' అనే కాన్సర్ వ్యాధిని నిరోధించవచ్చునని ఇటీవల పరీక్షలవల్ల నిర్ధారణ అయింది. మానవుల్లో వచ్చే కొన్ని రకాల కాన్సర్ నిరోధానికి తాచుపాము విషం వాడే విషయంలో బెల్జియం శాస్త్రవేత్తలు తీవ్ర కృషి చేస్తున్నారు.

హీమోఫీలియా వ్యాధికి రస్సెల్ వైపర్ పాము విషాన్ని విరుగుడు మందు తయారీలో ఉపయోగిస్తున్నారు. నరాలకు సంబంధించిన కుష్టవ్యాధి వున్నవారి నొప్పులను, బాధలను తగ్గించేందుకు అతి స్వల్పమోతాదుల్లో తాచుపాము విషం మందుగా ఇస్తారు. అంతేగాక వైద్యులు పెదవి విరిచిన కాన్సర్ రోగానికి కూడా తాచుపాము విషం దివ్యౌషధంలా పనిచేస్తుంది.

ఆయుర్వేదంలో క్షయ, కలరా వ్యాధుల్ని నివారించే శుచిక చరణ రసం తయారీలో తాచుపాము విషాన్ని వాడుతారు. పాముల విషాన్నుంచి న్యూరో టాక్సిన్, ఫాస్ఫోడిఎక్స్ట్రీజ్ వంటి ఖరీదైన ఎంజైములను వెలికి తీస్తున్నారు. భారతదేశంలో ఒక గ్రాము తాచుపాము విషం ఖరీదు 150 రూపాయలు. కట్ల పాము విషం ఒక గ్రాము 200 రూపాయలు.

మంచి నైపుణ్యం వున్నవారి మార్గదర్శకత్వంలో పాముల్ని పట్టుకుని విషాన్ని సేకరించడం పట్ల శ్రద్ధ చూపితే ఎంతో మంది నిరుద్యోగులకు ఉద్యోగాలు దొరకడం మాట అటుంచి గ్రామాల్లో పాముల్ని పట్టేయడం వల్ల గ్రామస్థులకు పురుగుపుట్రా బెడద తప్పించడం మాత్రం ఖాయం. ఫలితానికై వేచిచూడ్డమే మిగిలింది.

# షావోలిన్ గుడి

గుడి అనగానే దేవుడు, పూజలు, నైవేద్యం, ప్రసాదంగుర్తొస్తాయి. షావోలిన్ అనగానే ఈమధ్య బాక్సాఫీస్‌ను బద్దలు కొట్టి విజయభేరి మోగించిన '36 ఛాంబర్స్ ఆఫ్ షావోలిన్' సినిమా గుర్తొస్తుంది. కానీ చైనీయులకు మాత్రం వీరవిద్యలకు పెట్టింది పేరుగా షావోలిన్ గుడి ప్రసిద్ధి.

శాస్త్రీయమైన చైనీస్ శౌరవిద్యలకు ఆలయమైన షావోలిన్ను భూలోక స్వర్గంగా చైనీయులు భావిస్తారు. అది ఉచ్ఛస్థితిలో వున్నపుడు దాన్లో వెయ్యిమంది సన్యాస వీరులుండేవారు. వీరవిద్యల్లో నిష్ణాతులైన ఉపాధ్యాయుల్ని ఆహ్వానించి మూడు సంవత్సరాల పాటు అక్కడ వుండే ఏర్పాటు చేసేవారు. అందరూకలసి చర్చించుకుని అందరి విద్యలనీ కలబోసి షావోలిన్ బాక్సింగ్ గైడ్‌ను రూపొందించారు. అందులో వందకి పైగా విద్య నేర్చుకునే పద్ధతులున్నాయి: ఆయుధాలతోను,ఖాళీచేతులతోను, గుర్రం మీద, కాళ్ళమీద నిలబడి – ఇలా వివిధ తీరుల్లో ఫైట్స్ చేయడం నేర్పిస్తారు.

అసలీ వీరవిద్యలు తొలుత భారత దేశంలోనే కనిపెట్టారనీ, తర్వాత తర్వాత అవి ఓ బౌద్ధ సన్యాసి ద్వారా చైనాకు పాకాయనీ కొందరు భారతీయుల నమ్మకం. షావోలిన్ అనేది హొనన్ సన్యాసుల మతం పేరు. అక్కడ ప్రఖ్యాత బౌద్ధ సన్యాసి బోధిధర్మ మొట్టమొదటగా క్రీ. శ. ఆరవ శతాబ్దంలో 18 రకాల ఎక్సర్‌సైజ్‌లను అభివృద్ధిచేశాడు. శారీరక దార్ఢ్యానికి, బలసంపదకోసం ఈ వ్యాయామక్రీడలను రూపొందించాడు.




ఈ విద్యలను తర్వాత మరింత పటిష్టమైన మార్పులను చేసి ఇతర సన్యాసులు, బౌద్ధమత విశ్వాసకులుగా పేర్కొనబడ్డ కొందరు అభివృద్ధి చేశారు. ఏదిఏమైనా వీరుల్ని తయారుచేసే షావోలిన్ ఇతర ప్రపంచానికి ఆదర్శప్రాయం.

# పోలీస్ పాము




**సినిమాల్లో**, సర్కసుల్లో ఏనుగులు, ఎలుగుబంట్లు, గుర్రాలు, కుక్కలు వగైరాలతో బాటు పాములు కూడా బ్రహ్మాండంగా నటించి బేష్ అన్పించుకోవడం మనం చూస్తూనే వున్నాం. ఇకపై పోలీసులు దొంగల్ని పట్టుకోవడంలో కుక్కలకి బదులు పాములకి ట్రైనింగ్ ఇవ్వటం 'మంచి పద్ధతిగా తోస్తోంది.

గ్వాలియర్‌కి ఆరు కిలోమీటర్ల దూరంలో వున్న శలోన్ గ్రామంలోని గుడిలో చొరబడి విలువైన స్వామివారి నగలను దొంగిలించబోయిన చోరశిఖామణిని పట్టుకుని పోలీసులకు అప్పజెప్పిందో పాము. ఓ దొంగల ముఠా అర్ధరాత్రి ఆనవాయితీగా దొంగతనానికి బయల్దేరారు. అంతకు ముందే పరమభక్తులుగా నటించి హారతి కళ్ళకద్దుకుంటూనే దేవుని మీది ఆభరణాల్ని అంచనా వేశారు. అర్ధరాత్రి తిన్నగా గుడికి వెళ్ళి గుడి పక్కనే చిన్న ఇంట్లో వున్న పూజారిని నిద్రలేపి తాళాలు తీయించి ఆ తర్వాత పూజారి పెడరెక్కలు విరిచి గుడి స్థంభానికి కట్టేశారు. నోరెత్తితే చంపేస్తామని బెదిరించి నగల్ని తీసి మెల్లగా మూటకట్టారు.

ఇంతలో ఎక్కణ్నించి వచ్చిందో ఏమో ఓ సర్పరాజు వచ్చి దొంగల నాయకుడి కాళ్ళకు చుట్టుకుపోయింది. అతనెంత వదిలించుకుందామన్నా పాము ఊడి రాలేదు సరికదా మరింత బిగదీసుకుంది కాటు వేసే ప్రయత్నాలేం చేయలేదు. అయినాగాని అతని అనుచరులు పాముని చూసి హడలి చచ్చి ఇంకెన్ని పాములొచ్చి తమ కాళ్ళను చుట్టుకుంటాయో, కాటేసి చంపుతాయోనని ప్రాణాలరిచేతిలో పెట్టుకుని, తమ నాయకుణ్ని రక్షించేదారి లేక నిస్సహాయంగా వుండిపోయారు. అదనుచూసి పూజారి "దొంగలుబాబోయ్! రక్షించండి'' అని కేకలుపెట్టాడు.

కేకలు విని, గుళ్ళో వెలుతురు, అలికిడి చూసి గ్రామస్థులు విషయం గ్రహించి కొందరు గుడి పరంకాలో కాపలా నిలబడి కొందర్ని పోలీసుల కోసం పంపారు. గుడి గుమ్మం ఎక్కిన పోలీసుల అలికిడి వినగానే పాము మెల్లగా దొంగల నాయకుడి కాళ్ళను వదిలేసి పాక్కుంటూ చీకట్లో అదృశ్యమైపోయింది. పోలీసులు అతన్ని అరెస్టు చేశారు. మిగతా దొంగలు ఈ పాము గొడవలో అటూ ఇటూ చూసి తప్పించుకుని పారిపోయారు. ✱

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly. Eenadu Compound, Hyderabad - 500 004.

# ప్రకృతి చెప్పే పాఠాలు...



ప్రకృతి నుంచి మనం నేర్చుకోదగ్గవి ఎన్నో ఉన్నాయి. కొద్ది కొద్దిగా కూడబెట్టి దాన్నే పెద్ద మొత్తంగా చేసే నేర్పు కూడా అందులో ఒకటి. ఈ సూత్రాన్ని ఆచరణలో పెట్టడానికి మార్గదర్శి మీకు తోడ్పడుతుంది. చిన్న చిన్న మొత్తాలలో పొదుపుచేసి పెద్ద మొత్తం పొందే అవకాశాలు మీ అందుబాటులో ఉంచుతుంది.

అంతేకాదు, రెండు దశాబ్దాల వ్యాపారానుభవం ఉన్న మార్గదర్శి మీరు పొదుపుచేసే మొత్తాలకు పూర్తి భద్రత సమకూరుస్తుంది. లాభసాటి డివిడెండ్లు కూడా వరుసగా ఆ మొత్తాలకు తోడవుతూ ఉంటాయి. మార్గదర్శిలో పొదుపు భవిష్యత్తుకు మదుపు అని లక్ష మందికి పైగా ఇప్పటికే గ్రహించారు. మరి, మీ మాటేమిటి ?

డబ్బు కోసమేనా మీ చింత - మార్గదర్శి వున్నది మీ చెంత!



## మార్గదర్శి

చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్

మార్గదర్శి హౌస్, ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

శాఖలు: ● ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ ● లక్డీకాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ ● చంద్రలోక్ కాంప్లెక్స్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● బందరు రోడ్, విజయవాడ ● మెయిన్ రోడ్, గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నీసుపేట, రాజమండ్రి ● నెహ్రూ రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్, ● వైరారోడ్, ఖమ్మం

KIRON/MCF/81/2